అపరాధ పరిశోధన అనుబంధం—114

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## అందాల భామ
రచన: వసుంధర

## హత్య మీద హత్య
రచన: బొమ్మిడి అచ్చారావు

## రాగద్వేషాలు
రచన: టెంపోరావ్

## సినిమా గ్లామర్
రచన: వాణిశ్రీ

అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 114
జూన్, 1983
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. పీ. మోహన్రావ్
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1

# అందాల భామ

వసుంధర

అది చిన్న పెంకుటిల్లు. అందులో ఉంటున్నది సుభద్రమ్మ. సుభద్రమ్మకు భర్త లేడు. కష్టపడి పెంచి చదివించి కొడుకు రామాన్ని గ్రాడ్యుయేట్ చేసింది. ఆమె ఆశలన్నీ రామంమీద నే వున్నాయిప్పుడు.

రామానికింకా ఉద్యోగం లేదు. ఉద్యోగ ప్రయత్నాలు చేస్తూనే అతడు అక్కడా ఇక్కడా అంతో యింతో సంపాదిస్తున్నాడు. ఆ సంపాదన మామూలు ఉద్యోగుల నెల జీతంకంటె ఎక్కువగానే ఉంటున్నది.

"మనమింక ఈ యింట్లో ఉండద్దమ్మా!" అన్నాడు రామం ఓ రోజు.

"ఈ యింటికేం వొచ్చిందిరా—" అంది తల్లి.

తలుపులకు పెచ్చులు ఊడివస్తున్నాయి. గోడలకు బెల్లులూడుతున్నాయి. దొడ్లోకి వున్న మురికి కాలువ ఎన్నిసార్లు శుభ్రం చేసినా బాగుపడడంలేదు. అందు లోంచి నీరు బయటకు పోవడంలేదు. వానపడితే ఇంట్లో

వున్నట్టుగాక చెట్టుకింద వున్నట్లుంది.
"అమ్మా — ఈ యింటికే వొచ్చిందా? అనడుగు తున్నావా —" అన్నాడు రామం ఆశ్చర్యంగా.
"అవున్రా — ఈ యిల్లే నిన్నింతవాణ్ని చేసింది. నెలకు యాభై రూపాయల అద్దెకు ఇంత పెద్దిల్లు మనకెలా దొరుకుతుందిరా —" అంది తల్లి.
"ఇప్పుడు మనమింకా ఎక్కువ అద్దె ఇవ్వగలం. ఇంత పెద్దిల్లూ మనకక్కర్లేదు —" అన్నాడు రామం.
సుభద్రమ్మ నులకమంచంమీద కూర్చుంది. కొడుక్కి ఆ మంచాన్ని చూపిస్తూ — "నేను అలసినప్పుడల్లా సేద తీర్చిన మంచం ఇది. ఈ రోజు నువ్వు పరుపుల మంచం ఇస్తానన్నా దీని సావాసం వదులుకోవాలనిపించదు నాకు —" అన్నది.
"బాగుందమ్మా — పరిస్థితులు బాగుపడినా మనం పేదరికాన్ని వదులుకోలేమా?" అన్నాడు రామం.
"పేదరికాన్ని వదులుకోవడంలో తప్పులేదు. కానీ అశాశ్వతమైన ఈ జీవితంలో కొన్ని బంధాలూ, అనుబంధాలూ కూడా ఏర్పర్చుకోవాలి. అప్పుడే జీవితం సక్రమ మార్గంలో నడుస్తుంది. ఇన్నాళ్ళు ఆశ్రయమిచ్చిన ఇంటిని ఈనాడు నువ్వు ఏవగించుకుంటే — ఇన్నాళ్లూ నిన్ను పెంచిన ఈ ముసలి తల్లిని కూడా ఏదో రోజున నువ్వు ఏవగించుకుంటావు —"
రామం కంగారుగా — "నేనేదో అంటే నువ్వింకేవో అర్థాలు కల్పించి మాట్లాడుతున్నావు. నాకు భయంగా వుంది —" అన్నాడు.
సుభద్రమ్మ అతడి జుత్తులోనికి వేళ్ళు పోనిచ్చి — "నీ యింటిని ఎలా వున్నా నువ్వు ప్రేమించగలిగితే — నీ

5

దేశాన్ని నువ్వు ప్రేమించగల్గుతావు. నీ తల్లిని ఎప్పుడూ అభిమానించగలిగితే స్త్రీ జాతిని నువ్వు గౌరవించగల్గుతావు. నీ దేశం, నీ దేశంలో స్త్రీ — ఈ రెండింటినీ ప్రత్యేకంగా అభిమానించి గౌరవించగల్గిననాడే నువ్వు ఉత్తమ పౌరుడివి కాగల్గుతావు. నువ్వొక ఆదర్శ పౌరుడిగా ఎప్పటికీ మనగలగాలన్నది నా కోరిక—" అన్నది.

రామం తడబడుతూ—"నామీద నీకేమైనా అనుమానంగా ఉన్నదా అమ్మా!" అనడిగాడు.

"నా మనసులో అనుమానం ప్రవేశించినపుడు నువ్వు నా కళ్ళలో చూసేది అభిమానం కాదు. అసహ్యం...." అంది సుభద్రమ్మ.

రాముం తల్లి కళ్ళలోకి చూడాలనుకున్నాడు. కానీ ఎందుకో భయంవేసింది. బయటకు వెడుతూ తల్లిని ఆశీర్వదించమని అడగాలనుకున్నాడు. కానీ అడగలేకపోయాడు.

'అమ్మ నన్ను ఆశీర్వదించదు—' అని అతడికి అనిపించింది.

రామం ఇంట్లోంచి బయటకు వస్తూ మరోసారి తన ఇంటిని చూశాడు—"ఈ యింటిని ఎలా ప్రేమించేది?" అనుకున్నాడు.

## 2

కాలింగ్ బెల్ చప్పుడు విని తలుపు తీసింది దుర్గ.

"మూర్తి ఇంట్లో లేడాండీ?" అన్నాడు వెంకట్.

"లేరు—" అంది దుర్గ.

"నేను లోపలకు రావచ్చా?" అన్నాడు వెంకట్ వినయంగా.

"అయ్యో—రండి—" అంది దుర్గ.

6

వెంకట్ లోపలకు వచ్చి కూర్చున్నాడు. ఇంటిని పరీక్షగా చూశాడు. అది డ్రాయింగ్ రూం. ఇంటివారి చక్కటి అభిరుచికి ప్రతీకగా వున్నా—అభిరుచికి తగ్గ ఐశ్వర్యంలేదనిపిస్తుంది.

వెంకట్ నిట్టూర్చి—"ఆ గోడకు అరేబియా గుఱ్ఱాల పోస్టర్ తగిలించమని మూర్తికి ఎన్నిమార్లో చెప్పాను.." అన్నాడు.

దుర్గ నవ్వి ఊరుకుంది.

"వాడు నేను చెబితే వినడు. పోనీ మీరు చెప్పొచ్చుగా—" అన్నాడు వెంకట్.

"మీ సూచన ఆయనకు బాగా నచ్చిందని నాకు తెలుసు. అందుకే నేను వేరే మళ్ళీ చెప్పడమెందుకని చెప్పలేదు—" అంది దుర్గ.

"నిజంగా నచ్చితే ఎందుకు కొనడు?" అన్నాడు వెంకట్.

"ఆ పోస్టర్ ఖరీదు మూడువేల నాలుగువందలు...."

"అయితే?"

"అంతకంటే ముఖ్యమైన అవసరాలు కొన్ని డబ్బు లేక ఆగిపోయాయి...."

"అరే—మూర్తి డబ్బు ఇబ్బందిలో ఉన్నాడా? నాకు చెప్పలేదే....!"

దుర్గ నవ్వి—"డబ్బు ఇబ్బందులేమీ లేవు. అవసరాలను తాత్కాలికంగా వాయిదా వేసుకున్నాం—అంతే! అయినా డబ్బు ఇబ్బందులు ఒకరికి చెప్పుకుంటే తీరిపోతాయా?" అంది.

"ఎందుకు తీరవు? నాకు చెప్పమనండి...." అన్నాడు వెంకట్.

"ఆయన ఇబ్బందులు తీర్చవలసిన అవసరం మీకేమిటి?"

"స్నేహితుణ్ణికదా!"

"ఆయనకు చాలామంది స్నేహితులున్నారు. స్నేహం స్నేహంకోసమే కానీ డబ్బుకోసం కాదని ఆయన అభిప్రాయం. అదీకాక అప్పుచేసి అవసరాలు తీర్చుకోవడం నాకు నచ్చదు...."

"పాయింట్ కొచ్చారు. నేనిచ్చేది అప్పుగా కాదే!"

"మరి—ఊరికే యిస్తారా?"

"ఊరికే యిస్తే తీసుకుందుకు మేము బిచ్చగాళ్ళమా అని మీరు అలగవచ్చు. అందుకని నేను మూర్తికి డబ్బు ఇస్తాను. ప్రతిఫలం మీనుంచి తీసుకుంటాను—" అన్నాడు వెంకట్ నవ్వుతూ.

దుర్గకు అర్థంకాలేదు — "నానుంచి ప్రతిఫలమా? అంటే? ప్రశ్న వేశాక ఆమెకు ఏదో స్ఫురించింది. అయితే వెంకట్ ఆమెకు చాలా కాలంగా తెలుసును. అతడు మూర్తికి ప్రియతమ స్నేహితుడు. ఎంతో బుద్ధిమంతుడు.

వెంకట్ ఇంకా నవ్వుతూనే—"మూర్తి ఆఫీసు పని మీద ఊరికి వెళ్ళాడనీ — రేపు సాయంత్రం దాకా తిరిగిరాడనీ తెలిసే నేనిప్పుడిక్కడికి వచ్చాను—" అన్నాడు.

"మీరనేదేమిటి?" అంది దుర్గ కంగారుగా.

"ఇంకా మనమధ్య మన్ననలెందుకు? సూటిగా చెప్తాను. నాకు నువ్వు కావాలి. నేను నీకోసం వచ్చాను-" అన్నాడు వెంకట్.

"గెటౌట్—" అంది దుర్గ ఆవేశంగా.

"ఎందుకు?"

"గెటౌట్!" అంది దుర్గ ఇంకా ఆవేశంగా.

"ఊరికే అరవకు. నువ్వలా అరిస్తే నేను బెదిరిపోతా ననుకోకు. నువ్వేమిటో, నీ చరిత్ర ఏమిటో తెలుసుకునే ఇక్కడకు వచ్చాను...." అన్నాడు వెంకట్.

దుర్గ ఇంకా ఆవేశపడిపోయింది. ఈసారి ఆమెకు నోటమాట రాలేదు.

"నేనేమీ నిన్ను రేప్ చేయబోవడంలేదు. ముందలా తాపీగా ఎదురుగా వున్న సోఫాలో కూర్చో. నీ మొగు డెలాగూ ఊళ్ళోలేడు. రేపటిదాకా రాడు. అంచేత ఆలస్యమైపోతోందన్న బెంగా నాకు లేదు. నేను చెప్పే దంతా తాపీగా విను. అంతా విన్నాక నువ్వే వచ్చి నా పక్కన కూర్చుంటావు...." అన్నాడు వెంకట్.

"నో....నో....నీ ముఖం చూడ్డంకూడా నాకిష్టంలేదు. నువ్వేం చెప్పినా నేను వినను. తక్షణం బయటకు నడు.." అంది దుర్గ.

"నేను చెప్పేది నువ్వెలాగూ వింటావని నాకు తెలుసు. అయినా ఎందుకైనా మంచిది—ముందీ ఫోటో చూడు...." అంటూ వెంకట్ ఓ ఫోటోను ఆమెకు చూపించాడు.

ఎదురుగా సోఫాలో కూర్చుని వున్న ఆమెకు ఆ ఫోటో స్పష్టంగా కనబడుతోంది. దాన్ని చూస్తూంటే ఆమె సిగ్గుతో బిక్క చచ్చిపోయింది. ఆ ఫోటో తనది! అందులో తను నగ్నంగా ఉన్నది. నగ్నంగా వున్నా ఫరవాలేకపోను .... కానీ తను ఎంత అసభ్యంగా.... ఊహకు కూడా నచ్చని విధంగా....

అప్పుడు గ్రహించింది దుర్గ. ఆ ఫోటో తనది! అది వెంకట్ చేతిలో ఉన్నది. ఆమె ఒక్క అంగలో ఆ

ఫోటో లాక్కుని ముక్కలు ముక్కలు చేసింది—"

"ఈ ఫోటో నీకు ఎక్కడిది?"

"అది నీది అని నీకు తెలుసు. ఎక్కడిదో తెలియదా?" అన్నాడు వెంకట్. వెటకారం అతడిగొంతులో ధ్వనించింది.

"గెటౌట్ .... గెటౌట్ ఫస్ట్!" అంది దుర్గ.

అనవసరంగా ఆవేశపడకు. ఫోటో చింపేశానని తృప్తి పడకు. నా దగ్గరివి ఇంకా చాలా కాపీలున్నాయి. కొన్ని ఇక్కడ....కొన్ని ఇంటి దగ్గర...."

దుర్గ హతాశురాలై సోఫాలో కూలబడింది.

వెంకట్ చేతిలో ఇంకో ఫోటో వెలసింది. ఆ ఫోటో నతడు రెండు చేతులతోటీ దుర్గ చూడానికి వీలుగా పట్టుకుని వున్నాడు. దుర్గ ఆ ఫోటోను చూస్తోంది. ఈసారి ఆవేశపడడంలేదు. దుఃఖిస్తోంది.

"నీకీ ఫోటో ఎక్కడిది?" అన్నదామె ఏడుపు కంఠంతో.

"ఎక్కడిదైతే నీకెందుకు? నిన్నిలా చూసే అవకాశం కల్పిస్తే— నేను నీకు కోరిన డబ్బు ఇస్తాను...." అన్నాడు వెంకట్.

"వెంకట్ .... నేనలాంటిదాన్ని కాదు. ఈ ఫోటో ఎలా తయారయిందో నాకు తెలియదు ..." అంది దుర్గ.

"నీచేత నేరం ఒప్పించడానికి నేను రాలేదు. నీతో కలిసి సుఖపడాలని వచ్చాను. అందుకు ప్రతిఫలంకూడా ఉంటుంది...."

"వెంకట్..నీ స్నేహితుడి భార్యను ఇలా వేధించడం నీకు తప్పుగా అనిపించడం లేదూ...." అంది దుర్గ.

"దుర్గా!" అన్నాడు వెంకట్ — "నా కోరిక

వినగానే గెటౌట్ అన్నావు నువ్వు. కానీ ఇప్పుడు ప్రతిమాలుకుంటున్నావు. నీలో ఇంత మార్పు రావడానికి కారణం ఈ ఫోటో! ఇంతకాలం స్నేహితుడి భార్యగా నీకూ నేను నా మనసులో గౌరవస్థానం ఇచ్చాను. కానీ ఇప్పుడివ్వలేను. నాలో మార్పుకి కారణం కూడా ఈ ఫోటోయే!"

దుర్గ కొన్ని క్షణాలు మాట్లాడలేదు. ఆమె ఆ ఫోటో వంకనే చూస్తోంది. ఇప్పుడామె సిగ్గుపడడంలేదు. ఆలోచిస్తోంది.

ఆ ఫోటోలో తను!

ఫోటోలో ఎంత లజ్జావిహీనంగా ప్రవర్తిస్తున్నదో ముఖంలో అంత సంతోషమూ ఉన్నది. తను....తను.... ఎన్నడూ అలా ప్రవర్తించలేదు.

ఇప్పటికీ భర్తముందు కూడా తను సిగ్గుపడుతుంది.

కానీ ఇదెలా జరిగింది?

కాసేపు ఫోటోవంకనే చూసి ఆమె కళ్ళు మూసుకుంది.

"నువ్వు మాట్లాడ్డంలేదు ..." అన్నాడు వెంకట్.

"మిష్టర్ వెంకట్! నువ్వు నీ స్నేహితుడి భార్యను గౌరవిస్తానని చెప్పావు. ఈ ఫోటోయే నీలో మార్పు తెచ్చినదని అన్నావు. ఈ ఫోటోను నావద్ద వదిలివెళ్లు. ఆ విషయమై నేను బాగా ఆలోచించవలసి వున్నది-" అంది దుర్గ.

"ఆల్ రైట్! నా దగ్గరింకా ఇలాంటి ఫోటోలు చాలా వున్నాయని గుర్తుంచుకో....నన్ను సుఖపెడితే ఆరేబియా కుబ్జాల పోస్టరు....లేదా నీ జీవితం కష్టాల పాలవుతుంది...." అన్నాడు వెంకట్.

"నేను నీకు నిర్ణయం తెలియబర్చేవరకూ నన్ను పూర్వపు దుర్గలాగునే చూడమని మనవి. దుర్గ నిప్పులాంటి మనిషని నీకు ఋజువు చేస్తాను. అలా చేయలేని నాడు నా భర్తను కూడా వదిలి వ్యభిచారిగా మారిపోతాను. అప్పుడు నా మొదటి విటుడివి నువ్వే అవుతావు—" అంది దుర్గ.

"ఈ మాటలు విని వెంకటే్ తడబడ్డాడు. అతడు ఫోటోను అక్కడ టేబిల్ మీద వదిలి మారు మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

## 3

"నేనెక్కడున్నాను?" అన్నది సుభద్రమ్మ.

"మీకిప్పుడెలాగుంది?" అన్నదో యువతి.

సుభద్రమ్మ కళ్ళు నలుమూలని పరిసరాలను పరికించింది. ఆశ్చర్యంతో ఆమె కళ్ళు పెద్దవయ్యాయి.

తాను శయనించింది పరుపుల మంచం. గది శోభాయమానంగా అలంకరించబడి ఉన్నది. తన ఎదుట నిలబడిన యువతి అమాయకంగా అందంగా వున్నది. వయసు బహుశా ఇరవై కూడా దాటకపోవచ్చు.

"ఎవరమ్మా నువ్వు!" అంది సుభద్రమ్మ.

"నా పేరు శోభ—" అన్నదా యువతి—"నేను గుడికి వచ్చాను. ఉన్నట్లుండి మీరో కేక పెట్టి పడిపోయారు. అక్కడున్నవారంతా కంగారుపడిపోతూంటే నేను మిమ్మల్ని ఇక్కడకు తీసుకుని వచ్చాను. డాక్టరు వచ్చి మిమ్మల్ని చూసి వెళ్ళాడు. మీకేమీ భయంలేదు. మీరు పడిపోవడానికి నీరసం కారణంట—"

"అవునమ్మా—నిన్నంతా ఉపవాసం చేశాను. ఈ రోజు గుడిలో దైవ దర్శనానంతరం ఇంటికి వెళ్ళి భోం

చేద్దామనుకున్నాను. ఈలోగా ఇలా అయింది. నీ మేలు మరిచిపోలేను—....” అంది సుభద్రమ్మ.

“ఇందులో మేలేముంది? సాటిమనిషిని ఆదుకోవడం కూడా ఒక విశేషమేనా?” అన్నది శోభ.

సుభద్రమ్మ లేచి — “ఇప్పటికే నీకు చాలా శ్రమ ఇచ్చాను. ఇంక ఉంటానమ్మా! యెప్పుడైనా నీ ఋణం తీర్చుకునే అవకాశం రావాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తాను” అని మంచం దిగింది.

“మీరు నాకు ఋణపడి వున్నారని నేననుకోవడం లేదు. మీరలా అనుకుంటూంటే నాదో మనవి. మీకు నేను ఋణం తీర్చుకునే అవకాశమిస్తాను. ఉపయోగించుకుంటారా?” అంది శోభ.

“చెప్పమ్మా!” అంది ఆశ్చర్యంగానూ, ఆత్రుతగానూ సుభద్రమ్మ.

“రోజూ మీ ఇంటికి వచ్చి కాసేపు మీతో మాట్లాడే అవకాశం నాకివ్వాలి—” అంది శోభ.

సుభద్రమ్మ ఆశ్చర్యంగా—“ఇదా నీ కోరిక!” అంది.

“మీరిది చాలా చిన్న కోరిక అని అనుకుంటున్నారు. కానీ నేనెవరో మీకు తెలిస్తే మీరు నా కోరిక తీర్చడానికి అంగీకరించరు...”

“నువ్వు ఎవరైనా మిగతా ప్రపంచం నిన్నేవిధంగా గుర్తించినా నేను మాత్రం నిన్ను నా ప్రాణదాతగా మాత్రమే గుర్తుంచుకుంటాను—” అంది సుభద్రమ్మ.

“నేనొక వేశ్యనని తెలిసినా కూడా మీరు నన్నొక ప్రాణదాతగానే గుర్తుంచుకుంటారా?” అంది శోభ చటుక్కున.

సుభద్రమ్మ తెల్లబోయింది. ఆమె శోభవంక ఒక్క—

క్షణం రెప్పవాల్చకుండా చూసి — "ఏ పెద్దింటికో కోడలిగా వెళ్ళవలసిన చిన్నారివి. నువ్వు వేశ్యవంటే నేను నమ్మలేను—" అంది.

"మీరు నమ్మినా నమ్మకపోయినా ఇది నిజం!" అంది శోభ.

సుభద్రమ్మ చటుక్కున కూర్చుంది. అంతవరకూ ఆమెకాయింట కాస్త ఇబ్బందిగా అనిపించింది. తను కట్టిన చీర మాసిందనీ, తన చేతి కోలుగోలు గాజులు నల్లబడ్డాయనీ, తన శరీరం చెమటకంపు కొడుతున్నదనీ, తన కాళ్ళకు చెప్పులు కూడా లేవనీ—ఆమెకా గదిలో అంతసేపూ అనిపించింది. కానీ శోభ వేశ్య అని తెలియగానే సుభద్రమ్మ తానే ఉన్నత స్థానంలో ఉన్న అనుభూతి చెందింది. తానొక దేవతగానూ ఆ శోభ ఒక పసిపాపలాగానూ ఆమెకు తోచింది.

"చూడమ్మా! ఇంతవరకూ అయినదేదో అయిపోయింది. నువ్వు పాత జీవితాన్ని కొనసాగించడానికి వీల్లేదు. నీ వద్ద ఆ విధంగా మాట తీసుకుని వెడతాను...." అంది సుభద్రమ్మ.

అప్పుడు శోభ చాలా తమాషాగా నవ్వింది. ఆ నవ్వులో కనులనుంచి ప్రతిఫలించిన వెలుగులు బుగ్గలపై నీడల నేర్పరచాయి. ఆ నీడలు కథలు చెప్పడంలేదు. అవే కావ్యాల్లా వున్నాయి.

"నేను కావాలని ఇటువంటి జీవితం ఆరంభించలేదమ్మా! ఒక పాపిష్టివాడి కారణంగా నాకీ గతి పట్టింది—" అంది శోభ.

"ఎవడమ్మా వాడు!"

శోభ ఈ ప్రశ్నను పట్టించుకోలేదు — "రెండేళ్ళ

క్రితం నా వివాహమయింది. నా భర్త నన్ను అపురూపంగా చూసుకునేవాడు. ఒకరోజున ఆయనకు ఓ ఫోటో అందింది. ఆ ఫోటో ఇప్పటికీ నావద్ద ఉన్నది..." అంటూ శోభ పక్కనే ఉన్న బీరువా తలుపు తెరిచి సుభద్రమ్మకు ఓ ఫోటో తీసి అందించింది.

సుభద్రమ్మ ఆ ఫోటో చూస్తూనే అప్రయత్నంగా కళ్లు మూసుకుని—"ఛీ!" అంది. ఇంకా ఏమో అనేదే కానీ ఆమె షాక్ తిన్నట్లుంది. ఆడవాళ్ళు అంత అసభ్యంగా ఫోటోలు తీయించుకుంటారన్న విషయం ఆమె ఊహకు కూడా అందనిది.

"నువ్వు...నువ్వు...ఈ ఫోటో తీయించుకున్నావా?" అంది సుభద్రమ్మ.

"ఏ ఆడదీ ఇలా ఫోటో తీయించుకోవాలనుకోదు" అంది శోభ — "ఈ ఫోటో నా భర్తకు అందింది. ఆయన నన్ననుమానించాడు. నేనేం చెప్పినా నమ్మలేదు. నా గురించి ఆయనకు చెడ్డగా చెబుతున్న వాడొకడున్నాడట. నా భర్త నిర్దాక్షిణ్యంగా నన్ను వాడికి అమ్మేశాడు. వాడు నన్నీ వృత్తిలోనికి దింపాడు. నా సంపాదనలో మూడువంతులు వాడికి. ఒక వంతు నాకు. నేను బొమ్మగానే తప్ప సమాజంలో ఆడదానిగా గుర్తించబడను—"

"మరి—మీవాళ్ళు కలగజేసుకోలేదా?"

"ఆయన నన్ను అమ్మేసి — లేచిపోయానని ఇంట్లో చెప్పారు. అంతా ఆయన మాటలే నమ్మారు. నా పుట్టింట్లో అంతా నన్ను అసహ్యించుకుంటున్నారు. నాకక్కడ స్థానంలేదు. విచిత్రమేమిటంటే ఆడదాని శీలానికి సమాజం ఎంతో విలువనిచ్చింది. పతితలకు అందులో

గౌరవస్థానం లేకుండా చేసింది. కానీ సమాజంలో అత్యంత గౌరవస్థానంలో ఉన్నవారందరూ పతితలను ప్రోత్సహిస్తారు—" అంది శోభ.

"నిన్ను చూస్తే నాకు జాలిగా వుంది—" అంది సుభద్రమ్మ.

"నేను రోజూ కాసేపు మీ యింటికి వచ్చి కూర్చుని మాట్లాడి వెళ్ళడానికి అంగీకరించడానికి సరిపడ జాలి మీకు నామీద వుందా?" అంది శోభ.

"నాతో ఏం మాట్లాడతావమ్మా?" అంది సుభద్రమ్మ.

"నాకు మనుషుల మధ్య మసలాలన్నది కోరిక. నా జీవితం నాకిష్టంలేదు. ఒంటరి ఆడదానికి రక్షణలేదు కాబట్టి ఈ జీవితంనుంచి బయటపడి నేను సాధించేదేమీ లేదు. నా వద్దకు వచ్చే మనుషులందరూ జంతువులు. వాళ్ళు నన్నో మరబొమ్మను చేసి ఆడుకుంటారు. అందుకే రోజూ కాసేపు మీతో...."

మధ్యలో సుభద్రమ్మ అందుకుని — "నువ్వింకేమీ అడక్కు.. నువ్వు రోజూ మా యింటికి రావచ్చు. నీమీద నాకు పూర్తి సానుభూతి వుంది.." అంది.

## 4

"ఏమండీ—నమస్కారం..." అన్నాడతను.

ఆ యువతి అతడివంక ఆశ్చర్యంగా చూసి—"మీరెవరో నాకు తెలియదు—" అంది.

అతడు నవ్వి — "మీరూ నాకు తెలియదు. నేను మీకు కాదు—మీ అందానికి నమస్కరించాను—" అన్నాడు.

ఆమె ఇబ్బంది పడింది. మాట్లాడకుండా ముందడుగు వేసింది.

"ఏమండీ—నన్నో పోకిరీ వెధవగా భావించకండి... నేను చాలా ఉత్తముణ్ని. మీవంటి అందం చాలా అరుదు. అందుకే నమస్కరించాను. అయితే నాకు మీతో ఇంకో చిన్న పని వుంది. ప్రముఖ నిర్మాత ప్రసాదరావు గారు మీకు తెలిసే వుంటారు. ఆయన "అందాల భామ" అనే చిత్రం తీస్తున్నారు. ఆ చిత్రంలో నేను కోడైరక్టరుగా ఉంటున్నాను. ఇంకా హీరోయిన్ ఫిక్సవలేదు. అంతా కొత్త ముఖాలకోసం అన్వేషిస్తున్నారు. ఆ అన్వేషణలోనే మీరు నా కళ్ళబడ్డారు—" అన్నాడతను.

ఆమె ఆశ్చర్యంగా—"నాకు సినిమా అవకాశమా?" అంది.

"అవును. మేము వెతుకుతున్న కథానాయకి మీ రేనని పిస్తోంది. దయుంచి మీరు నాతో బయల్దేరి రండి. మనం కాలినడకనే వెడదాం. మా యూనిట్ ఉన్న యిల్లు సరిగ్గా ఇక్కడకు ఒక కిలోమీటరు దూరంలో ఉంది. మీరు ఎంతోసేపు వుండనక్కర్లేదు. స్క్రీన్ టెస్టుకు పదిహేను నిమిషాలు. జస్టు ఫిఫ్టీన్ మినిట్స్..." అన్నాడతను.

ఆ యువతికేమనాలో అర్థం కా లే దు. అతడు చూడ్డానికి పెద్దమనిషిలాగున్నాడు. ఆమె తటపటాయిస్తూండగా ఓ యువతి హడావుడిగా అటువచ్చి—"అరే—లీలా! మన మాలతికి యాక్సిడెంటయిందట—తెలుసా?" అంది.

లీల ఉలిక్కిపడి — "నాకు తెలియదే — ఇప్పుడది ఎక్కడుందే?" అంది.

"ప్రమాదమేమీ లేదుట. హాస్పిటల్లో ఉందిట.

నేను వెళుతున్నాను. వస్తావా?"

లీల ఆ యువతితో బయల్దేర బోతూండగా ఆ యువకుడు—"ఏమండీ—అందాల భామ ..." అని ఏదో అనబోయాడు.

"సారీ — నేనిప్పుడు రాలేను...." అన్నది లీల.

అతను చటుక్కున కాగితంమీద ఓ అడ్రసు రాసిచ్చి పోనీ ఓ గంటలో ఈ అడ్రసుకు రండి. కావాలంటే మీకు కావలసిన వాళ్ళెవరినైనా కూడా తీసుకుని రావచ్చు" అని చెప్పాడు.

లీల ఆ చీటీ తీసుకుని—"అలాగే—" అని చెప్పి పరుగున ముందుకు నడుస్తున్న యువతిని అందుకుంది. ఇద్దరూ కలిసి హాస్పిటల్ చేరుకునేందుకు ఎంతోసేపు పట్టలేదు. వాళ్ళిద్దరూ చేరుకునేసరికి గదిలో మాలతి ఒక్కతే వుంది.

"ఇప్పటికి నన్ను చూడ్డానికి పాతికమంది వచ్చి వెళ్ళారు. మీరు వస్తే మాత్రం ప్రాణం లేచివచ్చినట్లుంది" అంది మాలతి.

"ఎలా వుంది?" అంది లీల.

మాలతి యాక్సిడెంటు గురించి చెప్పింది. దురదృష్టవశాత్తూ రిక్షా బోర్లా పడింది. అదృష్టవశాత్తూ ఎముకలు విరగలేదు.

"కానీ — నేనిక్కడ రేపటిదాకా ఉండాలంట. అదే బోరు—" అన్నదామె.

"మరి నేను వస్తాను—" అంది లీల.

"అదేమిటే — మొహం చూపించడానికా వచ్చింది!"

"కాదే—చిన్న పని వుంది—" అంది లీల.

"పన్లుంటే వాయిదా వెయ్యవే—" అంది మాలతి.

"నాకు మాత్రం వాయిదా వెయ్యడానికి లేదు. ఇంటి దగ్గర బాబును వదిలిపెట్టి వచ్చాను. నీవు బాగానే వుందని తెలిసిందిగా—" అని జవాబుకోసం ఎదురుచూడకుండా వెళ్ళిపోయింది లీలతో వచ్చిన యువతి.

"నాకు గట్టిగా నాలుగు దెబ్బలైనా తగిలినా బాగుండును—" అంది మాలతి నిట్టూర్చుతూ.

"అదేం మాటలే—" అంది లీల మందలింపు ధోరణిలో.

"అవునే మరి! ఆత్రుతగా నన్ను చూడ్డానికి వచ్చిన వాళ్ళందరూ ఇంతేనా అని నిరుత్సాహపడి వెళ్ళిపోతున్నారు. వాళ్ళ నిరుత్సాహం చూస్తుంటే ఇక్కడున్నందుకు నాకు సిగ్గుగా కూడా వుంది. కానీ నువ్వయినా కూర్చుని కబుర్లు చెప్పవే!" అంది మాలతి.

"అందుకు నాకు అభ్యంతరమేమీ లేదు. కానీ...." అంటూ తనకు వచ్చిన సినిమా ఆఫర్ గురించి చెప్పింది లీల.

మాలతి చటుక్కున-"ఏమి అదృష్టమే నీది!" అంది.

"సినిమా ఛాన్స నిజంగానే వస్తుందంటావా?" అంది లీల.

"నీ అదృష్టం సినిమా ఛాన్సుకాదు. ఈ విషయం ముందుగా నాకు చెప్పడం—" అంది మాలతి.

"అంటే?"

"నువ్వు సినిమా ఛాన్సుకని అక్కడికి వెళ్ళావంటే కొంప మునిగిపోను—" అంది మాలతి.

"ఏమిటే—నీకేదో రహస్యం తెలిసినట్టుందే...." అంది లీల.

"అవును. రహస్యమే! అయితే అది ఒకరికి చెప్పాక నే రహస్యం కాదు. కానీ నువ్వు నా ఆత్మీయురాలివి కాబట్టి ఇది చెబుతున్నాను. ఆత్మీయురాలివైనా ఈ రహస్యం చెప్పకూడదు. కానీ రహస్యం తెలిస్తే తప్ప నిన్ను ఆపడం కష్టం—అందుకని జరిగిన విషయం నీకు చెప్తాను....." అంది మాలతి.

"అబ్బ-సస్పెన్సుతో చంపేస్తున్నావే.," అంది లీల.

"సస్పెన్స్ కాదు బాబూ — జరిగింది చెప్పడానికి ఎంత సిగ్గుపడుతున్నానో—మానసికంగా నన్ను నేనిలా సిద్ధం చేసుకుంటున్నానో నీకు నేను అంతా చెప్పేదాకా అర్థంకాదు—" అంది మాలతి.

* * *

"నమస్కారం మేడమ్!"

మాలతి ఉలిక్కిపడి అటు చూసింది.

ఎదురుగా ఓ అందమైన యువకుడు రెండు చేతులూ జోడించి వున్నాడు. అప్రయత్నంగా తనూ చేతులు జోడించి—"నమస్కారం—" అంది మాలతి.

"మీ నమస్కారం నాకు గౌరవాన్నిచ్చింది—" అన్నాడతడు.

"మీరెవరో నేను తెలుసుకోవచ్చా?" అంది మాలతి.

"అందాల భామ పిక్చర్ కి కోడైరెక్టర్ని —" అన్నాడతను.

ఆమె అర్థంకానట్లు ముఖం పెట్టింది.

అతడు అందాల భామ చిత్రం గురించి వివరించి ఆమెను కథానాయికగా బుక్ చేయాలనుకుంటున్నట్లు చెప్పాడు.

"నాకు సినిమా అవకాశమా?" అంద మాలతి ఆశ్చ

ర్యాంగా.

"మీరు సినిమాల్లో ప్రవేశిస్తే సినీ ఫీల్డుకే గౌరవం-" అన్నాడతడు.

"ముందు మావాళ్ళకు చెప్పాలి—" అన్నది మాలతి.

"ఇప్పుడే రావాలి మీరు. మళ్ళీ రెండ్రోజులదాకా అవకాశం రాదు. కావాలంటే మీకూడా తెలిసిన వారెవరినైనా తీసుకుని రావచ్చును—" అన్నాడతడు.

మాలతికి అతడిమీద నమ్మకం కుదిరింది. ఆమె ఆలోచిస్తూండగానే అలా వెడుతున్న సుధీర్ కనిపించాడు. సుధీర్ వాళ్ళ పొరుగింటి అబ్బాయి. చిన్నతనంనుంచీ మాలతికి తెలుసు.

సుధీర్ చురుకు మనిషి. ఒక్కడూ నలుగురికి సమాధానం చెప్పగల సత్తా వుంది. అతణ్ని చూడగానే ఆమెకు ధైర్యం వచ్చింది. అతణ్ణి పిలిచి విషయం చెప్పింది.

"సినిమాల్లో చేరడానికి మీ వాళ్ళొప్పుకుంటారా?" అన్నాడు సుధీర్.

"ఇది స్క్రీన్ టెస్టే కదా! సెలక్టయ్యాక మిగతా విషయాలు ఆలోచించుకోవచ్చు. జస్ట్ వెళ్ళిరావడమే గదా! ధైర్యానికి కాస్త తోడుగా వుంటావని."

ఇద్దరూ ఆ యువకుడితో బయల్దేరి ఓ యిల్లు చేరుకున్నారు. చిన్న బంగళా అది. చుట్టూ తోట వుంది. బంగళా లోపల నీటుగా వుంది.

మాలతినీ, సుధీర్‌నీ ఓ సోఫాలో కూర్చోమని చెప్పి ఆ యువకుడు లోపలకు వెళ్ళాడు.

కొద్ది నిమిషాలలో ఓ యువతి వచ్చి మాలతిని స్క్రీన్ టెస్టుకు రమ్మనమని పిలిచింది. ఇద్దరూ కలిసి ఓ చిన్న గదిలోకి వెళ్ళారు. సుధీర్ హాల్లో వుండిపోయాడు.

ఆ యువతి తలుపులు వేసింది. పక్కన ఉన్న చిన్న బీరువా వద్దకు నడిచింది. అందులోంచి అయిదు రకాల ఆధునిక దుస్తులు తీసింది.

"నిన్ను రకరకాల దుస్తుల్లో ఫోటోలు తీయాలి. త్వరగా బట్టలు మార్చుకో —" అన్నదామె.

"నువ్వు కాస్త బయటకు వెళ్ళు—" అన్నది మాలతి.

"ఆడవాళ్ళు ఆడవాళ్ళ వద్ద సిగ్గుపడకూడదు—" అన్నదామె.

మాలతి ఒప్పుకోలేదు. అప్పుడు పక్కన వున్న మరో తలుపు తెరుచుకుని వెళ్ళిపోయిందా యువతి.

మాలతి త్వరత్వరగా తన ఒంటిమీద బట్టలు తీసేసింది. అక్కడున్న అయిదు జతల్లో ఏది ముందు వేసుకోవాలా అని ఆలోచిస్తూండగా చటుక్కున పక్కనున్న తలుపు తెరుచుకుంది. అయితే వచ్చిందా యువతికాదు. తనను సినిమా పేరు చెప్పి అక్కడకు తీసుకువచ్చిన యువకుడు.

"భేష్! నువ్విలాగే బాగున్నావు. నీకిలాగే ఫోటోలు తీస్తాను...." అంటూనే చేతిలోని కెమెరాను క్లిక్‌మనిపించాడు.

మాలతి సిగ్గుతో చచ్చిపోయింది — "ఏమిటిది?" అంది గట్టిగా.

"అరవకు. ఇది సౌండ్ ప్రూఫ్ రూం—" అన్నాడతడు.

మాలతి వాడి ట్రాప్‌లో పడిపోయింది. ఆమె ఎంత గోలపెట్టినా ప్రయోజనం లేకపోయింది.

"నేను నిన్ను అనుభవానికని తీసుకుని రాలేదు. నాకు కొన్ని ఫోటోలు కావాలి. తీసుకుంటాను. నిన్ను నేను

ఏవిధంగానూ బాధించను. మర్యాదగా నా పని పూర్తి చేస్తే ఆ ఫోటోలు కూడా వెలుగులోకి రావు. లేదా....” అని బెదిరించాడతడు.

మాలతికి అంగీకరించక తప్పలేదు. తన భవిష్యత్తును దృష్టిలో ఉంచుకుని తాత్కాలికంగా సిగ్గును పక్కకు నెట్టింది. కనుల నీరు కారుతూండగా, మనసు తన్ను తనే అసహ్యించుకుంటూండగా అతడెలా కోరితే అలా ఫోటోలు తీసుకునే వీలు కల్పించింది.

“గుడ్! నీకింక ఏ భయమూ లేదు-” అన్నాడతడు.

మాలతి బట్టలు వేసుకుంది. అతడు పక్క గదిలోకి వెళ్ళిపోతూ—“నీ ముఖం సరిగ్గా లేదు. నీ స్నేహితుడికి అనుమానం రాకుండా నటించు. వెళ్ళు—” అన్నాడు. అతడు వెళ్ళగానే ఆ యువతి గదిలోకి వచ్చింది.

“ఇలా ఎందుకు చేశావ్?” అన్నది మాలతి హీన స్వరంతో.

“ఇది మా వ్యాపారం....” అన్నదా యువతి.

“ఇలాంటి వ్యాపారం చేయడానికి సిగ్గు వేయడం లేదూ?” అంది మాలతి.

“ఆడపిల్లలతో లే వ్యాపారం చేసే చాలామందికంటె మేము మెరుగు—” అందా యువతి ఏ మాత్రమూ సిగ్గు పడకుండా.

ఆ యువతి, మాలతి కలిసి బయటకు వచ్చారు.

“స్క్రీన్ టెస్టు ఎలా జరిగింది?” సుధీర్ అడిగాడు.

“మా సంస్థ మహిళకు ప్రత్యేక మర్యాదనిస్తుంది. స్క్రీన్ టెస్టుకు ఆడవాళ్ళనే నియోగించడం కేవలం మా ప్రత్యేకత—” అన్నదా యువతి.

మాలతి మాట్లాడలేదు. సుధీర్ మాత్రం ఆ సంస్థను

అదే పనిగా పొగిడాడు. ఆ పొగడ్తలు మాలతికి ములుకుల్లా ఉన్నాయి. అయినా ఆమె భరించింది తప్పితే సుధీర్ తో ఏమీ అనలేదు

* * *

"అమ్మ బాబోయ్—" అంది లీల. ఆమె గజగజ వణికిపోతోంది.

"నీకేమీ జరగలేదు కదే-ఎందుకలా వణికిపోతావు?" అంది మాలతి.

"కూడా అయినవాళ్ళను తీసుకువెళ్ళవమ్మ నంటే ఏమో అనుకున్నాను. నేనా సంపను పూర్తిగా నమ్మాను. కానీ నే నెలాంటి ప్రమాదంలో ఇరుక్కోబోయానో తల్చుకుంటే నా ఒళ్ళంతా జలదరిస్తోంది—" అంది లీల.

"ఆ ఫోటోలను వాళ్ళేం చేసుకుంటారో తెలియదు. అప్పట్నించీ నా మనసులో బెంగగా ఉంది—" అంది మాలతి.

"ఏం చేసుకుంటా రేమిటీ—కొందరు మగ వెధవ లలాంటి ఫోటోల్ని యెంత డబ్బయినా పోసి కొంటా రుట—" అంది లీల.

"ఆ నా ఫోటోల్ని మగాళ్ళు చూస్తారంటే సిగ్గుతో వళ్ళు చచ్చిపోతోంది. ఆ ఫోటోలు చూసిన వెధవ తర్వా తెప్పుడయినా చూస్తే....?"

"మాలతీ—నీ యాక్సిడెంటు కాదుకానీ—నన్నో పెద్ద యాక్సిడెంటు నించి తప్పించింది. నీ మేలు మరవలేనే!" అంది లీల.

## 5

అతను లోపలకు వచ్చి తలుపు వేసి "దుర్గా!" అంటూ ఆమెను బలంగా కౌగలించుకొని గాలిలోకి ఎత్తే

కాడు.

"ఏమిటండీ యీ సినిమా ఆవేశం?" మందలించింది దుర్గ.

"ఏమిటో దుర్గా—ఒక్క రోజు నీకు దూరమయ్యానంటే ఏమిటో పిచ్చెత్తినట్లుంటుంది నాకు—" అన్నాడు మూర్తి.

"ఇప్పుడిలా అంటున్నారు. కానీ మీరు నన్ను ఒక్క-రోజు కూడా చూడకూడదనుకునే రోజు ముందున్నదని నా అనుమానం—" అంది దుర్గ.

"ఛీ—అలాంటి మాట లనొద్దు—" అన్నాడు మూర్తి.

"ఏమండీ—మీకు నా మీద పూర్తి నమ్మక మే కదూ—" అంది దుర్గ దిగులుగా.

"అదేమిటి? నీ కలాంటి అనుమాన మెందుకు వచ్చింది?" ఏదో వ్యవహార ముంటున్న విషయం బుర్రలో కెక్కడం వల్ల మూర్తికి మూడ్ మారింది.

"ముందలా దూరంగా కూర్చోండి—మీకో విచిత్రం చూపిస్తాను—" అంది దుర్గ.

మూర్తి వేరే సోఫాలో కూర్చున్నాడు.

దుర్గ ఓ ఫోటోతో అతడి ముందుకు వచ్చి—"ఇది చూడండి—" అంటూ అతిడికి అందించింది.

మూర్తి ఆ ఫోటోను అందుకొని చూసి ఆశ్చర్యపోయి "వారెవ్వా!" అని ఫోటోను ముద్దు పెట్టుకుని—హౌ డిడ్ యూ డూ దిస్—" అన్నాడు.

"యువర్ ఇంగ్లీష్ ప్లీజ్.—" అంది దుర్గ.

"నా ఇంగ్లీషును తప్పుపడితే నీ కింగ్లీషు రాదని అర్థం. కానీ నా కింత మంచి ప్రజంటేష నివ్వాలని నీ కెలా

బుద్ధి పుట్టింది?" అన్నాడు మూర్తి ఉత్సాహంగా.

దుర్గ కళ్ళలో నీళ్ళు తిరిగాయి—"మీ రా ఫోటోను చూసి ఆనందిస్తున్నారు. కానీ ఆ ఫోటో ఎలా వచ్చిందీ అని ఆలోచించడం లేదు —" అంది.

మూర్తి వులిక్కిపడ్డాడు. క్షణంలో అతడి ముఖం గంభీరంగా అయిపోయింది—"అవును.... ఈ ఫోటో ఎలా తీయగలిగావ్!"

"నేను తీయలేదు. ఇది నాకు చేరింది...." అంది దుర్గ.

"వాట్!" అన్నాడు మూర్తి.

"ఈ ఫోటోను మీ స్నేహితుడొకడు నాకిచ్చి—ఇప్పుడు నీ చరిత్ర నాకు తెలిసిపోయింది. మర్యాదగా నాకు లొంగిపో—అన్నాడు—" అని దుర్గ ఏడ్చేసింది.

మూర్తి ఆమెను ఓదార్చలేదు. అతడికి బుర్ర పని చేస్తున్నట్లు లేదు. ఆ ఫోటో ఇతరుల ద్వారా తన భార్యకు చేరిందనగానే మొట్టమొదటగా అతడికి స్ఫురించినది—మరో మగాడు ఆ ఫోటో చూశాడని!

"అసలేం జరిగింది దుర్గా!"

"జరిగింది మీకు చెప్పానుగా!" అంది దుర్గ.

"ఎవరా స్నేహితుడు?" అన్నాడు మూర్తి.

"ఆ స్నేహితుడి పేరు తెలుసుకొని ప్రయోజనం లేదు. తప్పు అతడిది కాదు...." అంది దుర్గ.

"అది సరే—అసలిలాంటి ఫోటో తీయించుకోవాలన్న సరదా నీ కెందుకు కలిగింది?" అదోలా అన్నాడు మూర్తి.

"అలాంటి సరదా నాకు కలుగుతుందన్న అనుమానం మీ కుందా?" అంది దుర్గ దీనంగా.

"పోనీ— ఇలాంటి ఫోటో తీయించుకోవాల్సిన పరిస్థితు లెలా వచ్చాయి?" అన్నాడు మూర్తి.

"ఆ ఫోటో— నాదే అని మీ రనుకుంటున్నారా?" అంది దుర్గ.

"అంటే?"

"ఆ ఫోటో నాది కాదు—"

"దుర్గా— ఈ ఫోటో నీదయినంత మాత్రాన నిన్ను నేను వదిలిపెట్టను. కానీ నన్ను మోసం చేయాలనుకొంటే మాత్రం సహించలేను—" అన్నాడు మూర్తి చిరుకోపంతో.

"మిమ్మల్ని మోసంచేసే ఉద్దేశ్యముంటే ఈ ఫోటో మీకు చూపించేదాన్నే కాదు. మీ స్నేహితుడికి మీకు తెలియకుండా లొంగిపోయి ఉండేదాన్ని—" అంది దుర్గ.

"మరి?"

"ఇన్నాళ్ళ మీ సాహచర్యంలో మీ మీద ఏర్పడిన నమ్మకంతో నే నీ ఫోటోను మీకు చూపించాను. సావధానంగా ఆ ఫోటోను పరిశీలించండి—" అంది దుర్గ.

"నా బుర్ర పని చేయడం లేదు—" అన్నాడు మూర్తి.

"పోనీ నేనే చెబుతాను...." అంది దుర్గ.

మూర్తి నిస్సహాయంగా వెనక్కి వాలిపోయాడు.

"ఫోటోలో నా చెవులకున్న రింగులు చూశారా?" అంది దుర్గ.

మూర్తి ఫోటోను చూశాడు. ఆ రింగులు చూడగానే అతడి బుర్రలో ఏదో తళుక్కుమంది.

"ఇవి.... ఇవి.... కమల రింగులు కదూ!" అన్నాడతడు.

అతడికి ఒక్కసారి గతం గుర్తుకు వచ్చింది:

కొద్ది నెలల క్రితం మూర్తి మరదలు కమల మూర్తి ఇంటికి వచ్చింది. కమల గురించి దుర్గ మూర్తిని తరచుగా మేలమాడుతూంటుంది. కమలను చూసేక దుర్గకు ఆమె పైన ప్రేమ పుట్టుకు వచ్చింది. కమల చాలా అమాయకు రాలు. మాయామర్మం తెలియని మనిషి.

కమల ఓ కొత్త డిజైన్ రింగులు పెట్టుకుంది. అలాంటివి దుర్గ ఎక్కడా చూడలేదు. "చాలా బాగు న్నాయి—" అని పదేపదే ఆమె మెచ్చుకుంటే-"పోనీ- నువ్వు తీసేసుకో—" అంది కమల.

"రింగులు బాగున్నాయి కాబట్టి బాగున్నాయన్నాను కానీ నాకవి పెట్టుకోవడం ఇష్టముండదు-..నీ ముఖానికవి ఎంతో అందాన్నిచ్చాయి—...." అంది దుర్గ.

"రింగులు నీ ముఖానికి నప్పుతాయి. నిజానికి నాకంటే నువ్వే అందమైనదానివి—" అంది కమల.

దుర్గ ఎంతవద్దన్నా ఒప్పుకోలేదు కమల. కనీసం ఒక్కపూటైనా పెట్టుకోమని బలవంతం చేయడంవల్ల దుర్గకు వాటిని ధరించక తప్పలేదు. ఆరోజంతా ముగ్గురూ కలిసి తిరిగారు. ఆ రాత్రే కమల వెళ్ళిపోయింది. వెళ్ళే టప్పుడు దుర్గ ఆమె రింగులు ఆమెకు తిరిగి ఇచ్చేసింది—

"జీవితంలో ఒకేఒక్కసారి కొద్ది గంటలసేపు ధరించానా రింగులు. ఆ కొద్ది గంటల్లోనూ కొన్ని క్షణాలు కూడా మిమ్మల్ని విడిచి వెళ్ళిన గుర్తులేదు. మనం పూర్తిగా కలిసి ఉన్నామని జ్ఞాపకం—" అంది దుర్గ.

"అవును. నాకూ అలాగే గుర్తు. కానీ...." అన్నాడు మూర్తి. అటువంటప్పుడు ఈ రింగుల్లో ఇలాంటి ఫోటో దుర్గకెలా సాధ్యపడింది?

"మీరు ఫోటోను శ్రద్ధగా గమనించండి. అది నాది కాదు—" అంది దుర్గ.

"అంటే?" అన్నాడు మూర్తి.

"మోకాలుకు కాస్త పైగా కుడికాలు మీద నాకు పొడువాటి నల్లటి మచ్చ ఉన్న విషయం మీరప్పుడే మరిచిపోయారా? ఈ ఫోటోలో అది లేదు...."

"అవును.." అన్నాడు మూర్తి. కానీ అతడికి వెంటనే ఏదో స్ఫురించింది — "మచ్చల్ని పోగొట్టడం ఫోటోగ్రఫీలో పెద్ద కష్టం కాదు...." అన్నాడు.

అంటే ఇది ఫోటోగ్రాఫిక్ ట్రిక్ అంటారా?" అంది దుర్గ.

"కావచ్చు—" అన్నాడు మూర్తి.

"అటువంటప్పుడు — ఈ ఫోటోగ్రాఫీ ఓ ట్రిక్ అనుకోవచ్చుగా?"

"అంటే?"

"మీరు నన్ను నమ్ముతున్నారు కాబట్టి మరోరకంగా ఆలోచిద్దామనుకుంటున్నాను—" అంది దుర్గ.

భార్యాభర్తలిద్దరూ ఆలోచనలో పడ్డారు.

"పోనీ ఇది నీ ఫోటో కాదనుకుందాం. నీకులాంటి అమ్మాయి మరొకతె ఉండివుండాలి. నీకు కవల సోదరి ఉన్నదా?" అన్నాడు మూర్తి.

"నాకు కవల సోదరి లేదు. ఉన్నా ఇలాంటి ఫోటో తీయించుకోదు—" దృఢంగా అన్నది దుర్గ.

"మరైతే ఈ ఫోటో ఎలా తయారయిందంటావ్?"

ఒక్క క్షణం గదిలో నిశ్శబ్దం.

"ఈ ఫోటోను నాకిచ్చిన మీ స్నేహితుడి వద్దకు వెళ్ళండి. అది అతడెలా సంపాదించాడో తెలుసుకోండి"

అంది దుర్గ.

"వాడెవడో చెప్పు!" అన్నాడు మూర్తి.

## 6

వెంకట్ చెంప ఛెళ్ళుమంది. అతడు కోపంగా—

"వాటీజ్ దిస్ నాన్సెన్స్ మూర్తీ!" అన్నాడు.

"నీ స్నేహితుడి భార్యతో ఎలా మసలాలో తెలియనందుకీ నాన్సెన్స్ నీకు తప్పనిసరి అయింది—" అన్నాడు మూర్తి.

"అయితే నీ భార్య నిన్ను పంపిందన్నమాట—" అన్నాడు వెంకట్.

"నా భార్య నన్ను పంపలేదు. నాకు చెప్పింది. నేను వచ్చాను—"

"ఓహ్—చెబితే వచ్చావన్నమాట—అయితే ఆమె నీకు అంతా చెప్పలేదా?"

"నా భార్యకూ నాకూ మధ్య రహస్యాలు లేవు. ఆమె నాకు అంతా చెప్పింది. అన్నీ చెప్పింది—"

"ఓహ్—అయినా ఆమె తప్పు నువ్వు తెలుసుకోలేదన్నమాట!"

మూర్తి నవ్వి— "డియర్ ఫ్రెండ్ — తప్పుచేసిన వాళ్ళకూ చెయ్యనివాళ్ళకూ ఓ తేడా వుంటుంది. ఉదాహరణకు నువ్వు తప్పు చేయలేదనుకో— నేను నిన్ను లెంపకాయ కొట్టగానే నువ్వూ నన్ను కొట్టివుండేవాడివి...." అన్నాడు.

"ఆల్ రైట్....ఇప్పుడు నీ భార్య నీనుంచి దాచిన రహస్యం నేను చూపిస్తానుండు...." అన్నాడు వెంకట్.

"నీకా శ్రమ అవసరంలేదు. నువ్వు చూపించదల్చుకున్నది ఈ ఫోటోయేననుకుంటాను-" అన్నాడు మూర్తి.

వెంకట్ తెల్లబోయి ఆ ఫోటో అందుకుని—"ఇది ఇది....ఇది నీకెలా వచ్చింది?" అన్నాడు.

మూర్తి గంభీరంగా—"నాకూ, నా భార్యకూ మధ్య రహస్యాలు లేవు—" అన్నాడు.

"ఈ ఫోటో చూసేక కూడా ఇంకా నువ్వామెను భార్య అంటున్నావా?"

"నీకు తెలియదేమో — ఈ ఫోటోలో ఆమె నాకు భార్య కాదు...."

"మరి?"

"ఆమె ఎవరో తెలుసుకోవాలంటే — ఈ ఫోటో నీకెలా వచ్చిందో నేను తెలుసుకోవాలి...."

ఉన్నట్టుండి వెంకట్ పకపకా నవ్వి—"అర్థమయింది. నన్ను మధ్యపెట్టి ఈ ఫోటో నెగెటివ్ సంపాదించాలని చూస్తున్నావన్నమాట. అలాంటి ఆలోచనలు పెట్టుకోకు. నెగెటివ్ నా దగ్గర లేదు...." అన్నాడు.

మూర్తి సీరియస్‌గా మిత్రుడివంక చూసి—"నువ్వు నాకు చాలా పెద్ద ద్రోహం తలపెట్టావు. మన స్నేహాన్ని కూడా మరచి నా భార్య జోలికి రావాలనుకున్నావు. ఆమె ఎటువంటిదైనా భరించవలసినవాడిని నేను. ఈ ఫోటో నీ కళ్ళబడగానే నీవు ఆమె వద్దకు కాక నా వద్దకు రావాల్సింది—" అన్నాడు.

వెంకట్ తడబడి — "ఈ ఫోటో నీకు నీ భార్యే ఇచ్చిందా?" అన్నాడు.

"అవును...."

"ఇది నేనూహించని విషయం...." అన్నాడు వెంకట్.

"నువ్వూహించనిదింకొకటుంది. ఆ ఫోటోలో ఆమె

నా భార్య కాదు...."

"వ్వాట్!"

"చెప్పు. ఈ ఫోటో నీకెలా వచ్చిందో చెప్పు...."

వెంకట్ గుర్తుచేసుకుంటున్నాడు....

* * *

"సార్....ఈసారి అద్భుతమైన ఫోటో తెచ్చాను.."

"ఏదీ—" అన్నాడు వెంకట్ ఆత్రుతగా.

"డబ్బిస్తేనే చూపిస్తాను.." అన్నాడు ఆ యువకుడు.

"నేనెప్పుడైనా నిన్ను మోసం చేశానా?" అన్నాడు వెంకట్.

"మోసం గురించి కాదు సార్! ఈ ఫోటోలు చూడానికే కొంత ఛార్జి వుంటుంది...." అన్నాడా యువకుడు.

వెంకట్ కీ ఆ యువకుడికీ ఇది మామూలే! అతడు అందమైన అమ్మాయిలను నగ్నంగా, అసభ్యంగా ఫోటోలు తెస్తూంటాడు. వెంకట్ కు అలాంటి ఫోటోల సేకరణ ఇష్టం!

వెంకట్ లక్షాధికారి. విలాస పురుషుడు. అతడి ఆల్బంనిండా ఎందరో నగ్న సుందరీమణులున్నారు. అతడు ఎన్నిక చేసుకుని ప్రత్యేక స్థలాలకు కాల్ గరల్స్ని పిలిపించుకుంటాడు. తన ఆల్బంను వారితో కలిసి చూడడమూ, ఆల్బంలో విధంగా తనముందు ప్రవర్తించమనడమూ అతడి హాబీ. అయితే అతను గమనించిన విచిత్రమొకటి ఉన్నది.

కాల్ గరల్స్ బాగా చదువుకున్నవారు. సంస్కారమున్నవారు. డబ్బుకోసం ఈ వృత్తిని చేపట్టినవారు ఎక్కువ. వారిలో చాలామంది అతడి కోరికను పూర్తిగా

తిరస్కరించేవారు. కొంతమంది అంగీకరించినా-పూర్తిగా అంగీకరించినవారు బాగా తక్కువ. వాళ్ళు అనేదేమంటే "డబ్బు కోసం మరీ ఇంత నీచానికి దిగజారిపోవడం మావల్ల కాదు. శృంగారానికి కూడా సభ్యత వుంది. అసభ్య శృంగారానికి సిద్ధపడడం మావల్ల కాదు. మనం ఇద్దరు ప్రేమికుల్లా 2 గంటసేపు ఇక్కడ గడపడానికి అభ్యంతరంలేదు కానీ—ఇలా కాదు...." అని!

అతడు కోరినవిధంగా ఫోటోలు తీయించుకోడానికి ఒక్కరంటే ఒక్కరు కూడా అంగీకరించలేదు. వెంకట్ మనసులో అదో కోరికగా మిగిలిపోయింది. ఆ ఫోటోల్లోని యువతులు మరీ దిగజారినవారని అతడికి నమ్మకం ఏర్పడింది. అందుకే వారిని వెతుక్కొని పిలిపించుకోవాలన్నా అతడికి భయంగా ఉండేది.

ఆ యువకుడి చేతిలో రెండువందలు పెట్టి ఫోటోను చూపమన్నాడు వెంకట్. ఫోటోను చూడగానే అతడి శరీరం జలదరించింది.

ఫోటోలో యువతి ఎంత అసభ్యంగా ఉన్నదో— ఆమె అంగసౌష్టవం అంత ఆకర్షణీయంగా ఉన్నది. అయితే ఆమె ముఖం స్థానంలో నల్లగా ఉన్నది. ఇది అతడికి కొత్తకాదు.

"ముఖం లేదే?" అన్నాడు వెంకట్.

"ఈమె చాలా మర్యాదయిన కుటుంబం మనిషి. మా వ్యాపారం దృష్ట్యా ఆమెకు మాట ఇచ్చాను. ఫోటోలో ముఖం బయటపడనీయనని ...."

ఇదో పెద్ద వ్యాపార రహస్యమని వెంకట్ కు తెలుసు. నలుపు చేస్తారు. చాలామందికి ముఖంతో పని వుండదు. కేవలం శరీర ప్రదర్శనకు సంబంధించిన

ఫోటోలు కొంటారు. అయితే వెంకట్ కు అలా నచ్చదు. ముఖం కనబడాలి. ముఖం కనబడకపోయాక ఆ శరీరానికి అర్థ మేమున్నదని అతడి భావన....

"నాకా ఫోటో కావాలి... ముఖంతో సహా ..."

"సారీ సార్ .... సాధ్యపడదు ...."

"వెయ్యి రూపాయలిస్తాను ...."

వెంకట్ అనుమానమేమిటంటే ఆ యువతి కురూపి అయుండాలని. ఆమె అందంగా కనుక ఉండి ఉంటే ఎలాగైనా ఆమె వివరాలు సంపాదించి తన వద్దకు రప్పించుకోవాలి. ఆమె మర్యాదయిన కుటుంబానికి చెందినదని ఆ యువకుడంటున్నాడు. అదే నిజమైతే తన కోరిక తీరినట్లే కదా!

"వెయ్యి రూపాయలంటున్నారు కాబట్టి ప్రయత్నిస్తాను...." అన్నాడా యువకుడు. సాధారణంగా ఫోటోకు మూడు నాలుగువందలకు మించి ఎవ్వరూ ఇవ్వరతడికి.

* * *

"అప్పుడీ ఫోటో తెచ్చాడు. చూసి ఆశ్చర్యపోయాను. కాల్ గరల్స్ కూడా అంగీకరించని ఈ ఫోజు చూసేక నా మనసెలా పనిచేస్తుందో నువ్వూహించలేవా?" అన్నాడు వెంకట్.

"జరిగిందానికి నిన్ను నేను తప్పుపట్టను. కానీ ఇప్పుడు నాకు నువ్వు సాయం చేస్తావా—ఆ వెధవను చూపించి!"

ఏమనుకున్నాడో వెంకట్ అంగీకరించాడు.

## 7

"ఏమిటి సార్! కొత్త ఫోటోలేమైనా కావాలా?" అంటూ ఆ యువకుడు అక్కడకు వచ్చాడు.

మూర్తి ఆ యువకుణ్ని చూశాడు. చూడగానే అతడి బుర్రలో తళుక్కున మెరిసింది.

ఆ యువకుడతడికి బాగా గుర్తున్నాడు.

ఆ రోజు తను... తన మరదలు ... భార్య.... ముగ్గురూ సినిమాహాలు ముందున్న లాన్‌లో తిరుగుతూండగా....

“సార్ .... మీరిద్దరూ మేడ్ ఫర్ ఈచదర్‌లా వున్నారు. నన్నొక్క ఫోటో తీయనివ్వండి సార్ ....” అన్నాడా యువకుడు.

“మేమిలా ఉంటే నీకెందుకు?” అన్నాడు మూర్తి.

“ఫోటోగ్రఫీ నా హాబీ సార్! అదే నా వృత్తి కూడా! మంచి ఫోటోలకోసం రోడ్లమ్మట తిరుగుతూంటాను. మీ ఫోటోలు నాకెంతగానో ఉపయోగపడతాయి అర్థికంగా! ప్రతిఫలంగా మీకో రెండు కాపీలు ఇచ్చుకోగలను—” అని కాళ్ళా వేళ్ళాపడ్డాడు.

ఆ యువకుడు వారి అందాన్ని, జంటనూ విపరీతంగా పొగిడాడు. ఆ జంటతో కలిసి మరదలు కూడా ఫోటో తీయించుకోవాలని సరదాపడింది. ఉత్తినే ఫోటో వస్తూన్నదని అంతా కక్కుర్తిపడ్డారు.

ఆ తర్వాత ఎడ్రసుకు వచ్చి ఫోటో కాపీలిచ్చి మరీ వెళ్ళాడా యువకుడు.

ఒక్కసారి అంతా గుర్తుకురాగా మూర్తికి ఆవేశం వచ్చింది. చటుక్కున యువకుడి ముందుకు వచ్చి—

“ఏయ్— నేను గుర్తున్నానా?” అనడిగాడు.

వాడిలా ఎంతమందినీ చూశాడోగానీ మూర్తి వాడికి గుర్తులేదు—“మీరెవరు సార్!” అన్నాడు.

“ఒకసారి మేడ్ ఫర్ ఈచదర్ అని చెప్పి పొగిడి మా ఫోటో తీశావు. ఇప్పుడు నా భార్య తలకాయ నీ

ఫోటోలో ఎవరికో అతికించావు..."

"ఏమిటి సార్ మీర నేదీ?"

"చెబుతాన్రా ..." అంటూ మూర్తి ఆవేశంగా డొక్కలో తన్నాడు.

"మూర్తీ! తప్పు నీలో ఉంచుకుని వాడి మీదెందుకూ విరుచుకు పడతావ్!" అన్నాడు వెంకట్.

"తప్పు నాలో లేదు. వీడిలోనూ—వీడిలాంటి వాళ్ళను ప్రోత్సహించే నీలోనూ ఉంది. మీ యిద్దరి కారణంగా ఓ అమాయకురాలి జీవితం సర్వనాశనమై పోయేది. ఇలా ఇప్పటికి ఎంతమంది అమాయకురాండ్ర జీవితాలు నాశనమైపోయాయో...." అన్నాడు మూర్తి.

"ఏమిటి నువ్వనేది?"

"ఆ ఫోటోలో నా భార్య ధరించిన రింగులు ఆమె జీవితంలో ఒకేఒక్కసారి కొద్ది గంటలసేపు ధరించింది. అంతసేపూ నాతోనే వున్నదామె. ఆ సమయంలోనే వీడు మా జంటకు ఫోటో తీశాడు. ఆ ఫోటోను మరో కందుకు ఉపయోగించుకుంటాడని నాకు తెలియదు. ఇందులో తలను తీసుకువెళ్ళి మరో ఆడదాని శరీరానికి అతికించాడు...." అన్నాడు మూర్తి.

వెంకట్ ముఖం గంభీరంగా అయిపోయింది—"నిజమా?"అన్నాడతడా యువకుడిని తీవ్రంగా చూస్తూ.

యువకుడు వెంటనే ఒప్పుకోలేదు.

"మర్యాదగా నువ్వు నిజం ఒప్పుకోకపోతే—నిన్ను పోలీసులకు అప్పగించేస్తాను. ఆ తర్వాత వాళ్ళు రంగంలోకి దిగి — వాళ్ళ పద్ధతులుపయోగించి నీ వ్యవహారం మొత్తం బయటపెడతారు...." అన్నాడు వెంకట్.

"పోలీసుల్ని రంగంలోకి దించవద్దు సార్. నిజం

చెబుతాను....” అన్నాడా యువకుడు.

అమాయకులైన ఆడవాళ్ళను మాయమాటలతో మభ్య పెట్టి ఏకాంతానికి తీసుకునివెళ్ళి అప్పుడు వాళ్ళను బెదిరించి అసభ్యకరంగా ఫోటోలు తీసి—విలాసపురుషులకు అమ్మడం అతని వ్యాపారం. ఆడపిల్లలను ఆకర్షించడానికీ, ఫోటోలు తీయడానికీ ఆ యువకుడి అందం ఉపయోగపడుతున్నది.

వెంకట్ వాడిని ఆ చెంపా ఈ చెంపా వాయించి- “దుర్మార్గుడా — ఇంతకాలం నువ్వు నీచప్రవృత్తిగల ఆడవాళ్ళగురించి ఈ ఫోటోలు తీసుకుంటున్నావను కున్నాను. కానీ వారిని వేధించి, క్రూరంగా బాధపెట్టి ఈ పని చేస్తున్నావని నేననుకోలేదు—” అన్నాడు.

“ఏ ఆడదీ-తనకుతానై ఇలాంటి పనులకు ఒప్పుకోదని నీకు తెలియకపోవడం విచారించవలసిన విషయం వెంకట్!” అన్నాడు మూర్తి. తర్వాత అతడా యువకుడివంక తిరిగి — “ఫోటోలు తీశావు. సరే— ఆ తర్వాత తలలు మార్చడమెందుకు? అదే వ్యవహారాన్నింతవరకూ తెచ్చింది....” అన్నాడు.

యువకుడు మౌనంగా తల వంచుకున్నాడు.

“అడిగిందానికి బదులు చెప్పు!” అన్నాడు వెంకట్.

“చెబితే మీ ఆవేశం పెరిగిపోతుంది—” అన్నాడా యువకుడు.

అతడు రామం.

చెప్పకపోతే ఆవేశం ఇంకా పెరిగిపోతుంది—” అన్నాడు మూర్తి.

“ఆ ఫోటోలు — అప్పుడే యవ్వనప్రాంగణంలో అడుగుపెట్టిన మొగ్గలాంటి యువతులవి. ఆ ముగ్ధ పరి

సితికి తట్టుకోలేరు. ప్రపంచంలోని విషాదమంతా గూడు కట్టుకుని ఉన్న ఆ ముఖాలు యెటువంటివారికైనా హృదయవిదారకంగా వుంటాయి. అందుకే నవ్వుతూ కలకలలాడుతూ వున్న ముఖాన్ని ఆ శరీరానికి అతికించడం జరుగుతున్నది...."

రామం ఇంకా తన మాటలు పూర్తిచేయకుండానే "మూర్తీ! ముందు పవిత్ర మూర్తి అయిన నీ భార్య పాదాలమీదపడి క్షమార్పణ అడిగే వరకూ నాకు మన శ్శాంతి వుండదు. పద....ప్లీజ్!" అన్నాడు.

"నా భార్య సచ్ఛీలతపైన నాకు నమ్మకమున్నది. అయితే ఈ ఫోటోలవల్ల ఇంకా ఎంతమంది ఆడవాళ్ళు నష్టపోతున్నారో .... ముందు వీడిసంగతి పట్టేదాకా నాకు నిమిత్తముండదు...." అన్నాడు మూర్తి.

## 8

"ఎవరండీ మీరు?" అన్నది సుభద్రమ్మ.

"అమ్మా—రామం మీ అబ్బాయే కదూ!" అన్నాడు మూర్తి లోపలకు అడుగు పెడుతూ.

"అవును—ఏం—వాడికేమయింది?" అంది సుభద్రమ్మ కంగారుగా.

"ఏమీ కాలేదు. మీ వాడు మంచి ఫోటోగ్రాఫరు. మిమ్మల్నభినందించిపోదామని వచ్చాను...." అన్నాడు మూర్తి.

సుభద్రమ్మ కళ్ళు మెరిశాయి—"వాడికి చదువుకు నే రోజుల్లోకూడా ఫోటోగ్రఫీలో ప్రైజులొచ్చేవి బాబూ! ఎటొచ్చీ వాడికి స్వంత కెమేరా లేదు. వాళ్ళనీ వీళ్ళనీ అడిగి తెచ్చుకు నేవాడు. అంతా అనేవారు — స్వంత కెమేరాయే వుంటే వీడింకా గొప్పవాడైపోతాడని...."

"ఆ గొప్పతనం మీకు కళ్ళారా చూపిద్దామనే వచ్చాను...." అంటూ మూర్తి ఆమెకో కవరు అందించాడు. సుభద్రమ్మ ఆత్రుతగా కవరందుకుని అందులోని ఫోటోలు తీసి చూసి — ఏదో ఉపద్రవం వచ్చినట్లు కెవ్వుమని అరిచింది. వెంటనే ఆమె చేతినుంచి ఆ ఫోటోలు జారిపోయి ఇల్లంతా పడ్డాయి.

"ఇదీ మీ కొడుకు ప్రతాపం...." అన్నాడు మూర్తి, జరిగిన కథంతా చెప్పి.

"ఏడీ వాడు!" అంది సుభద్రమ్మ ఆవేశంగా.

సరిగ్గా అప్పుడే వెంకట్, రామం — గదిలో అడుగు పెట్టారు.

వెంటనే సుభద్రమ్మ లేడిమీదకు దూకిన సింహంలా కొడుకుమీద పడింది. ఇష్టంవచ్చినట్లు అతగాణ్ని కొట్టి చేతుల్లో శక్తి అయిపోగా నీరసంగా కూలబడి—"నిన్ను చావగొట్టడానికి భగవంతుడు నాకు మరింత శక్తినిచ్చి వుంటే ఎంత బాగుండేది!" అంది.

రామం మౌనంగా అన్నీ భరించాడు.

"ఎందుకు చేశావురా ఈ పని!" అంది సుభద్రమ్మ.

రామం మాట్లాడలేదు.

"చెప్పరా?" ఆమె అరిచింది.

"నీకోసం ..." అన్నాడు రామం.

తల్లి అతణ్ని అష్టకష్టాలూపడి పెంచింది. ఆమెను అష్టైశ్వర్యాల్లో ముంచెత్తాలని అతడు అడ్డదారులు తొక్కాడు.

"ఓరి దౌర్భాగ్యుడా! నేను నిన్ను పెంచి పెద్దచేయడానికి అష్టకష్టాలూ పడకుండా అడ్డదార్లు తొక్కివుంటే ఈరోజు నువ్విలా నలుగుర్లో తలెత్తుకుని తిరిగివుండే

వాడివా? పరాయి ఆడదాన్ని గౌరవిస్తే నీ తల్లిని గౌరవించినట్లు. ఆడదాన్ని నీచంగా చూస్తే నువ్వు నీ కన్న తల్లి నే నీచంగా చూసినట్లు. ఆడదాన్ని గౌరవించని కుటుంబం నాశనమైపోతుంది. ఆడదాన్ని అవమానించాలనుకునే సమాజం సర్వనాశనమైపోతుంది. ఒక ఆడది ఎంతలా గౌరవించబడుతున్నదీ అన్నదాన్ని బట్టేరా— ఒక సమాజపు విలువ అంచనా వేయబడేది....'' అంది సుభద్రమ్మ.

"నన్ను క్షమించమ్మా!'' అన్నాడు రామం.

"క్షమించు అని ఒక ముక్క అంటే నువ్వు చేసిన తప్పులు సరిదిద్దబడతాయా?'' అంది సుభద్రమ్మ.

"మరి నేనిప్పుడేం చేయనమ్మా!'' అన్నాడు రామం దిగులుగా.

అప్పుడు సుభద్రమ్మకు శోభ గుర్తుకు వచ్చింది. ఆమె మూర్తివంక అభినందన పూర్వకంగా చూసి—"బాబూ- నీది చాలా గొప్ప మనసు. అందువల్లనే మావాడివంటి చీడపురుగులున్నా—నువ్వు నీ భార్యను అనుమానించ లేదు. కానీ అంతా నీకులా ఉండరు. ఓ అమ్మాయి బ్రతుకిలాగే అన్యాయమైపోయింది. ఆమె ఇప్పుడు వేశ్యావృత్తిని చేపట్టింది. అందుకు కారణం మావాడేనని నాకిప్పుడర్థ మవుతున్నది. ఆ పిల్లను నా యింటి కోడలుగా ఆహ్వానిస్తాను....'' అంది.

రామం మాట్లాడలేదు.

వెంకట్, మూర్తి ఇంట్లోంచి బైటపడుతూ— "ఆ తల్లి బహుదొడ్డది. ఇలాంటి ఇంట్లో ఉండతగ్గది కాదు'' అనుకున్నారు.

—:అయిపోయింది:—

# హత్యమీద హత్య

## బొమ్మిడి అచ్చారావు

"ఉహూఁ, దూరం! ఎవరైనా చూస్తారు?" అన్నది సరోజ మూర్తినుంచి దూరంగా జరుగుతూ.

"అబ్బ! ఎన్నాళ్ళీ విరహ వేదన? బాధ నటిస్తూ గుండెలమీద రుద్దుకున్నాడు మూర్తి.

ఆమె అల్లరిగా నవ్వింది. జారిన పైటని సద్దుకుంది. గాలికి మనోహరంగా ఎగురుతున్న ముంగురులను అలవోకగా సర్దుకుంది. కాళ్ళు ముడుచుకుని కూచుని గెడ్డం మోకాళ్ళమీద ఆనించి కళ్ళ చివర్లనుంచి దృష్టిని అతని మీదే కేంద్రీకరించి అతనివంకనే తదేకంగా ఆరాధనగా చూసింది సరోజ.

మూర్తి ఆమె చూపుల్లో చూపులు కలిపి, "బొత్తిగా యిలా పస్తులు పెట్టడం ఏం బావుండలేదు సరూ! రేపే వచ్చి మీ నాన్నతో మాట్లాడుతాను" అన్నాడు.

"అంత పనిమాత్రం చెయ్యకు. ఈ మాత్రం కలుసుకోవటం కూడా జరగదిక. అసలే నాకు రోజురోజుకా

యింట్లో అంతా లెక్కలైపోతున్నాయి."

"ఎందుకు?"

"ఎందుకేమిటి? మన ఎఫైర్ మా మామయ్యకు తెల్సిపోయింది."

"మామయ్యకా?"

"అదే మా అమ్మ తమ్ముడు — నన్ను పెళ్ళిచేసుకుంటానని ప్రాణం కొరికేస్తున్నాడు. మా అమ్మే అనుకుంటే మా నాన్న కూడా అతని తరఫునే వున్నారు. అంచేత వాళ్ళకెవరికీ మన విషయం తెలియకూడదు."

"అలా అని యెన్నాళ్ళు చేతులు ముడుచుకుని కూచుందాం?"

"దేనికైనా అవకాశం రావాలి కదా!"

"అవకాశాలు వెతుక్కుంటూ రావు. మనమే వాటిని వెతుక్కోవాలి, అలా ఏర్పాటు చేసుకోవటం మన చేతుల్లోనే వుంది. నువ్వు ధైర్యం జెయ్యటంలేదు. నీకే పద్ధతిలో కావాలంటే ఆ పద్ధతిలో మనం పెళ్ళిచేసుకుందాం. ఇంకా ఆలస్యం చెయ్యాల్సిన పనిలేదు. నా ఉద్యోగం గురించి, సంపాదన గురించి నీకు తెలుసు కదా! నాకొచ్చేది మనిద్దరికీ హాయిగా సరిపోగా పుట్టబోయే వాళ్ళకోసం పొదుపు చేసుకోవచ్చు!"

సరోజ ముఖం ఎర్రబడిపోయింది, "ఛీ, అన్నీ అలాంటి మాటలే. నాకు సిగ్గేస్తోంది బాబూ!" అన్నది.

మూర్తి అటు యిటు చూసి చటుక్కున ఆమెని పొదివి పట్టుకుని దగ్గరగా లాక్కుని ఆమె పెదాల్ని గట్టిగా ముద్దుపెట్టేసుకున్నాడు. ఆమె వద్దంటూనే అతని కౌగిలిలో మెత్తగా వాలిపోతూ పరవశత్వంతో కళ్ళు మూసుకుంది.

సరిగ్గా అదే సమయంలో వాళ్ళ వెనకనున్న పొదలో ఏదో అలికిడి అయింది.

ఇద్దరు దూరంగా జరిగారు.

## 2

"నాన్నా నేనేదైనా వ్యాపారం చేసుకుంటాను, నా వాటా నాకు పంచిపెట్టెయ్యి."

దూకుడుగా లోపలికొచ్చి, గోడలవంక పటాలవంక చూస్తూ ఆ రెండు మాటలు అనేసి వెనుతిరిగి వెళ్ళిపోతున్న కొడుకును రెక్కపట్టి ఆపేశాడు ముకుందయ్య.

సంతోష్ ఆగిపోయి చూశాడు.

"ఏ ఆస్తీ, ఏ వాటా?" అన్నాడాయన కళ్ళజోడు కిందినుంచి తీవ్రంగా కొడుకువైపు చూస్తూ.

"మీ ఆస్తిలో నాకు రావలసిన వాటా."

"ఈ ఆస్తి నా స్వార్జితం. నా యిష్టముంటే ఇస్తాను, లేకుంటే ఏ ధర్మసత్రాలకో రాసేస్తాను. నీకివ్వాలని ఏం లేదే!...."

"అయితే యివ్వనంటావు, అంతేనా?"

"తండ్రితో మాట్లాడవలసిన పద్ధతేనా యిది?"

"కొడుకుపట్ల చూపాల్సిన ప్రేమ యిదేనా?"

"ఆస్తిలో వాటా యిస్తేనే ప్రేమ వున్నట్టా?"

"ప్రేమ వున్నప్పుడే ఏమిచ్చినా, ఏం చేసినా....!"

"నీకిప్పుడేం లోటు చేశాను. చక్కగా చదువుకో మన్నాను. నీకెంతవరకు చదవాలని వున్నా చెప్పిస్తా నంటున్నాను. నీకు ఖర్చుకి కావాలన్నప్పుడల్లా డబ్బిస్తున్నాను. ఇంత లిబరల్ గా ఏ తండ్రి చూస్తాడు?"

"ఇచ్చిన ప్రతి పైసాకు లెక్క అడుగుతున్నావు గదా!"

"తీసుకున్నప్పుడు లెక్క చెప్పాల్సిన బాధ్యత నీది."

"నాకు చదువుకోవాలని లేదు. ఏదైనా వ్యాపారం చేసుకుంటాను!"

"ఉహు, అలాగా! అందుకు నేను వాటా పంచి యిచ్చేయాలా? నీకు ఏ వ్యాపారం తెలుసు? ఎంత వయసు అనుభవం వుందని వ్యాపారం చేస్తావు? అందులో లౌక్యం, మెలకువలు, ముందుజాగ్రత్తలు సమయానుకూలంగా వ్యవహరించటం—యివన్నీ పెద్ద కాకలుతీరిన బిజినెస్ మేగ్నెట్‌లకే కష్టమవుతుంటుంది. నిన్నగాక మొన్న కళ్ళు తెరిచిన నీకు అందులో ఓనమాలే రావు. పెట్టిన పెట్టుబడి కూడా దక్కదు. పో, పోయి బుద్ధిగా చదువుకో!"

"నాన్నా, అవమానకరంగా మాట్లాడుతున్నావు."

"నోర్ముయ్యరా! నీకు అవమానం గురించి, అభిమానం గురించి ఏం తెలుసు? ఫాల్స్ ప్రెస్టేజి పట్టుకు వేలాడటం, వేలకొద్దీ డబ్బు ఫాషన్ల పేరిట ఫ్రెండ్సు దగ్గర గొప్పల కోసం తగలెయ్యటం, గడ్డం పెంచుకుని తిరగటం, అమ్మాయిల వెంటపడటం-ఇవేగా నీకు తెలిసిన విద్యలు. మూడేళ్ళుగా డిగ్రీ పూర్తిచెయ్యలేక పోయావుగాని, కబుర్లు చెబుతున్నావు."

సంతోష్ బుసకొడుతూ వెళ్ళిపోయాడు బయటికి.

## 3

"ఇవాళ బాగా ఆలస్యమయినట్టుంది!" అన్నాడు శేఖరం భార్య ముఖంలోకి పరీక్షగా చూస్తూ.

"అవునండీ, మా స్టాఫ్ రిటైర్‌మెంట్సు కదా! మా డైరెక్టర్‌కి ఫేర్‌వెల్ యిచ్చాం. అందుకే లేటయిపోయింది."

"అయితే మాత్రం అర్ధరాత్రిదాకా వుండాలా?"

"ఆఫీసు అవర్సు తర్వాత అరేంజి చేశారు. ఒకరొకరు ఆయన గుణగణాల గురించి, సర్వీసులో ఆయన చేసిన మంచి పనుల గురించి, స్టాఫ్‌కి చేసిన మేళ్ళ గురించి ఉపన్యాసాలిచ్చారు. చివర్లో తేనీటి విందు జరిగింది. అది పూర్తయ్యేసరికి తొమ్మిది దాటిపోయింది."

"నీ యిష్టం. నువ్వేమన్నా చెల్లుతుంది."

"ఇప్పుడేమన్నానండీ!"

"ఏదయినా అనొచ్చు, ఫరవాలేదు."

"మీరేమిటో మనసులో పెట్టుకుని మాట్లాడుతున్నారు. అదేమిటో సూటిగా చెప్పరాదూ?"

"ఎన్నిసార్లు చెప్పాలి? ఆలస్యంగా రావద్దని ఎన్నోసార్లు చెప్పాను. అయినా నీ అలవాటు మామూలే. ఈ మహానగరంలో ఏ మూల ఏం జరుగుతుందో యెవరికి తెలుసు?"

"అంటే, బయట తిరుగుతున్న ఆడవాళ్ళందరికీ ఏదో జరిగిపోతుందా?"

"ప్రమాదం చెప్పిరాదు, వచ్చాక ఎవరూ చెయ్యగలిగిందేమీ వుండదు."

"మీకు నామీద నమ్మకం లేనట్టుందే!"

"నమ్మకానికి, ముందుజాగ్రత్త చెప్పటానికి అర్థం ఒకేలా చెప్పుకుంటున్నావా?"

"ఏమో బాబూ, మీ మాటల కర్థాలు మీరే చెప్పుకోవాలి — నేనేం చెప్పలేను" చీర మార్చుకుంటూ ఉక్రోషంగా అన్నది సుశీల.'

"కోపతాపాలు నీ సొత్తనుకుంటాను."

"నా కోపం యెవరిమీద చూపించుకుంటాను? నా బాధ యెవరికి చెప్పుకుంటాను? సూటిపోటి మాటల్లో హింసించటమేగాని అర్థం చేసుకుని సానుభూతి చూపించటం మీకు మొదట్నుంచీ అలవాటులేదుగా!"

"నీ యిష్టం వచ్చినట్టు అలాగే అను. సంపాదిస్తున్నది నువ్వు. ఏమన్నా చెల్లుతుంది."

"అదిగో, అదే మీ యిన్ఫీరియార్టీ కాంప్లెక్స్. నేను సంపాదించకపోతే మనకి ఆ నాలుగువేళ్ళు నోట్లోకి పోవని తెలిసే ఆ మాటనటం దేనికి?"

"నాకు బుద్ధిలేక! అయినా గడపదాటిన ఆడది ఎన్ని కబుర్లయినా చెప్తుంది. సంపాదించే సత్తాలేని మొగుడు నోర్మూసుకు పడివుండాల్సిందే!"

"ఎందుకండీ! మిమ్మల్ని మీరలా కించపరుచుకుంటారు? ఇప్పుడు నేనేమన్నానని? మీరు సంపాదిస్తే ఒకటి, నేను సంపాదిస్తే ఒకటినా? దేవుడు చల్లగాచూసి మీకుద్యోగం వస్తే, ఆ మరుక్షణమే నా జాబ్ కి రిజైన్ చేసెయ్యటానికి సిద్ధంగా వున్నాను. తోడేళ్ళలాంటి మొగాల చూపులను తట్టుకుని బయట నెగ్గుకు రావటం నాకూ కష్టంగానే వుంది. భుక్తికి గడవాలి అని చెయ్యటం తప్పితే నాకు ఉద్యోగంమీద మోజూ బయట తిరగాలనే క్రేజూ లేవు. నన్ను నమ్మండి."

"ఎందుకు మనమధ్య డిస్కషన్. ఇదిగో టీ చల్లారి పోతుంది తీసుకో!"

"ఊహుం! మీరు తీసుకోండి ముందు."

"నేను నువ్వొచ్చేముందే కలుపుకున్నాను."

"ఎందుకండీ మీకీ వంట తాపత్రయం? నేనొచ్చాక ఆమాత్రం వంటపని చూడలేనా?"

"ఖాళీగా వుండి ఏం చెయ్యను? నువ్వు కష్టపడి వచ్చి మళ్ళీ యిక్కడ వంట గదిలో ఏం కష్టపడతావు?"

"అదేం కుదరదు. రేపట్నుంచి మీరు భోజనం చెయ్యటానికి తప్ప వంటగదిలోకి రాకూడదు, తెల్సిందా?"

"నువ్వు సంపాదిస్తున్నావు. నేను ఖాళీగా కూచుని నీ సంపాదన తింటున్నాను. కనీసం యీ విధంగానైనా సర్వీసు చెయ్యకపోతే ఎలా? తిన్నది అరగాలి కదా!"

"మీరు ఏమీ సర్వీసు చెయ్యక్కర్లేదు. కావాలంటే బయట హాయిగా తిరిగి రండి. ఏమైనా సినిమాలు చూడండి. యెవరైనా తెలిసినవాళ్ళుంటే ఉద్యోగ ప్రయత్నాలు చెయ్యండి. మనం కూచుంటే ఉద్యోగాలు దొరికే రోజులు కావు."

"అయితే నేను గోళ్ళు గిల్లుకుంటూ ఖాళీగా వుండి పోతున్నాను కదూ సోమరిలాగా?"

"ఛ, అలా అని నేననలేదండీ!"

"ఎలా అన్నా దాని అర్థం అదే!"

"ఎందుకండీ మాటల్తో నన్నిలా హింసిస్తారు?"

"నేను హింసిస్తున్నానా? బాగానే వుంది. మళ్ళీ యిదో కొత్తరకం నేరారోపణా? సరి, సరి లే."

సుశీల గుడ్లనీరు కక్కుకుంటూ మంచంమీద వాలి పోయింది. "భగవాన్, నేనీ బాధ భరించలేను" అనుకుంది.

# 4

"రావోయ్, రారా, ఏమిటి దారి తప్పి వచ్చావు?" మిత్రుణ్ణి ఆహ్వానించాడు రఘు.

"దారి తప్పి రాలేదు. దారి తప్పకూడదనే వచ్చాను" అన్నాడు స్వామి నవ్వుతూ.

"ఈమధ్య మరీ నల్లపూసవై పోతున్నావు. చిన్ననాటి స్నేహితుణ్ని, హితుణ్ని నేనున్నాననీ, నీ క్షేమం గురించీ, బాగు గురించీ ఆరాటపడుతుంటాననీ నీకు తెలీదా?"

"తెలుసు. నాకో ముఖ్యమైన పనిపడి వచ్చాను."

"అదేమిటో చెప్పు."

"ఏమీ అనుకోవు కదా!"

"అదేమిటి, ముందే యిన్ని కండిషన్స్ పెడుతున్నావు. కొంపతీసి డబ్బు అప్పడగవు కదా! నేనే నిన్ను ఎదురడుగుదామనుకుంటున్నాను" అన్నాడు రఘు పెద్దగా నవ్వుతూ.

స్వామి తనూ నవ్వేసి, "అదేం కాదులే! డబ్బు కావాలంటే నేనే యిస్తాను. నాకు నీవలన చాలా ముఖ్యమైన పని కావలసి వుంది. నా వ్యాపారం సంగతి నీకు తెలుసుకదా! ఈమధ్య తప్పనిసరై కొంత డబ్బు వృధాగా ఖర్చయిపోయింది. దాన్ని కప్పిపుచ్చటానికి లాభాలు తక్కువ చూపించాల్సి వచ్చింది. ఈమధ్య ఇన్‌కమ్‌టాక్స్ వాళ్ళు రెయిడ్ చేసి లెక్కలు తనిఖీ చేశారు. అదీ మీ సెక్షన్ వాళ్ళే!...." అర్థోక్తిలో ఆగిపోయాడు.

రఘు ముందుకు వాలి, "చెప్పు!" అన్నాడు ఏ భావమూ ముఖంలో ప్రకటితం కాకుండా జాగ్రత్త పడుతూ.

"మరేంలేదు మీ వాళ్ళకి చెప్పి చిన్న అడ్జస్ట్‌మెంట్ చేయించు లెక్కల్లో. నేను చూపించిన ఎమవుంట్స్ కరెక్టేనని వాళ్ళచేత సర్టిఫై చేయించు. మిగతా విషయాలు నే జూసుకుంటాను."

"అంటే నాచేత అఫిషియల్ బ్లండర్స్ చేయించి కమిట్ కమ్మంటావా?"

"స్నేహితుడిగా నామాట కాదనవనే నమ్మకంతో వచ్చాను. దాంట్లో కమిట్ అయేదేముంది? చిన్నమాట సహాయం, అంతే! అవసరమైతే అధికారులికి జేబులు తడుపుదాం."

రఘు ముఖం జేవురించింది.

"స్వామీ, నన్ను కూడా లంచగొండుల్లో కలిపేస్తున్నావు కదూ!"

"ఛోఛో, అది కాదు రఘూ! నువ్వు స్ట్రెయిట్ ఫార్వర్డ్ అని నాకు తెలుసు. తక్కిన అధికారుల సంగతి నే మాట్లాడేది! నువ్వు తలుచుకుంటే చెయ్యగలవు."

"ఇలా చెయ్యటంవల్ల నీకు వచ్చే లాభం ఎంత?"

"లాభం ఎక్కడ? అంతా నష్టమే! కేసు ఫైలవకుండా ఎంతో కొంత ముట్టచెప్పాలి కదా!"

"అధికారులు రిపోర్టు యథాతథంగా పంపిస్తే నీకు నష్టమేమయినా వుందా?"

"అదేంమాట, నువ్వు సరదాగా అంటున్నావో సీరియస్ గా అంటున్నావో తెలీదు. నా రికార్డ్స్ బోగస్ అని రుజువయితే నా కంపెనీ మూతపడిపోదా? కంపెనీ కున్న గుడ్ విల్ పోవటమే గాక నేను జైలు కటకటాల్ని లెక్కించాల్సి రావచ్చు కూడా!"

"ఆ తెలివి కమిట్ కాక ముందుండాలి."

"చెప్పాను కదా, తప్పనిసరి పరిస్థితుల్లో లెక్కలు అలా చూపించాల్సి వచ్చింది!"

"నేనోమాటంటాను, కోపం రాదుకదా!"

"అదేమిటో చెప్పు!"

"ఇది నావల్ల కాదు."

స్వామి ఉక్రోషంతోను, కోపంతోను వెంటనే మాట్లాడలేకపోయాడు.

"అవినీతి ఎక్కడున్నా నేను దాన్ని వ్యతిరేకిస్తాను. అన్యాయం, అక్రమం, లంచగొండితనం నాకు సరిపడనివి. అది నీకు తెలిసే వుంటుంది. ఇంకో విషయం చెప్పనా? ప్రస్తుతం ప్రభుత్వం మారింది. ఇదివరకు ప్రభుత్వం లంచగొండుల నిలయమై విలయతాండవం చేస్తే ఈ ప్రభుత్వం అవినీతిని కూకటివేళ్ళతో పెకలించి వేయటానికి కంకణం కట్టుకుంది. ఫలితంగా లంచాలు తినితిని ఒళ్ళు బలిసిన అధికారులు అనేకమందికి ఉద్యోగంనించి ఉద్వాసన అయింది. నువ్వు యింకా లంచాలతో అధికారుల్ని కొనేద్దామనే పిచ్చి భ్రమలో వున్నావు. ఐ పిటీ యు!"

"నువ్వు నామీద జాలిపడనక్కర్లేదు. ప్రభుత్వం మారినా, పాలకులు మారినా అధికారులు యింకా పాతవాళ్ళే వున్నారుకదా! అందులోనూ లంచాలకు అలవాటు పడ్డవాడు అంత తొందరగా 'పై సంపాదన' వదులుకోలేడుగా! వల విసుర్తాను, పడకపోతారా?"

"నీ ధోరణి యిక మారదనుకుంటాను. అసలు నిజం చెప్పాలంటే అధికారుల్ని లంచగొండులుగా తయారుచేసి వాళ్ళను అవినీతి పథంలోకి నడుపుతున్నది నీలాంటి స్వార్థపరులే! నువ్వు చూపించే అరచేతిలోని స్వర్గానికి దాసులైపోయి నువ్వు చెప్పినట్లల్లా ఆడి, ఆత్మవంచన, స్వామిద్రోహం-రెండింటికీ పాల్పడుతున్నాడు ఉద్యోగి. నీ నేరం క్షమించరానిది!"

"అనవసర ప్రసంగం! నేనిక్కడికొచ్చింది నీ ఉప

న్యాసాలు వినటానికి కాదు. ఓం విలువ నాకు తెలిసి నంతగా నీకు తెలియదు. నేను వ్యాపారిని. చివరిసారిగా అడుగుతున్నాను. నేనడిగింది చేసిపెడతావా, లేదా?"

"అయామ్ సారీ!"

"దీని పర్యవసాన మేమిటో తెలుసా?"

"మన స్నేహ బంధం తెగిపోతుంది!"

"నీ దగ్గరికి వచ్చే బదులు సరాసరి ఆ ఆఫీసరు దగ్గరికే పోతే యీపాటికి పని పూర్తయ్యేది."

"మరి నా దగ్గర కెందుకొచ్చావు?"

"ఏదో చిన్ననాటి స్నేహితుడివి కదా. ఆమాత్రం సాయం చెయ్యకపోతావా అనొచ్చాను. కాని నువ్వు మొండి చెయ్యి చూపించావు."

రఘు మాట్లాడలేదు.

"ఓ.కే. థాంక్స్ ఫర్ యువర్ కైండ్ కోపరేషన్ ఆతన్ని పోయి ఇప్పుడే కలుస్తాను" స్వామి వెళ్ళబోతున్న వాడల్లా చటుక్కున ఆగిపోయాడు.

"ఇచ్చిన నిన్ను, పుచ్చుకునే అతన్ని ప్రభుత్వానికప్ప చెప్పించేస్తాను."

స్వామి వెనక్కి వచ్చి క్రూరంగా రఘు ముఖం మీదకు ముఖంపెట్టి "అదీ చూస్తాను. నీలాంటివాడు బాగుపడడు, ఎదుటివాడ్ని బాగుపడనివ్వడు. అందరూ నీలాంటి శ్రీరామచంద్రులే వుంటే యీ లోకం ఎప్పుడో తిరగబడిపోయుండేది!" అన్నాడు.

స్వామి మాటలకు మౌనంగా వుండిపోయాడు రఘు. ఓ విషపు చూపు రఘుమీద విసిరి హడావిడిగా వెళ్ళి పోయాడు స్వామి.

# 5

"సరూ, నీతో ఒక మాట!" అన్నాడు ప్రభంజన్.

సరోజ చటుక్కున ఆగిపోయి "ఏమిటి మామయ్యా!" అన్నది.

"నువ్వు ఎక్కడికి వెళ్తున్నావో నాకు తెలుసు!.... ఆ మూరితో నీ తిరుగుళ్ళు నాకు నచ్చలేదు. పబ్లిగ్గా పార్కులో ఒకరిమీద మరొకరు పడి...."

"అయితే నువ్వు మమ్మల్ని రోజూ వాచ్ చేస్తున్నావన్నమాట! సరే, యెలాగూ తెల్సుకున్నావు కాబట్టి యీ సంగతి కూడా తెల్సుకో! త్వరలో మేమిద్దరం పెళ్ళిచేసుకోబోతున్నాం."

"అది జరగని పని."

"ఏం?"

"నేను చెప్పను, చేసిచూపిస్తాను."

చకచక నడావిడిగా లోపలికి వెళ్ళిపోయాడు ప్రభంజన్.

*  •  •

"ఈ రోజు కూడా ఆలస్యమయిందే! మరో అధికారి యెవరైనా రిటైరయ్యాడా?" వ్యంగ్యంగా అన్నాడు శేఖరం.

సుశీల బాధగా, ఉక్రోషంగా చూసింది భర్తవంక.

"రేపట్నుంచి నువు ఉద్యోగానికి పోనక్కర్లేదు. నేనే బయిటికిపోయి సంపాదిస్తాను."

"అంతకన్న నాకు కావలసిందేమిటండీ, ఇంతకీ ఏం ఉద్యోగం? ఎప్పుడొచ్చింది?"

"రాలేదు, ప్రయత్నిస్తాను."

"మరి అప్పటిదాకా?"

"కూలో నాలో చేస్తాను. మనిద్దరి పొట్టలకు సంపాదించలేకపోను!"

"ఎందుకు చెప్పండి మీకింత పంతం? నేను ఆడదాన్నని, ఆడదాని సంపాదనమీద బతక్కూడదనీ మీ నరనరాన జీర్ణించుకుపోయింది. అంతేనా?"

"వివరణ అనవసరం. రేపట్నుంచి నువ్వు ఉద్యోగానికి వెళ్ళటానికి వీల్లేదు."

"అర్థమైంది, నామీద మీకు నమ్మకం పోయింది."

"నమ్మకం పోయింది నీమీద కాదు—నీ చుట్టూ వున్న పురుష ప్రపంచంమీద, అవకాశం దొరికితే అంత తేలిగ్గా వదలరు, నాకు తెలుసు."

"సారీ నేను ఉద్యోగం వదులుకోలేను. మీకు దొరికే వరకు పస్తులతో వుండటం నావల్లకాదు."

"అంతేనా? నా మాట ధిక్కరిస్తావా?"

"మీరేమనుకున్నా సరే, నా నిర్ణయం అది!"

"సరే, అదీ చూస్తాను."

* * *

ఆఫీసులో రఘు సీటుమీదుగా వెళ్తూ ఓ క్షణం ఆగి కోరగా చూశాడతని వంక స్వామి.

రఘు ఫైల్లోంచి తలెత్తకుండానే పనిచేసుకుపోతున్నాడు.

"చూశావు, నేను సవాలు చేసినట్టే నా పని పూర్తి చేసుకుని వస్తున్నాను. డబ్బుతో చెయ్యలేనిదేం లేదు. నన్ను, తీసుకున్నవాడ్ని పట్టిస్తానని ప్రగల్భాలు పలికావు కదా! ఏం చెయ్యగలిగారు, నువ్వూ-నీ ప్రభుత్వమూను."

"ఉల్లలకగానే పండగకాదు స్వామీ! నీ విషయం, నువ్వు లంచమిచ్చిన అధికారి విషయం రెండూ యెవరికి

చెప్పాలో వారికే చెప్పాను. నీ పాపం తప్పక పండుతుంది."

"నువ్వేం చెయ్యలేవని మరోసారి చెప్తున్నాను. అంతేకాదు, అలాంటిదే జరిగితే నిన్నంత తేలిగ్గా వదులానని మాత్రం అనుకోకు. నా పగ పాము పగకి తక్కువేం కాదు. బీ కేర్ ఫుల్!"

## 6

"ఇతని పేరు మూర్తి. ఫెర్టిలైజర్స్‌లో కెమికల్ అసిస్టెంటుగా పనిచేస్తున్నాడు" అన్నాడు ఇన్ స్పెక్టర్ శ్రీనివాస్.

డిటెక్టివ్ కిరణ్ సాలోచనగా తలూపాడు.

"శవాన్ని ఎవరు గుర్తుపట్టారు?" అడిగాడు.

"ఇదిగో, యీమె. పేరు మిస్ సరోజ" అన్నాడు శ్రీనివాస్.

కిరణ్ ఆమెవంక చూశాడు. ఆమె నమస్కారం చేసింది. కళ్ళు ఎర్రగా ఉబ్బి వున్నాయి. బాగా ఏడ్చిందనటానికి నిదర్శనగా చెక్కిళ్ళమీద కన్నీరు గారకట్టిన చారికలు.

"మీకెలా తెలుసీయన?"

"ఆయన నా ఫ్రెండు!"

"అంతవరకేనా?"

"పెళ్ళిచేసుకోవాలనుకున్నాం."

"ఐ....సీ....!"

వేలిముద్రల నిపుణుడు, ఫోటోగ్రాఫరు తమ పనులు చేసుకుపోతున్నారు.

ఊరి చివర మర్రిచెట్టుకింద దిక్కులేకుండా చచ్చి పడున్న ఆ శవాన్ని చూడగానే ముందు కిరణ్ కి చాలా

జాలివేసింది. ఎవడో చాలా దారుణంగా నెత్తిపైన బండ రాయి వేసి పగలగొట్టి చంపేశాడు. బహుశా ఎవడైనా గూండా అయినా అయివుండాలి, లేక అతనంటే బాగా కక్షవున్న వారైనా ఐవుండాలి!— అనుకున్నాడు కిరణ్.

ఒంగి శవం దగ్గర గొంతు కూర్చున్నాడు. ఆధారాలేమైనా దొరుకుతాయని వెయ్యి కళ్ళతో వెతుకుతున్నాడు.

"మీకు తెలిసి మూర్తికి శత్రువులెవరైనా వున్నారా?"

"నాకు తెలిసినంతవరకు ఎవరూ లేరు సార్!" అన్నది సరోజ. ఆమె బాగా డీలా పడిపోయింది.

"శవాన్ని మార్చ్యురీకి పంపించేస్తున్నాను" అన్నాడు శ్రీనివాస్.

కిరణ్ దృష్టి అకస్మాత్తుగా ఓచోట నిలిచిపోయింది. శవానికి అతి దగ్గరలో చెట్టుకొమ్మలో పడివున్న వస్తువు అతని దృష్టి నాకర్షించింది. దాన్ని చేతిలోకి తీసుకున్నాడు. అది పులిగోరు పతకం లాకెట్లో పొదగబడ్డ బంగారు ఛయిన్.

తనవద్ద ప్రశ్నార్థకంగా చూస్తూన్న శ్రీనివాస్ వంక చూసి "ఇక శవాన్ని తరలించవచ్చును" అన్నాడు.

తర్వాత సరోజవైపు తిరిగి, "ఈ కేసు విషయంలో ఇంకా ముఖ్యమైన సమాచారం ఏదయినా చెప్పగలరా?" అనడిగాడు.

సరోజ ఓ క్షణం తటపటాయించి ప్రభంజన్ గురించి చెప్పింది. అయితే పులిగోరు పతకం మాత్రం అతనిది కాదని చెప్పింది.

కిరణ్ సాలోచనగా తలూపి, శ్రీనివాస్‌తో "ఇతనికి నిన్నంతా ఎలిబీ వున్నదీ లేనిదీ వివరాలు కావాలి"

అన్నాడు.

శ్రీనివాస్ సార్జెంట్ శివాన్ని పిలిచి, ఆ పనికి పురమాయించాడు.

## 7

పోలీస్ స్టేషన్‌లో కిరణ్, శ్రీనివాస్ చర్చించుకుంటున్నారు.

ఫోన్ మోగింది. శ్రీనివాస్ అందుకున్నాడు. మెసేజ్ వింటున్న అతని ముఖ కవళికలు చకచక మారిపోతున్నాయి. రెండు నిమిషాల తర్వాత ఫోన్ పెట్టేసి, "మరో శవం సిద్ధంగా వుందని కబురొచ్చింది" అన్నాడు శ్రీనివాస్.

"ఎక్కడ?" అడిగాడు కిరణ్.

"మలక్ పేట."

"పద, యెవరు ఫోన్ చేశారు?"

"తెలియదు. హత్య యెప్పుడు యెవరు ఎలా చేశారో తెలీదు గాని, 'ఆ యింట్లో మీకో శవం కన్పిస్తోంది, పోయి వెరిఫై చేసుకోండి' అని చెప్పేసి యెవరని అడుగుతుండగానే ఫోన్ పెట్టేశారెవరో" అన్నాడు శ్రీనివాస్.

మొత్తం సిబ్బందితో జీపు మలక్ పేట చేరుకుంది పదినిమిషాల్లో. ఫోన్‌లో చెప్పబడ్డ నంబరు యింటివద్ద ఎవరూ లేరు బయట. తలుపులు దగ్గరగా వేసి వున్నాయి. తెరవగానే తెరుచుకున్నాయి.

ముందు గదిలోనే బెడ్ మీద ఓ స్త్రీ మామూలుగా నిద్రపోతున్నట్టుగానే కనిపిస్తోంది. చాలా ప్రశాంతంగా నిద్రపోతున్నట్టుంది. పక్కనే టేబిల్ మీద నిద్రమాత్రల సీసా, సగానికిపైగా ఖాళీగా వుంది. ఏదో పుస్తకం

కింద రెపరెపలాడుతున్న పావుతావు సైజు కాగితం.

కిరణ్ కాగితాన్ని తీసి చూశాడు. తన చావుకు ఎవరూ కారణంకాదనీ, జీవితంమీద విరక్తి పుట్టి ఆత్మహత్య చేసుకుంటున్నట్టు రాయబడివుందా చీటీలో. కింద సంతకం 'సుశీల' అనివుంది.

సరిగ్గా అదే సమయంలో బయట ఆటో ఆగిన శబ్దం వినిపించి అందరూ తొంగి చూశారు. సూట్ కేసుతో కంగారుగా లోపలికి వస్తున్నాడో యువకుడు. బయట పోలీసు జీపుని, పోగుబడ్డ జనాన్ని చూసి కంగారు యింకా హెచ్చింది.

గుమ్మం బయటనే శ్రీనివాస్ అతన్ని నిలేశాడు.

"మీరెవరు, ఏం కావాలి?" అన్నాడు గంభీరంగా.

"ఇది మా యిల్లేనండి. మీరందరు ఎందుకొచ్చారో అర్థంకావటంలేదు" అన్నాడతను.

"మీ పేరు?"

"శేఖరం."

"ఎక్కడ్నించి వస్తున్నారు?"

"రెండు రోజులక్రితం విజయవాడ వెళ్ళాను సార్ మా తల్లిగారికి సుస్తీ చేసిందని. ఇంతకీ ఏం జరిగింది సార్!"

శ్రీనివాస్ సమాధానం చెప్పకుండా "సుశీల ఎవరు?" అనడిగాడు.

"నా భార్య సార్. అసలేం...."

శ్రీనివాస్ గుమ్మానికి అడ్డంతొలిగాడు. లోపలికి చూస్తూనే కెవ్వుమన్నాడు శేఖరం.

"ఆమెకేమైంది సార్...." అంటూ ఒక్క దూకులో లోపలికొచ్చి పడ్డాడు. విషయం గ్రహించాక ఆడపిల్ల

లాగా భోరున ఏడ్చెయ్యసాగాడు.

కిరణ్ అతని వంకే పరిశీలనగా చూస్తున్నాడు. ఫొటోగ్రాఫరు నిపుణుడు, డాక్టరు తమ పనులు చేసుకు పోతున్నారు.

డాక్టరు తన పరీక్ష ముగించే లోపలే కిరణ్ శవాన్ని పరిశీలనగా చూసి ఓ నిర్ధారణకు వచ్చేశాడు.

“నా భార్య ఆత్మహత్యకు నేనే కారణం సార్! ఆమె నా బాధ పడలేక ఆత్మహత్య చేసుకుంది” అంటున్నాడు శేఖరం వెక్కిళ్ళ మధ్య.

శ్రీనివాస్ అతని మాటల్ని జాగ్రత్తగా వింటున్నాడు.

“ఏం చేశారు, మీ ఆవిడను ఏం బాధలు పెట్టారు?” అనడిగాడు.

“నాకు ఉద్యోగం లేదు సార్! ఆమె సంపాదించి తేవటం, నేనింట్లో కూచుని తినటం యిలా సాగుతోం దిన్నాళ్ళు. ఆమె సంపాదించటం నాకు నామోషీగా అనిపించి వుండలేక ఏదయినా అంటుండేవాడ్ని! నేను ఈ ఊరు వెళ్ళి వచ్చేలోపల తన జీవితాన్ని అంతం చేసుకుంది. నేను హంతకుడ్ని, నన్ను అరెస్టు చెయ్యండి” అన్నాడు శేఖరం.

కిరణ్ జాలిగా చూశాడతని వంక.

“డాక్టర్! మరణం నిద్రమాత్రలవల్ల కాదు, ఇంట్రావీనస్ యిన్‌టాక్సికేషన్ వల్ల సంభవించిందని నేననుకుంటున్నాను. ఏమై రైట్?” అన్నాడు కిరణ్.

ప్రభుత్వ డాక్టరు ఆశ్చర్యసంభ్రమాలతో చూశాడతనివంక. “ఎగ్జాట్లీ! ఇది ఆత్మహత్య కాదు—హత్య! పైకి ఆత్మహత్యలా సృష్టించాడు. విషపూరితమైన నీడిల్ చేతి వెయిన్‌కి గుచ్చి హత్యచేశాడు హంతకుడు. బట్

షి వాజ్ నాట్ రేప్డ్ బిఫోర్ మర్డర్డ్" అన్నాడు డాక్టరు.

కిరణ్ ఆమె కుడిచేతి నరానికి నీడిల్‌తో చేసిన గాయాన్ని అంత క్రితమే గుర్తించాడు.

"అయితే, ఆమె నిద్రలో వుండగానే, సూదిగుచ్చి విషం ఎక్కించి చంపేసి వుండాలి, అవునా?"

"అవును. సైనేడ్ కావటంవల్ల ఇమ్మిడియేట్ డెత్! ఆమె మేలుకుని ఎటాక్ నెదుర్కొనేందుకూడా టైం చాలనంత స్పీడుగా ప్రాణం పోయింది. హత్య రాత్రి 1 గంట తర్వాత జరిగింది" అన్నాడు డాక్టరు.

శ్రీనివాస్ వెంటనే శేఖరం చేతిని దొరకపుచ్చుకుని, "నువ్వే నిజంగా హంతకుడివి! నీ భార్య ఆత్మహత్య చేసుకున్నట్టు సీన్ సృష్టించి, హత్యచేసి ఏం యెరగనట్టు బయటికిపోయి, నాకు ఫోన్ చేసి, యిప్పుడే ఊర్నుంచి దిగిన వాడిలా బ్రహ్మాండంగా నటించావు. నిన్ను అరెస్టు చేస్తున్నాను" అన్నాడు.

శేఖరం నిర్ఘాంతపోయి చూశాడతనివంక.

"సార్, ఏమిటి మీరంటున్నది? చేతులారా నా భార్య ప్రాణాం నేను తీశానా? భలే చెప్పారండి! నా భార్య చావుకి పరోక్షంగా నేనే కారణమని నేను కుమిలి పోతుంటే నన్ను హంతకుడుగా జమకడుతున్నారా?" అన్నాడతడు ఆవేశంగా.

"మిస్టర్ శ్రీనివాస్! అతను హంతకుడు కాదు, అవిగో అతని పర్సు జేబులోంచి బస్ టిక్కెట్లు కనిపిస్తున్నాయి. విజయవాడనుంచి హైదరాబాదు బస్ ఫేర్ ఇరవై ఎనిమిదిరూపాయ. అందుకు సరిపడే టిక్కెట్లు న్నాయో, లేదో వెరిఫై చేయి, సరిపోతుంది" అన్నాడు

కిరణ్.

శ్రీనివాస్ అతని దగ్గర్నుంచి బస్ టిక్కెట్లు తీసుకొని చూశాడు. సరిగ్గా ఇరవై ఎనిమిది రూపాయిల విలువగలవి వున్నాయి.

"ఇప్పుడిక్కడే మలక పేట చౌరస్తాలోనే బస్ దిగి ఆటోలో వచ్చాను సార్! ఈ రెండు రోజులు నేను విజయవాడలో కాళేశ్వర్రావు మార్కెట్ వీధిలో మా యింట్లో వుండివచ్చాను. వెరిఫై చేసుకోండి!" అన్నాడు శేఖరం.

కిరణ్, శ్రీనివాస్ వంక సాభిప్రాయంగా చూశాడు. శ్రీనివాస్ శేఖరం వంక గుర్రుగా చూశాడు.

కిరణ్ శవం పక్కమీద, మంచం కిందా, చుట్టు పక్కల ప్రతి సెంటీమీటరు గాలించాడు.

ఈలోపల శేఖరం తన భార్య పేరన రాయబడ్డ చీటీ చూసి "ఇది సుశీల దస్తూరి కాదు" అన్నాడు.

కిరణ్ తల పంకించాడు. వేలిముద్రల నిపుణుడితో "నిద్రమాత్రల సీసామీద వేలిముద్రలేమైనా దొరికాయా?" అనడిగాడు.

"లేవు సార్, కావాలనే తుడిచేశారు. తాగటానికి ఉపయోగించబడ్డ గాజుగ్లాసుమీద కూడా వేలిముద్రలు లేవు. గ్లాసు అడుగున కొద్దిగా నీళ్ళు మిగిలినట్టున్నాయి. టాబ్లెట్ల పొడికూడా కనిపిస్తోంది!" అన్నాడతను.

"హంతకుడు ఆత్మహత్య అని నిరూపించటానికి ప్రయత్నించాడు. తన వేలిముద్రలు గ్లాసుమీద సీసామీద పడకుండా చూసుకున్నాడు. అయితే, వాటిమీద మృతురాలి వేలిముద్రలు పడేలాగా జాగ్రత్త తీసుకో లేదు" అన్నాడు కిరణ్.

"మూర్తి హత్యకు, యీమె హత్యకు ఏమైనా సంబంధముందంటావా?"

"ఎలా చెప్పగలం? రెండూ రెండు విభిన్నమైన పద్ధతుల్లో చెయ్యబడ్డ హత్యలు.... చూడండి శేఖరంగారూ, మీకు 'మూర్తి' అనబడే స్నేహితుడుగాని, శత్రువుగాని యెవరైనా వున్నారా?" కిరణ్ శేఖర్ని అడిగాడు.

శేఖరం ఒక నిమిషం ఆలోచించి, "అతనేం చేస్తూంటాడు సార్?" అన్నాడు.

"ఎవరైనా గుర్తొచ్చారా?"

"వామనమూర్తి అని మా స్నేహితుడొకతను కాకినాడలో వున్నాడు."

"కాకినాడలో కాదు, యిక్కడ హైద్రాబాద్‌లో యెవరైనా వుంటే చెప్పండి!"

"లేదు సార్! నా భార్యకి ఎవరైనా తెలుసేమో, నాకు తెలీదు."

"ఆల్ రైట్! మీరు మాతోపాటు స్టేషన్‌కొచ్చి స్టేట్‌మెంట్ యివ్వండి. ఫార్మాలిటీస్ అయ్యాక మీ మిసెస్ డెడ్ బాడీ మీకప్పగిస్తాం."

# 8

"సార్జంటు శివం యిన్ఫర్మేషన్ తెచ్చాడు. నిన్న రాత్రి సరోజ మేనమామ ప్రభంజన్‌కి బలమైన ఎలిబీ వుంది. అతను మూర్తిని హత్యచేసే అవకాశంలేదు" అన్నాడు యిన్‌స్పెక్టర్ శ్రీనివాస్.

డిటెక్టివ్ కిరణ్ తలపంకించాడు.

"అయితే ఆ పులిగోరు పతకమున్న చైయిన్....?"

"అదే మొదటి కేసుకి ఇప్పటివరకు దొరికిన ఆధారం! సుశీల హత్య విషయంలో ఆ సూత్రం తప్ప మరో

ఆధారం లేదు. ఎంతమంది దస్తూరీలు పరీక్షించగలం?"

"అయితే, కేసుముందుకి జరిగేదెలా?" శ్రీనివాస్ నీరసపడిపోయాడు.

కిరణ్ కేదో స్ఫురించి, "ఆ స్లీపింగ్ టాబ్లెట్సు గార్డినల్ కదూ!" అన్నాడు.

"అవును, ఏం?"

"అవి డాక్టర్ ప్రిస్క్రిప్షన్ మీద తప్ప యివ్వరు అవునా?"

"అయితే...."

"ఆ టాబ్లెట్సు ఎక్కడ కొన్నారో తెల్సుకుంటే ప్రిస్క్రిప్షన్ స్లిప్ నిబట్టి అది ప్రిస్క్రైబ్ చేసిన డాక్టర్ని తద్వారా ఆ పేషెంటుని—అదే హంతకుడ్ని—ట్రేస్ చెయ్యవచ్చును."

శ్రీనివాస్ చప్పరించేశాడు. "ఈ మహానగరంలో ఎన్నో వందల వేల మెడికల్ స్టోర్సున్నాయి. వాటిలో ఎక్కడ కొన్నాడో, అసలు ప్రిస్క్రిప్షన్ లేకుండా నే కొన్నాడో—ఎవరు చెప్పగలరు?" అన్నాడు.

"ప్రయత్నిస్తే సాధ్యంకానిదంటూ లేదు. మీది ఇంత పెద్ద డిపార్టుమెంటుంది, ఆ మాత్రం మెడికల్ స్టోర్సుని ట్రేస్ చెయ్యలేకపోతే ఎందుకు? ఒకోసారి బాచ్ నంబరు, ఎక్స్పైరీ డేట్ నిబట్టి కూడా మందుల షాపుల్ని ట్రేస్ చెయ్యవచ్చు. ఇదివరలో నేను అలాంటి కొన్ని కేసులు పట్టుకున్నాను కూడా!"

శ్రీనివాస్ సార్జంట్ రాజుని పిలిపించి కిరణ్ ఆదేశాలను ఫాలోకమ్మని చెప్పాడు.

కిరణ్ రాజుతో ఏం చెయ్యాలో వివరించి చెప్పాడు. శ్రీనివాస్ రాజుకి టాబ్లెట్సున్న సీసా చూపించి,

వివరాలు చెప్పాడు. రాజు తలూపి వెళ్ళిపోయాడు.

"నేను వెళ్తాను. ఏదయినా అవసరమైతే ఫోన్ చెయ్యి" అన్నాడు కిరణ్ వెళ్ళటానికి లేస్తూ.

"ఓ.కే!" అని శ్రీనివాస్ అంటుండగానే ఫోన్ గణగణ మోగింది.

"హాల్లో, నువ్వా మిష్టర్ కైలాష్..వాట్? హత్యా? ఇప్పుడే బయల్దేరి వస్తున్నాను. నువ్వు స్పాట్‌లోనే వుండు. ఆ, చెప్పు....నంబర్ ...."

కిరణ్ వాళ్ళ సంభాషణ వినగానే మళ్ళీ వెనక్కి వచ్చి కూచున్నాడు.

శ్రీనివాస్ కిరణ్ వంక చూసి, "మరో హత్య! ఇన్‌స్పెక్టర్ కైలాష్ ఫోన్ చేశాడు" అన్నాడు ముందుకి పరుగులు పెడుతూ.

"ఎక్కడ, ఎవరు?"

"వెంగళరావు నగర్‌లో ముకుందయ్య అనబడే ఓ బిజినెస్ మేన్‌ని ఎవరో హత్య చేశారు" అన్నాడు శ్రీనివాస్.

సిబ్బందితో అయిదు నిమిషాల్లో జీప్ బయిల్దేరింది.

వెంగళరావు నగర్ మరో పదినిమిషాల్లో చేరుకున్నది.

గుమ్మంలోనే ఓ పాతికేళ్ళ యువకుడు ఎదురొచ్చాడు. అప్పటికే అక్కడ ఇన్‌స్పెక్టర్ కైలాష్ తన సిబ్బందితో వచ్చి వున్నాడు.

ఆ యువకుడు శ్రీనివాస్ బృందానికి నమస్కారం చేశాడు. శ్రీనివాస్ ప్రశ్నార్థకంగా చూశాడు.

"నా పేరు సంతోష్. ముకుందయ్యగారు నా తండ్రి!" అన్నాడతను. బాగా ఏడ్చివుండొచ్చు ననుకున్నాడు

కిరణ్ అతని ముఖంలోకి చూడగానే.

అతను దారితియ్యగా శవం వున్న గదిలోకి వెళ్ళారంతా, అక్కడ ముకుందయ్య మంచంమీద అడ్డంగా పడివున్నాడు. కంఠం మీద, ఛాతీలోను కత్తిపోట్లు తగిలాయి. రక్తం గదినిండా చిమ్మివుంది.

"హత్య ఎలా జరిగింది?" అడిగాడు శ్రీనివాస్.

సంతోష్ ముందుకొచ్చి, "నేనీ ఉదయం నూన్ షోకి మీరా థియేటర్ కి వెళ్ళాను సార్! ఓ గంట క్రితమే వచ్చాను. తలుపులు ఓరవాకిలిగా తెరిచి వున్నాయి. తెరిచి లోపలికొచ్చాను. ఇంట్లో అలికిడి లేదు. ఏమిటా అని నాన్నగారి గదిముందుగా వెళ్తుంటే యీ దృశ్యం కనిపించింది. నాగుండె జారిపోయినట్టనిపించింది. వెంటనే మా ఎదురింట్లోంచి ఫోన్ చేశాను మీకు!" అన్నాడు.

"ఇంట్లో ఎవరెవరుంటున్నారు?" అడిగాడు కిరణ్.

"మొత్తం అయిదుగురం సార్! నేను, అమ్మా, నాన్న, మా తమ్ముడు, చెల్లెలు."

"మరి తక్కినవాళ్ళు....?"

"అమ్మా, తమ్ముడు, చెల్లి నాలుగురోజుల క్రితం మామయ్యగారింటికి వెళ్ళారు, వాళ్ళింట్లో ఏదో శుభ కార్యముందని! రేపు తిరిగివచ్చేదివుంది."

"అయితే, యింట్లో వున్నది మీ యిద్దరేనన్నమాట ప్రస్తుతం....?"

"అవును సార్!"

"మీ నాన్నగారేం చేస్తూంటారు?"

"సనత్ నగర్లో మాకో చిన్న ఫ్యాక్టరీ వుంది సార్! అది నడుపుతుంటారు."

"ఈ టైంలో ఎప్పుడూ మీ నాన్నగారు యింట్లోనే

వుంటారా?"

"అవును సార్! మధ్యాహ్నం భోజనానికి వచ్చి కాసేపు విశ్రాంతి తీసుకుని మళ్ళీ ఫ్యాక్టరీకి వెళ్తుంటారు. ఈ రోజు అలాగే వచ్చి వుంటారు. వంటమనిషి వంట చేసి డైనింగ్ రూంలో పెట్టి పోతుంది. తర్వాత నేను, నాన్న గారు ఎవరిష్టం వచ్చినపుడు వాళ్ళు తింటాం!"

"మీరేం చేస్తూంటారు?"

"గ్రాడ్యుయేషన్ పూర్తికాలేదు. ఇంకా పరీక్షలకు అప్పియర్ అవుతున్నాను. నేనూ బిజినెస్‌లో చేరతానంటే డాడీ 'చదువుకో' నీకు వ్యాపారం వద్దు అన్నారు. అందుకని వ్యాపారంలోకి యింకా దిగలేదు."

కిరణ్ సంతోష్‌తో మాట్లాడుతున్న సమయంలో తక్కిన సిబ్బంది తమ పనులు చకచక చేసుకుపోతున్నారు. డాక్టరు తన పని పూర్తిచేసుకుని లేచాడు.

కిరణ్ ఆయనవంక ప్రశ్నార్థకంగా చూశాడు.

"హత్య యీ మధ్యాహ్నం పన్నెండు ఒంటిగంట మధ్య జరిగివుండాలి. మల్టిపుల్ యింజరీస్ బై స్టేబింగ్. వెంటనే ప్రాణంపోయి వుండాలి" అన్నాడు డాక్టరు.

కిరణ్ శవాన్ని పరీక్షగా చూసి, "నాకో విషయం స్ఫురిస్తోంది. ఇంజరీస్ అన్నీ ఒకే హత్యాయుధంతో చేసినట్టు అనిపించటంలేదు. గాయం లోతు, ఏంగిల్, గాయం పరిమాణంబట్టి ఎలాంటి ఆయుధంతో ఉపయోగించబడిందీ చెప్పగలం కదా!" అన్నాడు.

"ఎస్, మీ వాదన కరెక్టే!"

"ఈ కేసులో రెండు మూడు హత్యాయుధాలు— అదే కత్తులు — ఉపయోగించబడి వుండొచ్చునని అనుకొంటున్నాను, గాయాలనిబట్టి. గమనించారా?"

డాక్టర్ చిన్నగా నవ్వి, "యూ ఆర్ రైట్! రెండు మూడు కత్తులవల్ల అయిన గాయాలే!" అన్నాడు.

"అంటే ఒకేసారి ఇద్దరు లేక ముగ్గురు కలిసి ఈయన్ని పొడిచి చంపేశారు, అవునా?"

"అలాగే జరిగుంటుంది. గ్రూప్ మర్డర్!"

"నో, హంతకుడు ఒకరే కాదు యిద్దరో ముగ్గురో నలుగురో అయుండవచ్చు" అన్నాడు కిరణ్.

తర్వాత శ్రీనివాస్ వంక తిరిగి, "మధ్యాహ్నం పన్నెండు గంటల తర్వాత యీ యింట్లోకి ఎవరైనా జొరపడ్డారేమో పక్క యిళ్ళవాళ్ళనుంచి సమాచారం సేకరించు" అన్నాడు.

శ్రీనివాస్, కైలాష్‌ని పిలిచి చెయ్యవలసింది చెప్పాడు. కిరణ్, సంతోష్‌ని మళ్ళీ లోపలికి పిలిచాడు.

"మీ నాన్నగారికి వృత్తిపరంగాగాని, వ్యక్తిగతంగా గాని శత్రువులు ఎవరున్నారో మీకు తెలుసా?"

సంతోష్ కాసేపు ఆలోచించి "నాకు తెలిసినంత వరకు అలాంటి వాళ్ళెవరూ లేరు సార్! వృత్తిపరంగా ఎవరైనా వున్నారేమో నాకు తెలియదు" అన్నాడు.

"ఆల్ రైట్! మీరు యెవర్నయినా అనుమానిస్తున్నారా?"

"నాకు ఎవరిమీదా అనుమానం లేదుసార్!"

ఇంతలో ఇన్‌స్పెక్టర్ కైలాష్ లోనికొచ్చాడు. కిరణ్‌తో మెల్లగా చెప్పాడు! "మధ్యాహ్నం పన్నెండున్నర ప్రాంతాల్లో ఓ జీపు వచ్చిందట. అందులో ఫ్యాక్టరీ వర్కర్సులాంటి ముగ్గురు వ్యక్తులున్నారట. మళ్ళీ పదినిమిషాల్లో వెళ్ళిపోయారట. అది ప్రయివేట్

జీప్ అట. ముకుందయ్య ఫ్యాక్టరీలో పనిచేసేవాళ్ళు కావచ్చుననుకున్నారట."

కిరణ్ చకచక వీధిలోకి వచ్చాడు. ముకుందయ్య యింటిముందు కొంత మేర ఇసక ప్రదేశం వుంది. అక్కడ జీపు టైరు గురుతులు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

నిపుణుడ్ని పిలిచి ఆ గురుతులు ట్రేస్ చేయమని ఆదేశించాడు కిరణ్. "ఇవి మహేంద్ర జీపు అయివుండాలి. బహుశా సనత్ నగర్ యిండస్ట్రియల్ ఏరియాలోనే ఏదో ఫ్యాక్టరీదయివుండాలి. హంతకులు ఫ్యాక్టరీ వర్కర్సులా వున్నారని నిర్ధారణగా తెలిసింది. కాబట్టి ముకుందయ్య ప్రత్యర్థులెవరో అతన్ని కిరాయి మనుషుల్నిలేక తన ఫ్యాక్టరీ వర్కర్సునే నియోగించి హత్య చేయించారు. సో, నువ్వు మొత్తం సనత్ నగర్‌లోని ఇండస్ట్రియల్ ఏరియాలో పూర్తి సర్వే చేస్తే హంతకుడు దొరికిపోతాడు" అన్నాడు శ్రీనివాస్‌తో.

ఇన్‌స్పెక్టర్ కైలాష్ కొంతమంది సిబ్బందితో అప్పటికప్పుడు సనత్ నగర్ సాగిపోయాడు.

ఈలోపల సార్జంటు రాజు లోనికొచ్చి మరో యిన్ఫర్మేషన్ యిచ్చాడు. ఈ మధ్య తరచు తండ్రీ కొడుకులు ఘర్షణ పడుతున్నారని, కొడుకు తండ్రితో తెగ తెంపులు చేసుకుంటానని రోజూ గొడవ పెడుతున్నాడనీ తండ్రి అందుకు అంగీకరించటంలేదనీ, పక్కింటివాళ్ళు చెప్పారని - చెప్పాడు.

కిరణ్ సాలోచనగా తల పంకించాడు.

గదంతా వెతికాడు. ఐరన్ సేఫ్ తెరిచివుందేమోనని లాగి చూశాడు. తాళం పెట్టి వున్నది.

సంతోష్‌ని పిలిచి, "ఐరన్ సేఫ్ తాళాలు ఎవరిదగ్గ

రున్నాయి?" అనడిగాడు.

"సాధారణంగా నాన్నగారి దగ్గరే వుంటాయి."

"ఇంట్లో విలువైన వస్తువులేమైనా పోయినట్టు గుర్తించారా?"

"ఏవీ పోలేదు సార్! అన్నీ ఎక్కడివక్కడ వున్నాయి. ఐరన్ సేఫ్‌లో గోల్డు, కొంత కేష్ వుంటాయి. అవి చూడలేదు" అన్నాడు సంతోష్.

ముకుందయ్య జేబుల్లో తాళాలు దొరికాయి. ఐరన్ సేఫ్ తెరిచి, సంతోష్‌ని వెరిఫై చెయ్యమన్నాడు కిరణ్. ఈలోపల ఏదో స్ఫురించి, వేలిముద్రల నిపుణ్ణి పిలిచి, సేఫ్ మీద లోపల వేలిముద్రల కోసం ప్రయత్నించమన్నాడు. నిపుణుడు ఆ పని పూర్తిచేశాక సంతోష్‌ని పిలిచి చెక్ చేయించాడు.

"అన్నీ సరిగానే వున్నాయి సార్! ఏమీ పోలేదు" అన్నాడు సంతోష్.

తర్వాత తాళాలు వేసి కిరణ్‌కి యిచ్చేశాడు.

కిరణ్ శ్రీనివాస్ వంక చూసి, "డబ్బుకోసం జరిగిన హత్యకాదు. దొంగలు చేసిన పనికాదు. ప్లాన్డ్ మర్డర్! వాళ్ళక్కావలసింది ముకుందయ్యని అడ్డుతొలగించటం, అంతే! ఆ అవసరం ఎవరికుందో మనం తెల్సుకోవాలి" అన్నాడు.

హాల్లోకి నడిచాడు కిరణ్. శ్రీనివాస్ అనుసరించాడు.

"సంతోష్ విషయం అనుమానాస్పదంగా వుంది నాకు. తండ్రిని అడ్డుతొలగించుకోవటానికి అతనే యీ హత్య చేయించాడేమో!"

"అప్పుడే ఓ నిర్ణయానికి రావటం కష్టం..." హాల్లో కొన్ని ఫోటోలున్నాయి. వాటిలో ఓ ఫోటోమీద

కిరణ్ దృష్టిపడింది. అశే పరీక్షగా చూస్తూండిపోయాడు.

ఫోటోలో వున్నది సంతోష్! అతని మెడలో ఏదో ఛెయిన్ వున్నట్టు కనిపిస్తోంది ఫోటోలో! కిరణ్ మెదడులో మూర్తి శవం పక్క దొరికిన పులిగోరు పతకం మెరుస్తోంది.

అటు యిటు చూశాడు. సంతోష్ అశే వస్తున్నాడు. చటుక్కున జేబునుండి పులిగోరు పతకంతీసి నేలమీద జారవిడిచాడు కిరణ్.

సంతోష్ దృష్టి ఛెయిన్‌మీద పడింది. కిరణ్, శ్రీనివాస్ మరోవైపు ముఖాలు తిప్పుకుని నిలుచున్నారు.

సంతోష్ ఛెయిన్ దగ్గర ఓ క్షణం ఆగి అటు యిటు చూసి చటుక్కున వంగి దాన్ని జేబులో వేసుకున్నాడు.

కిరణ్ సంతోష్ దగ్గరకొచ్చి, "ఆ చెయిన్ మీ రెక్కడయినా పారేసుకున్నారా?" అనడిగాడు చల్లగా.

పక్కలో బాంబు పడ్డట్టు అదిరిపడ్డాడు సంతోష్. అతని గొంతు తడారిపోయింది.

"ఏ ఛెయిన్‌ని. మీరనేదేమిటో అర్థం కావటంలేదు" అన్నాడు తడబడుతూ.

"ఇప్పుడు జేబులో వేసుకున్నావు చూడు బాబూ, ఆ ఛెయిన్ సంగతే! ఛెయిన్ వేసుకుని మరీ ఫోటోది గావుకదా, ఆ ఛెయిన్ అది మాకు ఓచోట దొరికిందిలే! నీకిద్దామనే తెచ్చాం" అన్నాడు కిరణ్.

"నో, నాకేం తెలీదు. కింద ఏదో ఛెయిన్ పడివుంటే మా చెల్లెలిదేమో పడిపోయి వుంటుందని తీసి జేబులో వేసుకున్నాను, మా యింట్లోనే దొరికిందికదా అని! అంతే, నాకేం తెలీదు" సన్నగా వణుకుతున్నాడు సంతోష్.

"మూర్తి నెందుకు హత్య చేశావు?" సూటిగా అడిగాడు కిరణ్.

"ఏ మూర్తి? నాకే హత్యసంగతీ తెలీదు. నేనెవర్నీ చంపలేదు."

శ్రీనివాస్‌కి సైగ చేశాడు కిరణ్.

సార్జంటు రాజు సంతోష్ చేతులకు కఫ్స్ తగిలించాడు.

"నేనెవర్నీ చంపలేదు. నన్నొదలండి!" అరుస్తున్నాడు సంతోష్.

## 9

"ఇతను మీకు తెలుసా?" అడిగాడు కిరణ్, సరోజని.

సంతోష్‌ని చూస్తూనే గుర్తుపట్టి "ఇతను తెలియక పోవటమేమిటి? ఎన్నోసార్లు నా వెంటపడి ప్రేమించమని వేధించుకుతిన్నాడు. రెండురోజుల క్రితం కూడా నా వెంటపడి పెళ్ళిచేసుకోమని అడిగాడు. నేను, మూర్తి పెళ్ళిచేసుకోబోతున్నామని, నా వెంట పడొద్దని మందలించాను. ఆ మూర్తిని ఎలా చేసుకుంటావో చూస్తాను అని కోపంగా వెళ్ళిపోయాడు. ఆ మర్నాడే మూర్తి హత్య చెయ్యబడ్డాడు" అన్నది సరోజ.

ఓ గంట తర్వాత మూర్తిని తనే హత్యచేసినట్టు సంతోష్ ఒప్పుకున్నాడు.

శ్రీనివాస్ ఇంటర్‌గేషన్ రూంనించి బయటకొచ్చి, "మూర్తిని హత్య చేసినట్టు ఒప్పుకున్నాడు. కాని తన తండ్రిని హత్యచేయలేదు. చేయించలేదని మొత్తుకుంటున్నాడు. సుశీల హత్యతో కూడా తనకేలాంటి సంబంధమూ లేదని గగ్గోలు పెడుతున్నాడు. నమ్మాలంటావా?" అన్నాడు.

కిరణ్ నవ్వుతూ మాట్లాడతనివంక. "నీ పోలీసు మర్యాద చవిచూశాక కూడా నిజం చెప్పని నేరస్థుడుంటాడా? అందులోను అనుభవంలేని సంతోష్‌లాంటి అర్భకులు మీ చిత్రహింసలకు నిజం చెప్పకపోవటమంటూ ఉంటుందా?" అన్నాడు.

"అది నిజమే! మూర్తిని మాత్రమే హత్యచేసి వుంటాడీ కుర్రాడు. మరి నీడి బాబునెవడు చంపాడు? ఆ సుశీలనెవడు చంపాడు? చూడగా ప్రతి కేసుకీ సెపరేట్ హిస్టరీ, సెపరేట్ హంతకులూ వున్నట్టుంది!"

"నా ఊహ నిజమయితే—సుశీల కేసుకి సంతోష్ తండ్రి ముకుందయ్యా హత్యకీ ఎక్కడో లింక్ వుందనిపిస్తోంది. సుశీల పనిచేస్తున్నదీ సనత్ నగర్‌లోని ఏదో ప్రయివేట్ కంపెనీలో కదా! ముకుందయ్యా హంతకులు-సనల్ నగర్ ఏరియాకి సంబంధించినవాళ్ళే! ముకుందయ్యా కేసులో హంతకుడు తెరవెనుక వుండి కథ నడిపివుంటాడు. ఏ విషయమూ నాకకి త్వరలోనే తెలిసిపోతుంది.... మెడికల్ స్టోర్సు విషయం....?"

"అదీ ఎంక్వయిరీలోనే వుంది. మెడికల్ షాపుల వాళ్ళు ఓ పట్టాన చెప్పరు. అందులోనూ పోలీసులు అడిగితే అసలు చెప్పరు!"

"అది నిజమే! ఆ ప్రయత్నం నేను చేస్తాను. అంతే కాదు, సుశీల ఆత్మహత్య చేసుకున్నట్టు రాయబడ్డ చీటీ ఓ ప్రత్యేకమైన తెల్ల కాగితం. పైన లెటర్ హెడ్ వుండి వుండాలి. కొంత భాగం చించినట్టుంది. హంతకుడు అప్పటికప్పుడు తన లెటర్ పాడ్‌నించి చించి రాసి వుండాలి.

మెడికల్ స్టోర్సునించి రెండు యిన్ఫర్మేషన్ దొరుకు

తాయి. గార్డినల్ గురించీ, సైనేడ్ గురించి దాన్ని ప్రయోగించిన నీడిల్ గురించీ. రెండూ ఓ చోటనుంచే సంపాదించి వుంటాడు హంతకుడు. అందుకు ఆ మందుల షాపు అతను చాలా సహాయం చేసి వుంటాడు. ఆ విషయం నేను తెల్సుకుంటాను" కిరణ్ లేచాడు.

"మరి ముకుందయ్య హత్య విషయం...." అన్నాడు శ్రీనివాస్.

"ఈలోపల జీవ్ విషయం పూర్తిగా వివరాలు తెల్సుకో. జీవ్ గురించి తెలిసిపోతే హంతకులు, సూత్రధారి దొరికిపోయినట్టే! ఈలోపల సుశీల హత్య విషయం పూర్తి వివరాలు నేను సేకరిస్తాను. చెప్పానుగా, ఒకటి మనం విప్పగలిగితే రెండో ముడి అదే విడిపోతుంది" అన్నాడు.

కిరణ్ బయటికి అంగలు వేస్తూ.

మరుక్షణం కిరణ్ టయోటా మెత్తటి సిమెంట్ రోడ్ మీద శర వేగంతో దూసుకుపోయింది.

# 16

సాయంత్రం అయిదుగంటలు కావస్తోంది.

కిరణ్ టయోటా సరాసరి వచ్చి పోలీస్ స్టేషన్ ముందాగింది.

కిరణ్ లోపలికి వస్తూండగానే శ్రీనివాస్ యెదురు వెళ్ళి "ఏమయినా ఇన్ఫర్మేషన్ దొరికిందా?" అనడిగాడు.

కిరణ్ మందహాసం చేశాడు.

"హంతకుడు దొరికిపోయినట్టే!" అన్నాడు.

శ్రీనివాస్ ముఖంలో ఆనందం తొంగిచూసింది.

"ఆ గార్డినల్ డాబెల్ట్సు మేనకా మెడికల్ స్టోర్సు నుంచి స్వామి అనబడే వ్యక్తి కొనుగోలు చేశాడు. ఆ

స్వామికి మేనకా మెడికల్ స్టోర్సు యజమానికీ ఎప్పట్నుంచో స్నేహమట! అంతేకాగు సైనేడ్, సిరంజి నీడిల్ కూడా అతనే సప్లయ్ చేసినట్టు ఒప్పుకున్నాడు.

"అంత తేలిగ్గా ఒప్పుకున్నాడా?"

"మీ పోలీసువాళ్ళయితే చచ్చినా ఒప్పుకునేవాడు కాదు. నేను కష్టమర్లా వెళ్ళాను. గార్డినల్ కావాలన్నాను. ముందు లేదన్నాడు. తర్వాత బాగా డబ్బు ఆశ చూపి, రిక్వెస్టింగ్ గా అడగ్గానే సరేనన్నాడు. తర్వాత సైనేడ్ కూడా కావాలన్నాను. ముందు అనుమానంగా చూశాడు, కాని తర్వాత మెత్తబడ్డాడు. ఇదిగో లెటర్ పాడ్, అది కూడా ఆ మెడికల్ స్టోర్సు అతనిదే!"

"కిరణ్ ఓ లెటర్ పాడ్ తీసి టేబిల్ మీద పెట్టాడు. ఆత్మహత్య చీటీ ఆ పాడ్ లోంచి చించిన కాగితంమీది రాసినదే! చీటీ పాడ్ మీద సరిగ్గా సరిపోయింది. పైన మెడికల్ స్టోర్సు పేరు, ప్రొప్రయిటర్ పేరు చించేశాడు హంతకుడు!

"అది సరే, సైనేడ్, గార్డినల్ తనే స్వామి అనబడే వ్యక్తికిని అమ్మినట్టు ఎలా ఒప్పుకున్నాడు?"

"నేను ప్రతి మెడికల్ స్టోర్ లోను గార్డినల్, సైనేడ్ అడుగుతునే వచ్చాను. యెవడూ అమ్మటానికి ఒప్పుకోలేదు. డాక్టర్ ప్రిస్క్రిప్షన్ అడిగారు. డబ్బు ప్రలోభానికి లొంగలేదు. ఈ స్టోర్సువాడు లొంగి పోగానే తక్కిన ప్రొసీజర్ నడిపించాను. లెటర్ పాడ్ చూశాక యితదే ఆ మెడికల్ షాపతను అని గ్రహించేశాను.

తర్వాత చెప్పాను-అతను అమ్మిన గార్డినల్ సైనేడ్

వల్ల ఓ హత్య జరిగిందనీ, ఆ విషయం నా ఒక్కడికే తెలుసనీ, పదివేల రూపాయిలిస్తే ఆ విషయం పోలీసులకు తెలియకుండా దాస్తాననీ, హంతకుడెవరో కూడా నాకు తెలుసనీ! దాంతో మానవుడు బాగా బెదిరిపోయాడు. ఒక్కొక్కటే నిజం కక్కేశాడు.

స్వామితో తనకున్న సన్నిహితత్వంవల్ల అలా ఇవ్వాల్సి వచ్చిందనీ, దానివల్ల హత్య జరుగుతుందని కల్లో కూడా ఊహించలేదనీ, అంత డబ్బిచ్చుకోలేనని ఓ వెయ్యి రూపాయలిస్తాననీ యీ విషయాన్ని పోలీసులదాకా పోనియ్యవద్దనీ కాళ్ళావేళ్ళాపడ్డాడు. మేనకా మెడికల్ షాపతన్ని తర్వాత కస్టడీలోకి తీసుకోందువుగాని, ముందు సనత్ నగర్ వెళ్ళాలి!" పద అన్నాడు కిరణ్ లేచి నిలబడుతూ.

"అయితే ఆ స్వామి అనబడే వ్యక్తి...."

"సనత్ నగర్ లో ఓ ఫ్యాక్టరీ యజమాని. పైదిపై, అదే ఫ్యాక్టరీలో సుశీల స్టెనోగా పనిచేస్తోంది. చాలా?" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ కి మంచు తెర విడిపోయింది.

"సిబ్బందితో రెడీగా వచ్చెయ్యమంటావా?" అని శ్రీనివాస్ అంటుండగానే ఓ వ్యక్తి హడావిడిగా స్టేషన్ లోపలికి దూసుకు వచ్చేశాడు.

"సార్, నన్ను రక్షించండి! కొంతమంది దుండగులు నామీద హత్యాప్రయత్నం చెయ్యబోయారు. తప్పించుకుని ఆటోలో పారిపోయి వచ్చాను" అన్నాడతను. ఆయాస పడిపోతున్నాడు. బాగా భయపడిపోయినట్టున్నాడు.

కిరణ్ అతన్ని కూచోబెట్టి, కొన్ని మంచినీళ్ళు

తెప్పించి యిచ్చి, అతను సర్దుకున్నాక, "ఇప్పుడు చెప్పండి—మీకిక ఏ భయం అక్కర్లేదు. ఎవరు మిమ్మల్ని హత్య చేయబోయారు? మీ కెవరు? వాళ్ళకి మీకూ ఏమిటి శత్రుత్వం?" అనడిగాడు.

అతను రిలాక్సయి, "నా పేరు రఘు సార్! ఇన్‌కం టాక్స్‌లో పని చేస్తున్నాను. ఈ రోజు ఆఫీసయ్యాక యింటికి తిరిగొస్తున్నాను. రోజూ కాలినడకనే నేను ఆఫీసుకి పోయివస్తాను. ఆఫీసుకి దగ్గర్లోనే మా యిల్లు. ఈ రోజు అలాగే నడుస్తూ ఏదో ఆలోచనలో నా వెనక ఏదో జీప్ ఆగటం చూసుకోలేదు.

జీప్‌నుంచి నలుగురు వ్యక్తులు దిగారు. నలుగురు చేతుల్లోను పొడవాటి కత్తులున్నాయి. చుట్టూ జనం యెవరూ లేరు. అక్కడ జనసమర్థం బాగా తక్కువ. ఆఫీసుకు దగ్గరని నేను ఆ దారినే వచ్చి వెళుతుంటాను రోజూ. ఒక్కసారిగా వాళ్ళు నామీద దాడిచెయ్యటంతో నాకేం తోచలేదు.

"నువ్వేనా రఘు?" అనడిగాడు అందులో ఒకడు కర్కశంగా.

నేను సమాధానంకోసం వెతుక్కుంటుండగా ఆపద్బాంధవుడిలా ఓ ఆటోఅతనొచ్చాడు అటుగా. వెంటనే అందులోకి ఉరికేశాను. డ్రైవరు సమయస్ఫూర్తిగా ఎక్కడికని కూడా అడక్కుండా సరాసరి అక్కడ్నించి తప్పించుకు తీసుకొచ్చేశాడు.

జీప్‌లో వాళ్ళు ఎక్కి అది స్టార్టయ్యేసరికి మెయిన్ రోడ్‌కొచ్చేసింది ఆటో. నేనే యిక్కడికి తీసుకుపొమ్మన్నాను అతన్ని. నన్ను దించేసి, పోలీసు కేసుల్లో ఎందుకనుకున్నాడేమో ఫేర్ కూడా అడక్కుండా వెళ్ళి

పోయాడు" అంటూ ముగించాడు.

"ఆ నలుగుర్నీ మీ రెప్పుడైనా చూశారా?" అడిగాడు కిరణ్.

"లేదు సార్! ఇదే చూడటం!"

"అంటే మీ శత్రువెవడో వాళ్ళని మీమీద ప్రయోగించి వుండొచ్చు. మీకు యెవరిమీదనైనా అనుమానం వుందా?"

రఘు రెండు క్షణాలు ఆగి "స్వామి అని నా చిన్ననాటి స్నేహితుడున్నాడు" అంటూ స్వామికి తనకి నాలుగు రోజులక్రితం జరిగిన సంభాషణ పొల్లుపోకుండా చెప్పాడు.

"అతనేం చేస్తూంటాడు?"

"సనత్ నగర్లో అతనికో ఫ్యాక్టరీ వుంది. డొమెస్టిక్ పంప్ సెట్సు విడిభాగాలు తయారవుతాయక్కడ" అన్నాడు రఘు.

"గుడ్ మంచి యిన్ఫర్మేషన్ యిచ్చారు" అన్నాడు కిరణ్. శ్రీనివాస్ వంక తిరిగి "జీప్ ఓనర్సు వివరాలు వచ్చాయా?" అనడిగాడు.

"ఇంకాలేదు. సార్జంట్ శివం రావాల్సి వుంది."

సరిగ్గా ఆ దేసమయంలో బయట జీప్ ఆగింది. అందులో నుంచి ఇన్స్పెక్టర్ కైలాష్, సార్జంట్ శివం దిగారు.

సార్జంట్ శివం ఓ కాగితం శ్రీనివాస్కి అందించి "మహేంద్ర జీప్ లున్న ఫ్యాక్టరీ పేర్లు, వాళ్ళ ఓనర్సు పేర్లు సార్ యివి!" అన్నాడు.

కిరణ్ లిస్టులోకి చూసి, 'డొమెస్టిక్ పంప్ సెట్ ఎక్సెసరీస్' అన్న కంపెనీ పేరు కింద ఎస్.ఆర్. స్వామి అన్న పేరు చూసి తలపంకించాడు.

“సో, యీ స్వామి విశ్వరూపం సర్వత్రా ఆవరించి వున్నది. ఆ స్వామే యిప్పుడు యీయనమీద హత్యా ప్రయత్నం చేయించిన సూత్రధారి, అతనే ముకుందయ్యని హత్య చేయించిన స్వామి. ముకుందయ్య ఫ్యాక్టరీకూడా డొమెస్టిక్ నీటిపంపుల విడిభాగాలు తయారుచేస్తూన్న సంస్థే! ఇద్దరికీ వృత్తిపరంగా శత్రుత్వం వుండివుండాలి. గో ఎ హెడ్! సుశీలనెందుకు చంపాడో కూడా అతనే చెపుతాడు అరెస్టయ్యాక!” అన్నాడు కిరణ్.

• • •

తర్వాత శ్రీనివాస్ ఫోన్ చేసి చెప్పాడు!

“స్వామి తన నేరాలు ఒప్పుకున్నాడు. ముకుందయ్యని చంపడానికి వృత్తిపరంగా వున్న గొడవలే కారణం!

ఇకపోతే, సుశీలపట్ల ఓసారి అసభ్యంగా ప్రవర్తించాడట! తన దగ్గర పనిచేస్తూన్న మనిషే కదా ఒప్పుకోక పోతుందా అని లెటర్ డిక్టేట్ చేస్తూ ఆఫీసు తలుపులు మూసేశాడట! సుశీల పెద్ద గొడవచేసి అరిచి అందరికీ చెపుతానందిట. దాంతో జడిసిపోయి తలుపులు తీసి వదిలేశాడట!

రెండు రోజులు ఆమె ఫ్యాక్టరీకి రాలేదట. తన విషయం అందరికీ చెప్పేస్తే తన పరువు పోతుందని, శేఖరం సమయానికి ఊళ్ళో లేని విషయం నిర్ధారణ చేసుకుని, సుశీలని తెలివిగా తనే హత్యచేసి, ఆత్మహత్య అని నిరూపించే ప్రయత్నం చేశాడుట.”

—: అయిపోయింది: —

# రాగ ద్వేషాలు

టెంపోరావ్

గుప్తా యిచ్చిన పార్టీలో ఆనంద్ ఎక్కువగా స్కాచ్ విస్కీ సేవించాడు. తర్వాత డిన్నర్‌లో పాల్గొన్నాడు. అప్పటికి టైము పదకొండు కావస్తోంది.

పార్టీ తర్వాత అదే హోటల్లో వున్న తన గదికి ఆనంద్ వెళ్ళలేదు. హోటల్లోంచి బయటకు నడిచాడు. రోజంతా వేడిగా వుంది ఢిల్లీలో. రాత్రి హాయిగావుంది. చల్లగాలిలో, చంద్రకాంతిలో నడవాలనిపించింది అతనికి.

హోటల్ గేటుదాటి అతడు రోడ్డమ్మట నడవ సాగాడు. రోడ్డు లైట్లు ప్రకాశవంతంగా వెల్గుతున్నాయి. రోడ్డు వారగా ఆనంద్ వుషారుగా నడుస్తున్నాడు.

అతడు ముందుకు చూశాడు. యెవరో యువతి అతడికి ముందు, కొంచెం దూరంలో నడుస్తోంది. రోడ్డు లైట్ల కాంతిలో ఆమె వెనుక భాగం మాత్రం అతడికి కనిపిస్తోంది. ఆనంద్ సిగరెట్ వెలిగించాడు. పొగవదుల్తూ ముందుకు అడుగులేస్తున్నాడు.

పాత అంబాసిడర్ కారు అతడి పక్కనుంచి దూసుకుపోయింది. కారులో ఆరడజనుమంది మనుషులున్నారని అతడు చూడగల్గాడు.

మరుక్షణంలో ఆ కారు ముందు వెళ్తూన్న యువతి పక్కనే ఆగింది. ఆగిన కారుకేసి చూసి ఆమె దూరంగా జరిగి నడవసాగింది.

కారు తలుపులు తటాలున తెరిచి నలుగురు మనుషులు కిందకు దూకారు. ఇదంతా గమనిస్తూ ఆనంద్ అటువైపు వేగంగా వెళ్ళాడు.

ఇద్దరు మనుషులు ఆమెను యిరువైపులా పట్టుకొని కారు దగ్గరకు యీడ్చుకుపోయారు. ఆమె అరుస్తోంది. వాళ్ళతో ఆమె ధైర్యంగా పోరాడుతోంది.

ఆనంద్ రోడ్డుకి యిరువైపులా చూశాడు. ఎక్కడా జనసంచారంలేదు. అతడు వేగంగా వాళ్ళవైపు పరుగెత్తాడు. కరాటేలో ఆనంద్ ఆరితేరినవాడు.

ఆమెను పట్టుకున్న వాళ్ళిద్దరూ బాతుల్లా దూరంగా ఎగిరిపడ్డారు. ఆనంద్ ఆమెవైపు చూశాడు.

"దూరంగా పొండి! మీ యింటికి పరుగెత్తండి! వీళ్ళ సంగతి నేను చూస్తాను" అర్చాడు ఆనంద్.

మరో యిద్దరు అతడితో కలియబడ్డారు. ఇనపకడ్డీలాంటి చేత్తో ఒకడి మెడమీద కొట్టి, రెండోవాడిని అతడు బూటు కాల్తో తన్నాడు.

మెడవిరిగి ఒకడు నేలమీద కూలిపోయి మూలుగుతున్నాడు. రెండోవాడు కారు బోనెట్ మీదనుంచి అటువైపు ఎగిరిపడ్డాడు.

రోడ్డుమీద సగర్వంగా నిలబడి ఆనంద్ వాళ్ళవైపు చూశాడు.

"ఎవరేనా వుంటే రండి! మీ చేత మట్టి తినిపిస్తాను!" అరిచాడు ఆనంద్.

కార్లో వున్న యిద్దరూ బయటకు దిగలేదు. కారు మెల్లిగా కదిలింది. నేలకూలిన వాళ్ళు లేచి పరుగెత్తుకు వెళ్ళి కార్లో దూరి తలుపులు మూశారు.

ఆనంద్ కారువైపు పరుగెత్తాడు. కారు నంబరు గుర్తుంచుకున్నాడు.

"మళ్లా యిటువంటి పనిచేస్తే ఎముకలు విరగ కొడ్తాను!" అరిచాడతను.

అంబాసిడర్ కారు దూసుకుపోయింది. రోడ్డు పొడుగునా చూశాడతను. ఆ యువతి రూపం యెక్కడా కనపడలేదు.

వెనకనుంచి ఒక తీయటి కంఠం విని ఆతడు తృళ్ళిపడ్డాడు.

"నన్ను రక్షించారు. మీకు నా థాంక్స్!"

వెనక్కు తిరిగి రోడ్డులైటు కాంతిలో ఆతడామెవైపు నవ్వుతూ చూశాడు.

ఆమె వయస్సు ఇరవై రెండు సంవత్సరములు వుండొచ్చు. చాలా అందమైన యువతి. కోల ముఖం. పెద్ద కళ్ళు. ఎర్రటి పెదిమలు. తీర్చిదిద్దిన ముక్కు, సన్నగా, పొడుగ్గా వుందామె. ప్రింటెడ్ సిల్కు చీర ధరించింది. మాచింగ్ జాకెట్. చేతిలో ఎర్రటి హేండ్ బాగ్.

"డోంట్ బాదర్! ఇంత రాత్రివేళ మీరు ఒంటరిగా వెళ్ళకూడదు" అన్నాడతను.

"ఇవాళ ఆఫీసులో పదిదాకా వుండవలసి వచ్చింది" అందామె.

"మీ యిల్లెక్కడ?"

"మరో కిలోమీటర్ దూరం వెళ్ళాలి!"

"నా పేరు ఆనంద్. మద్రాస్‌నుంచి వచ్చాను."

"నా పేరు లిమా" అందామె.

"వాళ్ళు మళ్ళా మీకోసం రావచ్చు! మిమ్మల్ని మీ యింటికి తీసుకువెళ్తాను."

"చాలా థాంక్స్" అందామె.

ఇద్దరూ పక్కపక్కనే నడవసాగారు. అతడు ఏవో ప్రశ్నలు వేస్తున్నాడు. ఆమె నవ్వుతూ జవాబిస్తోంది.

కాస్సేపట్లో మెయిన్ రోడ్డునుంచి పక్క రోడ్డుకు తిరిగారు వాళ్ళు. ఒక యింటిముందు ఆమె ఆగింది. మూడంతస్తుల భవనం.

ముందు హాల్లో వున్న మెట్లెక్కి ఆమె పైకి వెళ్ళింది. ఆమె పక్కనే మెట్లెక్కాడు ఆనంద్.

ఒక ఫ్లాట్ ముందు ఆగి, తాళం తెరిచి లోపలకు వెళ్ళింది.

"ప్లీస్, కమిన్!" అందామె.

అతడు లోపలకు నడిచాడు.

చిన్నగది. ఒకవైపున మంచం వుంది. రెండు పేము కుర్చీలున్నాయి.

గదిలోని ఫ్లోరసెంట్ లైట్ ప్రకాశవంతంగా వెలుగుతోంది. ఆనంద్ కుర్చీలో కూర్చుని గది నలువైపులా చూశాడు. ఆమె లోపలకు వెళ్ళింది. కాస్సేపట్లో తిరిగొచ్చింది.

"టీ చేసి యిస్తాను, వుండండి!"

"నో, వద్దు! కాస్సేపు ఇలా కూర్చోండి. మాట్లాడి పోతాను" అన్నాడతను.

ఆమె పేము కుర్చీలో కూర్చుంది. అతడివంక నవ్వుతూ

చూసింది.

"మీరీ ఫ్లాట్లో ఒంటరిగా వుంటున్నారా?" ప్రశ్నించాడతను ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ.

అతడివైపు ఆమె విచారవదనంతో చూసింది.

"నాకు తోడుగా అమ్మ వుండేది. ఆమె నెల క్రితం మరణించింది" అందామె.

"మీతో వుండడానికి మరెవరూ లేరా?"

ఆమె అడ్డంగా తలాడించింది.

"లిమా, ఈ ఢిల్లీ పట్నంలో ఎన్నో ఘోరాలు జరుగుతూ వుంటాయి. మీలాంటి అందమైన యువతి ఒంటరిగా వుండకూడదు" అన్నాడతను.

ఆటుపైన చాలా సేపటివరకూ యిద్దరూ మాట్లాడుతూ కూర్చున్నారు. బయట తలుపు మూసి ఆమె అతడిని లోపల గదిలోకి తీసుకు వెళ్ళింది.

ఆమెకు ఎదురుగా అతను కూర్చున్నాడు. ఆమె తింటోంది. అతడు ఏమీ తిననన్నాడు. "నా గురించి అంతా చెప్పాను. మీ గురించి చెప్పండి" అందామె.

"నాది మద్రాస్. నాకు షుగర్ మిల్లు, సిమెంట్ ఫాక్టరీలు వున్నాయి. నాకు చిన్నతనంలోనే పెళ్ళయి పోయింది. ఒక కొడుకు వున్నాడు" అన్నాడతను.

తిండి ముగించి ఆమె చెయ్యి కడుక్కొంది. అతడు టైము చూశాడు. ఒంటిగంట కావస్తోంది.

ఇద్దరూ ముందు గదిలోకి వచ్చారు.

"లిమా, నేను వెళ్తాను" అన్నాడతను.

"ఇంత రాత్రివేళా? ఇక్కడ పడుకోండి. పొద్దుటే వెళ్ళొచ్చు" అందామె.

"ఫరే ఛేంజ్ మీరు నాతో హోటల్‌కి రండి. అక్కడ బాగుంటుంది."

"ఇక్కడ బాగాలేదా?" అందామె.

అతడామెవైపు నవ్వుతూ చూశాడు.

"మీతో యెక్కడున్నా బాగానే వుంటుంది!"

ఆమె అతడివైపు అదోలా చూసింది.

"అయితే యిక్కడే వుండండి" అందామె.

"మీరు చెప్పినట్లే వుంటాను" అన్నాడతను.

మంచంమీద అతడు పడుకున్నాడు. కొంచెం దూరంలో నేలమీద మరో పరుపు వేసుకుని ఆమె పడుకుంది. గదిలో జీరోవాట్ బల్బు వెలుగుతోంది.

కాస్సేపట్లో ఆమెకు నిద్ర పట్టేసింది. అతడు సిగరెట్ పీలుస్తూ వెల్లకిలా పడుకుని పైకి చూస్తున్నాడు.

అమాంతంగా మూలుగుతూ ఆమె లేచింది. అతడామె పక్కకు వెళ్ళి పరుపుమీద కూర్చున్నాడు.

"లిమా, ఏమైంది?" అడిగాడతను.

అతడిని చూసి ఆమె ధైర్యం తెచ్చుకుంది.

"పీడకలొచ్చింది" అందామె,

"కలలో ఏం జరిగింది?"

"వాళ్ళు నన్ను ఎత్తుకుపోతున్నారు. నన్ను కాపాడ్డానికి మీరు వచ్చారు. మిమ్మల్ని వాళ్ళు కత్తితో పొడిచేశారు. రక్తం చూసి మేలుకొన్నాను" అందామె.

ఆనంద్ ఆమె వీపుమీద చెయ్యివేశాడు.

"వాళ్ళను గురించి నువ్వు భయపడుతున్నావు. నీకు ఏ భయమూ లేదు. నేను ఆ కారు నంబరు చెప్పి పోలీసు రిపోర్టు యిస్తాను. నీకు ఏ ప్రమాదమూ రాకుండా నేను చూస్తాను" అన్నాడతను.

అతడిచేయి కిందకు జారింది. ఆమె నడుమును చుట్టేసింది. ఆమె అతడి వంక విచిత్రంగా చూసింది.

"లిమా, విధి విచిత్రంగా మన్ని కలిపింది. నిన్ను యిక్కడ ఒంటరిగా వదిలి నేను మద్రాసు వెళ్ళను" అన్నాడతను.

పరుపుమీద ఆమె వెల్లకిలా పడుకుంది. అతడు లేవలేదు. ఆమెవైపే చూస్తున్నాడు. "లిమా, ఐ లవ్ యూ! నాకు పెళ్ళయిందని నీకు మొదట్లోనే చెప్పాను. అది పెద్దలుచేసిన పెళ్ళి. నేను కోరుకున్నది కాదు. నిన్ను ప్రేమించే నాకు నీ హృదయంలో స్థానం లభిస్తుందని ఆశిస్తున్నాను" అన్నాడతను వుద్రేకంతో.

"మీరు మద్రాసు వెళ్ళరా? ఇక్కడే వుండిపోతారా?" ప్రశ్నించిందామె.

"మద్రాసు వెళ్ళినా యిక్కడ కొంతకాలం నీతో వుంటూ వుంటాను. నీకోసం యింకో ఫ్లాట్ నేను అద్దెకు తీసుకుంటాను. అందులోకి నువ్వు మారొచ్చు. ఇటువైన ఉద్యోగం నువ్వు చేయొద్దు! నీకు ప్రతి నెలా నేను అయిదువేలు పంపుతాను."

ఆమె కళ్ళమ్మట నీళ్ళు కారాయి. ఆమె అతడి చెయ్యి పట్టుకుంది.

"లిమా, ఏడుస్తున్నావా?"

"మనం కలుసుకుని మూడుగంటలింకా కాలేదు. కాని మీ మాటలు వింటూంటే మన అనుబంధం ఎన్ని జన్మలదో అనిపిస్తోంది!" అందామె.

అతడు ఆమెమీదకు వాలిపోయాడు. ఎర్రటి ఆమె పెదిమెలను బలంగా ముద్దెటుకున్నాడు. ఆమె చేతులు ఆవేశంతో అతడిని చుట్టేశాయి.

ఆ రాత్రంతా వాళ్ళు నిద్రపోలేదు. కిటికీలోంచి లోపలకు వెలుతురు ప్రసరించింది. అతడు టైము చూశాడు. ఏడు కావొస్తోంది.

అతడామెవంక నవ్వుతూ చూశాడు.

"మంచి ఫ్లాట్ కోసం యివాళ చూద్దాం. నువ్వు ఆఫీసుకు వెళ్ళొద్దు!" అన్నాడతడు.

"వెళ్తే అక్కడ నిద్రపోతానేమో!" అందామె.

"లిమా, లే! పళ్ళుతోముకుని నా హోటల్ గదికి పోదాం. అక్కడ స్నానంచేసి బ్రేక్‌ఫాస్టు సేవించి తర్వాత ఫ్లాట్ కోసం వెతుకుదాం!" అన్నాడతను.

## 2

పటేల్ స్ట్రీట్‌లో వున్న పెద్ద భవనంలో ఒక ఫ్లాట్‌ను ఆనంద్ అద్దెకు తీసుకున్నాడు. నెలకు వెయ్యి రూపాయిలు అద్దె. ఆరు నెలల అద్దె అతను డిపాజిట్టుగా చెల్లించాడు.

ఫ్లాట్ చాలా బాగుంది. రెండు పడకగదులు, హాలు, వంటిల్లు, బాత్‌రూం వగైరా వున్నాయి. మర్నాడే ఆమె కొత్త ఫ్లాట్‌లోకి మారిపోయింది. కంపెనీ ఉద్యోగం మానేసింది.

హోటల్ గది ఖాళీచేసి ఆనంద్ ఆమె ఫ్లాటుకు తన సామానుతో చేరుకున్నాడు.

వారం రోజులపాటు ఆనంద్ ఢిల్లీలోనే వుండి పోయాడు. వాళ్ళ జీవితాలు సుఖంగా, ఆనందంగా సాగి పోయాయి.

మద్రాసునుంచి టెలిగ్రామ్ వచ్చింది. ఆనంద్ అర్జంటుగా మద్రాస్ వెళ్ళాలి. అతడు ఆమెకు ధైర్యం చెప్పి, నెల లోపల తిరిగి వస్తానని హామీ యిచ్చి,

మద్రాస్‌కు బయల్దేరాడు.

ఏరోడ్రోమ్‌కు వెళ్ళి ఆమె అతడికి వీడ్కోలు చెప్పింది.

ఆనంద్ మద్రాస్ చేరుకున్నాడు. మద్రాస్ రాగానే ఆమెకు పెద్ద ఉత్తరం రాశాడు. తన కంపెనీ అడ్రెసు యిచ్చి ఆ అడ్రెసుకు జవాబు రాయమన్నాడు.

ఢిల్లీ వదిలేముందు ఆమెచేత పంజాబ్ నేషనల్ బాంకిలో అకౌంట్ ఓపెన్ చేయించాడు. ఆమె అకౌంటులో అతడు పదివేలు జమకట్టాడు.

వారం రోజుల్లో ఆమె ఉత్తరం వచ్చింది. "మీరాక కోసం ఎదురుచూస్తున్నాను" అందామె, ఎంతో రాస్తూ.

రోజులు గడిచిపోతున్నాయి. ఆమె ఉత్తరాలు రాస్తోంది. అతడు జవాబులిస్తున్నాడు. నెలతిరిగేలోగా అతడు ఢిల్లీ చేరుకున్నాడు. వారం రోజులు లిమాతో వుండి అతడు మద్రాస్‌కు తిరిగివచ్చాడు.

సంవత్సరం గడిచిపోయింది. లిమా గర్భవతి అయింది. రెండు నెలలపాటు ఆనంద్ ఢిల్లీలోనే వుండిపోయాడు. ఆమె కన్నబిడ్డను చూసి మురిసిపోయాడు. అచ్చంగా తన పోలికే!

ఆనంద్ మద్రాస్ వచ్చాడు. అతడి మనసు వాళ్ళ మీదే వుంది. వారం గడిచేలోపల అతడు తమిళనాడు ఎక్స్‌ప్రెస్‌లో ఢిల్లీకి బయల్దేరాడు. కాని ఖాజీపేట దాటాక రైలుకి యాక్సిడెంట్ సంభవించింది. ఒంటి నిండా గాయాలో ఆనంద్‌ని మరికొందరితో సహా మద్రాసుకు రైల్లో తీసుకు వచ్చారు.

కంపెనీలకు మేనేజరైన నాగరాజు సెంట్రల్ స్టేషన్‌కు వెళ్ళి ఆనంద్‌ని చూసి విచారంతో కృంగిపోయాడు.

మూడు నెలలపాటు ఆనంద్ హాస్పిటల్లో వున్నాడు.

తర్వాత యింటికి చేరుకున్నాడు. అతడు యిప్పుడు మునపటి ఆనంద్ కాదు!

రెండు కాళ్ళూ తీసివేయబడ్డాయి. ఎడం చెయ్యి పోయింది. ఒక కన్ను శాశ్వతంగా గుడ్డిదైంది. పరుపు మీద పడుకుని వున్న ఆనంద్‌ను చూసి అతడి భార్య పద్మ వెక్కి వెక్కి ఏడ్చింది. కాని తను ఏం చేయగలదు?

ఆనంద్ మంచంమీదనుంచి కదలలేడు. ఈ పరిస్థితుల్లో కంపెనీలను అతడి భార్య అన్న నాగరాజు చూస్తున్నాడు.

పరుపుమీద పడున్న ఆనంద్ మెదడులో లిమా రూపం మెదిలింది. యెవ్వరూ లేని సమయంలో అతడామెకు ఉత్తరం రాశాడు. కవర్ని అంటించాడు. ఆ కవర్ని నాగరాజుకిచ్చి పోస్టు చేయించమన్నాడు. మూడు నెలలనుంచి ఆమెకు డబ్బు పంపలేదు. ఆమె పేర పంజాబ్ నేషనల్ బాంకికి యిరవై వేలు మెయిల్ ట్రాన్స్‌ఫర్ చేయమన్నాడు. నాగరాజు అలాగే చేయిస్తానన్నాడు. ఆనంద్ సంతోషించాడు తనిప్పుడు యితర్ల మీద ఆధారపడక తప్పదు!

నాగరాజు రహస్యంగా ఆనంద్ యిచ్చిన ఉత్తరం చదివాడు. అంతా అతడికి అర్థమైంది. నాగరాజు ఉత్తరాన్ని చింపి పారేశాడు. ఢిల్లీ బాంకికి డబ్బు పంపలేదు.

"నాకు పెర్సనల్‌గా ఆఫీసుకు ఉత్తరాలు వస్తే యిక్కడకు తెచ్చి నాకివ్వండి. మీరు తెరవొద్దు" అన్నాడు ఆనంద్.

"అలాగే యిస్తానండి" అన్నాడు నాగరాజు.

నెలలు గడిచిపోతున్నాయి. ఢిల్లీనుంచి వుత్తరంలేదు.

శిమా ఏమైంది? ఒక రోజు రాత్రి నిస్సహాయంగా ఆనంద్ నాగరాజు చెయ్యిపట్టుకున్నాడు.

"నాగరాజుగారూ, నేను కదిలే స్థితిలో లేను. మీరు నాకో చిన్న సహాయం చెయ్యాలి. ఈ విషయం మీ చెల్లెలుకి చెప్పొద్దు. ఆమెకు నేనే తర్వాత చెప్తాను" అని జరిగినదంతా చెప్పేశాడు.

"మీరు ఢిల్లీ వెళ్ళి ఆమె ఎలా వుందో చూసి రండి. మీతో 25 వేలు పట్టుకెళ్ళండి. నాకు జరిగిన ప్రమాదం గురించి చెప్పి ఆమెను యిక్కడకు రమ్మనండి."

"తప్పక ఆమెను తీసుకొస్తాను" అని నాగరాజు ఢిల్లీ వెళ్ళాడు.

ముందు హాల్లో శిమాను కల్సుకున్నాడు. చాలా అందమైన యువతి. ఏ మొగాడైనా ఆమెకు క్షణంలో దాసుడై పోతాడు!

"ఎవరు మీరు?" అందామె.

అతడు కంపెనీల పేర్లు చెప్పాడు.

"నేను ఆ కంపెనీల అధిపతిని. పేరు నాగరాజు. మీరు ఆనంద్ పేర మా కంపెనీ అడ్రెసుకు ఎన్నో ఉత్తరాలు రాశారు. మా కంపెనీలో ఆనంద్ అనేవాడు లేడు. కొన్ని ఉత్తరాలు చింపేశాను. మరికొన్ని మీరు రాసినవి నా జేబులో వున్నాయి" అని రెండు ఉత్తరాలను ఆమె ముందు పడేశాడు.

ఆమె ఆశ్చర్యంతో అతడివైపు చూసింది.

"ఆయన ఎన్నిసార్లో యిక్కడకు వచ్చారు. ఆ అడ్రెసుకు రాస్తే ఆయన జవాబులు కూడా యిచ్చారు" అందామె.

"అతడు ఎక్కడనుంచో మీకు జవాబులు రాసి

వుండాలి! ఇదంతా చూస్తే అతడు మోసగాడై వుండా లనిపిస్తోంది” అన్నాడతను.

“గుడ్ గాడ్, ఆనంద్ యింతగా నన్ను మోసం చేస్తాడని నేననుకోలేదు” అందామె.

“ఢిల్లీలో పనుండి వచ్చాను. ఈ విషయం మీతో చెప్పడం మంచిదని ఇలా వచ్చాను. జరిగిందేదో జరిగింది. ఆ మోసగాడిని మర్చిపొండి” అని అతడు బయటకు వెళ్ళి పోయాడు.

పెద్దమనిషిలా అగుపించే నాగరాజు మాటలు వినడంతోటే తన్ని మోసగించిన ఆనంద్ మీద ఆమెలో ద్వేషం రగులుకుంది.

ఆమె ఖరీదైన ఫ్లాట్‌ను ఖాళీచేసేసింది. చిన్న గది తీసుకుని అందులోకి మారింది. ఆమె హృదయంలో ఆనంద్ మీద కసి పెరుగుతోంది!

# 3

నాగరాజు తిరిగి వచ్చాడు. అతడు ఏం వార్త తెచ్చాడో? ఆనంద్ ఆత్రంగా అతడివైపు చూశాడు.

“ఆనంద్ గారూ, నేను చాలా విచారిస్తున్నాను. ఆమె ఆ ఫ్లాట్‌లో లేదు. ఖాళీచేసి యెక్కడికో పోయింది. పంజాబు నేషనల్ బాంకికి వెళ్ళి ఆమె గురించి అడిగాను. అక్కడి అకౌంట్ ఆమె మూసేసిందని వాళ్ళు చెప్పారు. ఆమె కోసం అనేకచోట్ల దర్యాప్తు చేశాను. కాని లభించలేదు!” అన్నాడు నాగరాజు.

ఆనంద్ మాట్లాడలేదు. పరుపుమీద పక్కకు తిరిగాడు. ఏడ్వసాగాడు.

“మీ వేదన నాకు తెలుసు. అందుకే యెంతో తాపత్రయపడ్డాను. చూద్దాం. ఆమెనుంచి ఉత్తరం

వస్తుందేమో!" అని నాగరాజు సెలవు తీసుకుని వెళ్ళి పోయాడు.

పసిపాపలా ఆనంద్ పరుపుమీద అటూ యిటూ దొర్లాడు. వారం తిరిగేలోపల ఆనంద్ ప్రమాదస్థితిలోకి జారిపోయాడు.

పెద్ద డాక్టర్ వచ్చి చూస్తున్నాడు, వెళ్తున్నాడు. ఆ రోజు రాత్రి ఆనంద్ చావు బ్రతుకులమధ్య అల్లల్లాడుతున్నాడు.

పక్కన కూర్చున్న భార్య వైపు అతడు దీనంగా చూశాడు. ఆమె చేయి పట్టుకున్నాడు.

బరువుగా వూపిరి పీలుస్తూ లిమా గురించి ఆమెకంతా చెప్పాడు.

"పద్మా, నేను నిన్ను ప్రేమతో చూశాను. లిమాను ఎంతో ప్రేమతో నా చేతుల్లోకి తీసుకున్నాను. ఆమె యెక్కడుందో కనుక్కొని ఆమెకు నా ఆస్తిలో సగం వాటా యిచ్చేయి. నా మనసుకు శాంతి లభిస్తుంది" అన్నాడతను.

"తప్పక యిస్తాను" అందామె.

అతడి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఆనాటి రాత్రి నిద్రలో ఆనంద్ శాశ్వతంగా కన్ను మూశాడు.

వెక్కి వెక్కి ఏడుస్తూన్న చెల్లెల్ని ఓదారుస్తూ నాగరాజు ఆమె పక్కనే కూర్చున్నాడు.

"కాళ్ళూ చెయ్యీ పోయినా ఆయన బ్రతికి ఇంట్లో వున్నారని నేను ఆనందించేదాన్ని. ఇప్పుడు ఆ ఆనందమూ నాకు లేకుండాపోయింది" అని ఏడ్చిందామె.

"విధి అలా వుంటే మనం ఏం చెయ్యగలం?" అన్నాడు నాగరాజు.

"ఇప్పుడు నాకు దిక్కెవరు?" అర్చిందామె.

"చెల్లమ్మా, భయపడకు! నా మేనల్లుడు పెద్దవాడయ్యేదాకా కంపెనీలను నేను చూస్తూ వుంటాను, యిప్పటిలాగే. తర్వాత వాడికి అందజేస్తాను" అన్నాడతను.

"అన్నయ్యా, నువ్వులేకపోతే నా గతి ఏమయ్యేదో" అందామె విచారంతో.

## 4

ఇరవై ఏళ్ళు గడిచిపోయాయి.

హాల్లో వున్న భర్త ఫోటోకు దండవేసి, నమస్కరించి ఆమె వెనక్కు తిరిగింది.

వెనకనే నిలబడి వున్నాడు సత్యమూర్తి. తన ఇరవై మూడేళ్ళ కొడుకువైపు ఆమె దీనంగా చూసింది.

"ఆయన ఆఖరి కోర్కె తీర్చలేకపోయానురా" అందామె.

"అన్ని ప్రయత్నాలు• చేశాం. మామయ్య ఎంతో ప్రయత్నించాడు. నేను కూడా ఢిల్లీ వెళ్ళి ఆమెకోసం వెతికాను. ఎక్కడా కనపడలేదుగా!" అన్నాడు సత్యమూర్తి.

"ఇన్నేళ్ళు అయ్యాక యింకా యెక్కడ కనిపిస్తుందామె! చెల్లీ, ఆమెను గురించి మర్చిపో!" అన్నాడు నాగరాజు.

అదే సమయంలో విశాలమైన హాల్లో టేబుల్ మీదున్న ఆనంద్ ఫోటోవైపు వాళ్ళిద్దరూ చూస్తున్నారు.

"ఆ మొహం చూడు! ఆ కళ్ళలో అంత మోసం వుంటుందని నేను వూహించలేదు" అంది లీమా.

తులసీరామ్ తల్లివైపు చూశాడు.

"అమ్మా, నేను మద్రాస్ వెళ్ళి అతడికోసం వెతుకుతాను. అతడిని లాక్కొచ్చి నీ కాళ్ళముందు పడేస్తాను" అన్నాడతను.

"అప్పుడు నేను ఏం చేస్తానో తెలుసా? అతడిని చిత్రవధ చేస్తాను!" అందామె.

అతడు విచిత్రంగా నవ్వాడు.

"అమ్మా, అంటావుకాని నా అంత కఠినంగా నువ్వు వుండలేవు!" అన్నాడతను.

లిమా ఉద్యోగం చేస్తూ కొడుకును పెంచింది. తన కొడుకు కోసం, అతడి అభివృద్ధికోసం మరో మొగాడి వైపు ఆమె చూడలేదు.

ఏళ్ళు గడిచినకొద్దీ ఆమె ఆదాయం పెరిగింది. ఎంతో ప్రేమతో తులసీరామ్‌ను పెంచింది. ఆఫీసు పనిగా నే కొడుకుతోనే కాలం గడిపేది.

లిమా, కొడుకు సోఫాలో కూర్చున్నారు. అతడి వయస్సు యిరవై వుంటుంది. అతడు చదువులోనేగాక అనేక విద్యల్లో నైపుణ్యం సంపాదించాడు. కరాటే నేర్చుకున్నాడు. కత్తి యుద్ధం, పిస్టల్ షూటింగ్ బాగా నేర్చుకున్నాడు.

"నాన్న ఏడంటే అతడికోసం నేనే వెతకాలని నువ్వు అనేదానవు, గుర్తుందా? టికెట్ కొన్నాను. మద్రాస్ వెళ్తాను" అన్నాడు తులసీరామ్.

"వెళ్ళిరా! ఆ మోసగాడు ఎక్కడో నీకు దొరుకుతాడు" అందామె.

గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో అతడు బయల్దేరాడు. జేబులో ఆనంద్ ఫోటో వుంది. అతడి కంపెనీల అడ్రెసు వుంది! మరో కోటుజేబులో పిస్టల్ వుంది. ఢిల్లీలో

దొంగల భయం ఎక్కువవడంవలన అతడు లైసెన్స్ సంపాదించి పిస్టల్ కొన్నాడు.

ట్రెయిన్ వేగంగాపోతోంది. తులసీరామ్ మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి.

అర్ధరాత్రి. ఎక్స్‌ప్రెస్ ట్రెయిన్‌లో కింద బెర్త్ మీద సత్యమూర్తి గాఢ నిద్రలో వున్నాడు. అతడి తలకింద పెట్టెవుంది. ఎవరో దాన్ని లాగడం మూలంగా అతడు లేచి కూర్చున్నాడు. పెట్టె పట్టుకుని ఒకతను పారిపోబోయాడు. సత్యమూర్తి అతడి చొక్కా పట్టుకుని ఆపాడు. తటాలున కత్తి పైకి లేచింది.

కత్తికొన సత్యమూర్తివైపు తిరిగింది.

"నన్ను వదిలి దూరంగా వెళ్ళు! అరిస్తే చస్తావు" అరిచాడు దొంగ.

సత్యమూర్తి పట్టు వదిలేశాడు. అటువైపు వస్తూన్న ఒక యువకుడు అదంతా చూసి తటాలున దొంగను కాలో తన్నాడు. కత్తి కిందపడింది. దొంగ సీటుపక్క పడ్డాడు.

అతడి చేతిలోని పెట్టెను ఆ యువకుడు సత్యమూర్తికి అందించాడు. కిందపడిన దొంగను రైల్వే పోలీసులకు అప్పగించాడు.

సత్యమూర్తి ఆ యువకుడితో కరచాలనం చేశాడు.

"మైడియర్ ఫ్రెండ్, చాలా థాంక్స్. ఆ పెట్టెలో చాలా డబ్బుంది. దాన్ని కాపాడావు. నన్ను రక్షించావు. నీ ఋణం తీర్చుకోలేను" అన్నాడు సత్యమూర్తి.

"దానికేముంది? కష్టంలో వున్న వాడికి సహాయపడకుండా ఎవరుండగలరు?" అన్నాడా యువకుడు.

"ప్లీజ్, కూర్చో!" అన్నాడు సత్యమూర్తి.

ఆ యువకుడు నవ్వుతూ కూర్చున్నాడు.

"నా పేరు సత్యమూర్తి?" అన్నాడతను.

"నా పేరు తులసీరామ్" అన్నాడా యువకుడు.

"ఎక్కడికి వెళుతున్నావు?"

"ఉద్యోగం కోసం వెతుకుతున్నాను. మద్రాస్ వెళుతున్నాను."

"అక్కడ ఉద్యోగం దొరకొచ్చు. నాకు చాలామంది తెలుసు. నేను నీకు ఉద్యోగ విషయంలో సహాయ పడతాను" అన్నాడు సత్యమూర్తి.

"చాలా థాంక్స్. దురదృష్టవంతుడైన ఆ దొంగ నాకు అదృష్టాన్నే చేకూర్చాడు" అని తులసీరామ్ నవ్వాడు.

సత్యమూర్తి సిగరెట్ కేసు తెరిచాడు. ఇద్దరూ సిగరెట్లు వెలిగించారు. పొగ వదులూ తులసీరామ్ బయటకు చూశాడు. చుట్టూ చీకటి. చీకట్లో ఎక్స్‌ప్రెస్ శరవేగంగా పోతోంది.

తులసీరామ్ నవ్వుతూ సత్యమూర్తివైపు చూశాడు.

"మద్రాసులో మోసగాళ్ళు వుంటారు అని అంటారు. అది నిజమేనా?" అడిగాడతను.

"మనుషుల్లో మోసగాళ్ళు వుంటారు, మంచివాళ్ళూ వుంటారు. ఈ ట్రెయిన్‌లో మనం ప్రయాణం చేస్తున్నాం—ఒక దొంగ నా పెట్టె లాక్కున్నాడు. ఓ పెద్ద మనిషి ఆ పెట్టెను తెచ్చి నాకిచ్చాడు. ఈ ప్రపంచ మంతటా అంతే!" అన్నాడు సత్యమూర్తి నవ్వుతూ.

"నిజం చెప్పావు" అన్నాడు తులసీరామ్.

## 5

స్టేషన్ కి కారు వచ్చింది. సత్యమూర్తి తలుపు తెర్చి అతడిని కార్లో ఎక్కమన్నాడు.

వెనుక సీటుమీద ఇద్దరూ పక్కపక్కనే కూర్చున్నారు. డ్రయివర్ కారును పోనిచ్చాడు.

పదినిమిషాల్లో కారు ఒక కాంపౌండులో ప్రవేశించి పోర్టికో కింద ఆగింది.

"వెల్ కమ్ టు మై హోమ్!" అన్నాడు సత్యమూర్తి తలుపు తెరిచి.

ఇద్దరూ కిందకు దిగి హాల్లోకి వెళ్ళారు. తల్లి పద్మ వాళ్ళకు హాల్లో ఎదురైంది.

"అమ్మా, ఇతను తులసీరామ్. ట్రెయిన్ లో ఒక దొంగ నా పెట్టె పట్టుకుని పారిపోబోయాడు. నన్ను కత్తితో భయపెట్టాడు. ఆ క్షణంలో యితను దేవుడిలా వచ్చి నన్ను కాపాడి, నా పెట్టె నాకిచ్చాడు" పరిచయం చేశాడు సత్యమూర్తి.

పద్మ నవ్వుతూ అతడివైపు చూసింది. ఆమె చూపు కొడుకువైపు తిరిగింది.

"ఇద్దరూ రామలక్ష్మణుల్లా వున్నారు!" అందామె.

సామానులను పట్టుకొని నౌఖరు హాల్లోకి వచ్చాడు.

"ఆ సీర్ బాగ్ గెస్టురూమ్‌లో పెట్టు" అన్నాడు సత్యమూర్తి.

సత్యమూర్తితో తులసీరామ్ గెస్టురూమ్‌వైపు వెళ్ళిపోయాడు.

గెస్టురూమ్ శుభ్రంగా, విశాలంగా వుంది. మొజాయిక్ ఫ్లోరింగ్ ఎటాచ్‌డ్ బాత్‌రూమ్.

"మైడియర్ ఫ్రెండ్, స్నానంచేసి రెడీగా వుండు.

8-30కి బ్రేక్‌ఫాస్టు సేవించి మనం ఆఫీసుకు వెళ్దాం" అన్నాడు సత్యమూర్తి.

ఎనిమిదింటికే తులసీరామ్ సిద్ధంగా వున్నాడు. ఆలోచిస్తూ అతడు సిగరెట్ వెలిగించాడు. పొగ వదుల్తూ ఆలోచించసాగాడు.

అనుకోకుండా ఒక మిత్రుడు దొరికాడు. ఉండడానికి ఒక గెస్టు రూమ్ దొరికింది. సత్యమూర్తి సహాయంతో ఆనంద్ గురించి దార్యాప్తు చేసి తను కనుక్కోవచ్చు!

సత్యమూర్తి గదిలోకొచ్చాడు.

"కమాన్ రామ్!" అన్నాడు.

"రెడీ, సత్యా!" అన్నాడు తులసీరామ్.

ఇద్దరూ హాల్లోకి వెళ్ళారు. తల్లి పద్మ భర్త ఫోటోకు దండ వేస్తోంది.

గోడమీదున్న ఫోటోవైపు తులసీరామ్ చూశాడు. దానివైపు తీక్షణంగా చూస్తూ వుండిపోయాడు. అతడి గుండె దడదడలాడింది. అతడికి ఢిల్లీలో వున్న తల్లి యిచ్చిన ఫోటో జ్ఞప్తికొచ్చింది.

"ఆ ఫోటో నాన్నగారిది. ఆయన పోయారు!" అన్నాడు సత్యమూర్తి.

సత్యమూర్తితో తులసీరామ్ కూడా గోడమీది ఫోటోకు నమస్కరించాడు. లోలోపల అనుకున్నాడు ద్వేషంతో: "దుర్మార్గుడా, నా తల్లిని మోసం చేసి యీ గోడమీద ఫోటో అయి పడున్నావా!"

ఇద్దరూ డైనింగ్ గదిలోకి వెళ్ళారు. తులసీరామ్ మెదడులో ఆలోచనలు పరుగెడుతున్నాయి. ఇది ఆనంద్ ఇల్లు! వెతుకుతున్న తీగ కాలికి తగిలినట్లు తను ఆనంద్ యింటికే వచ్చాడు. ఈ వార్త విని తన తల్లి చాలా

ఆనందిస్తుంది!

ఇద్దరూ టిఫిన్ తిని కాఫీ తాగారు. బయటకు వెళ్ళి కారు ఎక్కారు. కారు కదిలింది.

ఆఫీసుకు వెళ్తూ అక్కడున్న నేమ్ బోర్డులవైపు చూశాడు తులసీరామ్. షుగర్ మిల్స్, సిమెంట్ ఫ్యాక్టరీలు! అవే పేర్లు, తన తల్లి చెప్పిన పేర్లే!

అందమైన ఆఫీసు గదిలోకి వెళ్ళారు యిద్దరూ. సత్యమూర్తి అతడిని కూర్చోమన్నాడు.

"ఇది మా కంపెనీల రిజిష్టర్డ్ ఆఫీసు. మా ఫాక్టరీలు ఆంధ్రాలో, తమిళనాడులో వున్నాయి" అన్నాడతను.

తులసీరామ్ నవ్వాడు.

"రామ్, నువ్వు మా కంపెనీల్లోనే పని చేయొచ్చు!" అన్నాడు సత్యమూర్తి.

"అలాగే సత్యా, చాలా థాంక్స్."

"కొంత కాలంపాటు పనిచేస్తే నీకు అనుభవం వస్తుంది. అసిస్టెంట్ మేనేజర్‌గా నీకు ఉద్యోగం యిస్తున్నాను. నెలకు వెయ్యి రూపాయిలు జీతం!" అన్నాడు సత్యమూర్తి.

"నేను చేసిన చిన్న సేవకు ఇంత పెద్ద బహుమతా?" అన్నాడు తులసీరామ్.

"మైడియర్ రామ్, తర్వాత నువ్వు యీ కంపెనీలకు ఎంతో ఉపయోగపడ్తావు" అన్నాడు సత్యమూర్తి.

"నాలో నీకు బాగా నమ్మకముంది సత్యా! థాంక్స్" అన్నాడు తులసీరామ్.

ఆనాటి రాత్రి సత్యమూర్తి, తులసీరామ్, తల్లి పద్మ భోజనాలు చేస్తున్నారు. వంటామె వడ్డిస్తోంది.

అమాంతంగా బాంబు పేలినట్లు హాల్లోనుంచి చప్పుడు

వెలువడింది. అందరూ ఉలిక్కిపడ్డారు. పద్మ చెవులు మూసుకుంది. అందరూ హాల్లోకి పరుగెత్తారు.

గోడమీద మేకు బోడిగా వుంది. దానికి వేళ్ళాడే ఆనంద్ ఫోటో మొజాయిక్ ఫ్లోర్ మీద పడి గ్లాసు ముక్కలైంది. పూలదండ పక్కనే పడుంది.

సత్యమూర్తి ఫోటోను పరీక్షగా చూశాడు.

"తాడు తెగిందమ్మా!" అన్నాడు.

"వారానికొకసారి సుబ్బయ్య చూస్తూ వుంటాడు. ఎలా తెగుతుంది?" అంది పద్మ.

"నాలుగు రోజులైందమ్మా నేను చూసి. తాడు గట్టిగానే వుందమ్మా" అన్నాడు సుబ్బయ్య.

"రాబోయే తుఫానుకు యిది నాంది!" అనుకున్నాడు తులసీరామ్ లోలోపల.

"బెంగపడకమ్మా! ఇవాళే కొత్త ఫ్రేమ్ వేయిస్తాను" అన్నాడు సత్యమూర్తి.

# 6

అదే కాంపౌండులో నాగరాజు యిల్లు వేరుగావుంది. సత్యమూర్తి నాగరాజు యింటికి వెళ్ళాడు.

"బావా!" అంది సుజాత.

నవ్వుతూ అతను నాగరాజు గదిలోకి వెళ్ళాడు. నాగరాజు ఏదో ఫైలు చూస్తున్నాడు.

"రా, బాబూ, కూర్చో!" అన్నాడు నాగరాజు.

సత్యమూర్తి కూర్చున్నాడు.

"సత్యా, ఎంత కాలంనుంచో నేను అనుకుంటున్నాను. సుజాతను నువ్వు పెళ్ళాడాలని. ఈ సంవత్సరం మీ పెళ్ళి జరగాలని నా ఆశ!"

"మామయ్యా, మీరు పెద్దలు. నన్ను వృద్ధిలోకి తీసుకొచ్చారు. సుజాతను పెళ్ళాడాలనే ఉద్దేశం నాకు లేదు. మేమిద్దరం చాలా దగ్గరగా పెరిగాం! ఆమెకోసం మరెవరినేనా చూడండి!" అన్నాడు సత్యమూర్తి.

"అంతేనంటావా?"

"అంతే, మామయ్యా. మీరు కోరినది జరగలేదని బాధపడకండి. సుజాతకు మంచి భర్త వస్తాడు."

మామయ్య గదిలోంచి సత్యమూర్తి వెళ్ళిపోయాడు.

టైమ్ రెండయింది. ఆఫీసులో సత్యమూర్తికి ఎదురుగా కూర్చున్నాడు తులసీరామ్.

"2-30కి నేను బయటకు వెళ్ళి అలా యింటికి పోతాను. నీకిచ్చిన పని పూర్తిచేయి ఇవాళే" అన్నాడు సత్యమూర్తి.

"అలాగే, సత్యా" అని తులసీరామ్ వెళ్ళిపోయాడు.

తులసీరామ్ మెల్లగా టాయిలెట్ గదిలోకి వెళ్ళి కాస్సేపట్లో బయటకొచ్చి మెట్లవైపు నడిచాడు. టైము చూశాడు. 2-25 దాటింది. జేబులోంచి బాటిల్ తీసి అందులో వున్న సోప్ ద్రవాన్ని మెట్లకు కప్పిన లినాసీ పైన పోశాడు.

వేగంగా పైకి వెళ్ళిపోయాడు.

సత్యమూర్తి హుషారుగా మెట్లు దిగుతున్నాడు. హఠాత్తుగా కాలుజారి పడి, జారుతూ కొంతదూరం వెళ్ళి అతడు ఆపుకోగల్గాడు.

ఆఫీసులోనుంచి ఆ నేకమంది అతడివైపు పరుగెత్తారు.

"జాగ్రత్త, జారుతుంది!" అర్చాడు సత్యమూర్తి.

తులసీరామ్, మరో యిద్దరు జాగ్రత్తగా దిగి అతడిని లేవదీశారు. సత్యమూర్తి ధరించిన సూటు ఒకచోట

చిరిగింది. చెయ్యిమీద గాట్లుపడ్డాయి.

"లక్కీ, యూ ఆర్ ఆల్ రైట్ సత్యా!" అన్నాడు తులసీరామ్.

"అక్కడ ఎలా జారింది?" అన్నాడు సత్యమూర్తి.

ఎవ్వరూ జవాబివ్వలేదు.

"అదంతా క్లీన్ చేయించు" అన్నాడు సత్యమూర్తి తులసీరామ్‌తో.

"వెంటనే చేయిస్తాను" అన్నాడు తులసీరామ్.

ఉద్యోగంలో చేరాక తులసీరామ్ ఒక ఫ్లాట్ అద్దెకు తీసుకుని అక్కడకు మారాడు. అతడు తల్లికి మూడు ఉత్తరాలు రాశాడు.

"అమ్మా, ఆనంద్‌ని లాక్కొచ్చి నీ కాళ్ళముందు పడేస్తానన్నాను. కాని అది సాధ్యంకాదు. ఆనంద్ యీ లోకంలో లేడు. గోడమీద ఫోటోఅయి కూర్చున్నాడు. మొన్న ఆ ఫోటోను తునాతునకలు చేశాను. అద్దం పగిలింది. మళ్ళీ ఫ్రేము కట్టించారు. తల్లి పద్మ, కొడుకు సత్యమూర్తి ఆనంద్ చేసిన మోసానికి శిక్ష అనుభవిస్తున్నారు!" అన్నాడతను ఒక ఉత్తరంలో.

ఇంకా ఆఫీసుకు టైమ్ కాలేదు. తులసీరామ్ ఉత్తరం తీసుకుని పోస్టు చేయడానికి బయటకు వెళ్ళాడు. రోడ్డమ్మట నడుస్తున్నాడు. వెనకనుంచి సైకిల్ చక్రం అతడికి తగిలింది. వెనుదిరిగి అతను హేండిల్ బార్ పట్టుకున్నాడు.

"మిస్టర్ వదులు!" అరిచిందామె.

"మనుషులమీదకు సైకిల్ నడుపుతున్నావు!"

"నువ్వు కళ్ళు మూసుకుని నడుస్తున్నావు!" అందామె.

ఆమె కోపంగా కిందకు దిగింది. అతడింకా హేండిల్ బారును వదలలేదు.

"పోస్టు బాక్సుదాకా నాకు నువ్వు తోడు దొరికి నందుకు సంతోషిస్తున్నాను" అన్నాడతను.

"నిన్ను యెక్కడో చూశాను" అందామె.

"కల్లో చూసుంటావు!"

"నీలాంటి రౌడీలు నాకు కలల్లో కనిపించరు!"

మరికొంత దూరం నడిచాక యిద్దరు స్నేహితులు అయ్యారు.

"నా పేరు సుజాత" అందామె.

"నా పేరు తులసీరామ్" అన్నాడతను.

అలా ప్రారంభమైన వాళ్ళ స్నేహం ప్రణయంగా మారింది.

## 7

ఆఫీసుకు కారు పోతోంది. మౌంటు రోడ్డుమీద ఒక చోట కారును ఆపమని సత్యమూర్తి సౌజ్ఞ చేశాడు. యెప్పుడూ అక్కడ ఆపడం పరిపాటి అయింది.

సత్యమూర్తి దిగి సమీపంలో వున్న జైహింద్ క్లాత్ షాపువైపు వెళ్ళాడు. షాపు అందంగా వుంది. ఇద్దరు యువతులు కష్టమర్సుకు కావలసినవి చూపించి అమ్ముతున్నారు.

సత్యమూర్తిని చూడగానే ఒక యువతి ముందు కొచ్చింది.

"ఏం కావాలి సార్?" అందామె.

"టీ షర్టు" అన్నాడతను.

ఆమె అనేక రకాల టీ షర్టులను అతడిముందు కౌంటరుమీద పడేసింది. అన్నీ చూసి అతడు ఒకటి

తీసుకున్నాడు.

డబ్బు చెల్లించి, కవరులో వున్న టీ షర్టు తీసుకుని అతడు వెళ్ళిపోయాడు.

అతడికి టీ షర్టు అమ్మిన యువతి రెండో యువతి వైపు చూసి కళ్ళు చిట్లించింది.

"రోజూ ఒక టీ షర్టు కొంటున్నాడతను" అంది రమ.

"నీ మీద మోజు కొనపిస్తోంది" అంది మేనక కొంటెగా.

"అతడొక మాడ్ చాప్ అయివుండాలి! ఈసారి అతడు వచ్చినపుడు నువ్వు వెళ్ళు, కొంటాడో లేదో చూద్దాం" అంది రమ.

"నేను అటో యిటో తేల్చేస్తాను. రమ మీద మోజుంటే టీ షర్టులు కొనక్కరలేదని చెప్పేస్తాను. పాపం నీ మూలంగా అతడికి నష్టం దేనికి?" అంది మేనక.

"నీ మాటలు వింటుంటే నన్ను ప్రేమించే ప్రిన్స్ చార్మింగ్ వచ్చాడనిపిస్తోంది!" అంది రమ నవ్వుతూ.

మర్నాడు అదే టైముకు వచ్చాడతను. మేనక నవ్వుతూ ముందుకు వెళ్ళింది.

"ఏం కావాలి, సార్" అందామె.

ఆమె వైపు చూస్తూ మౌనంగా వుండిపోయాడతను.

ఆమె విచిత్రంగా నవ్వింది.

"వుండండి ఆమెను పంపుతాను" అంది మేనక.

"ప్లీస్ వద్దు! నాకు మీరే కావాలి! మీరే!" అన్నాడతను.

"నేనా?"

"అవును మీరే. మీకోసమే నేను రోజూ ఇక్కడకు

వస్తున్నాను."

"ఈ షాపులో అమ్మకానికి పెట్టిన వస్తువుని కాను నేను!" అందామె నవ్వుతూ.

"అది నాకు తెలుసు. డబ్బు కొనలేనిది హృదయంతో పొందుచ్చు. మీతో మాట్లాడాలి. ఎప్పుడు నన్ను కల్సుకోగలరు?" అన్నాడు సత్యమూర్తి.

"సాయంత్రం ఆరింటికి నేను షాపు వదిలి యింటికి బయలేరతాను" అందామె.

"థాంక్స్, అప్పుడు కల్సుకుంటాను. బై" అని అతను కదిలాడు.

సూర్యుడు అస్తమించాడు. షాపుల్లోని లైట్లు వెల్తున్నాయి. తనే కారును స్వయంగా నడుపుతూ వచ్చాడు సత్యమూర్తి. ఒకచోట కారును ఆపి, సీటుమీదే కూర్చుని షాపువైపు చూస్తున్నాడు.

మేనక షాపులోంచి బయటకు వచ్చి యిటూ అటూ చూసింది. సత్యమూర్తిని ఆమె గుర్తించింది. అతడి కారువైపు నడిచింది.

"ఏం మాట్లాడాలి?" అందామె.

అతడు ముందు తలుపు తెరిచాడు.

"ఎక్కండి, చెప్తాను" అన్నాడు.

ఆమె అతడివైపు పరీక్షగా చూసింది. సీటుమీద కూర్చుని తలుపు మూసింది.

"ప్రథమ పరీక్షలో పాసయ్యాను. సంతోషం" అని అతడు కారును పోనిచ్చాడు.

కొంతసేపు యిద్దరూ మౌనంగా వున్నారు.

"మీ పేరు నాకు తెలియదు. నా పేరు సత్యమూర్తి."

"నా పేరు మేనక" అందామె.

కారును మెల్లిగా పోనిస్తున్నాడతను.

"నాకో మంచి హోటల్ తెలుసు. అక్కడ మనం కూర్చుని తింటూ మాట్లాడుకోవచ్చు" అన్నాడతను.

"మీకు ఆకలిగా వుంటే పదండి!" అందామె.

"మీకు ఆకలి లేకపోతే మానేద్దాం" అన్నాడతను.

"మీరు ఏం చెప్తారో వినాలన్న ఆకలి బాగావుంది" అంది మేనక నవ్వుతూ.

హోటల్ పిక్‌నిక్ కాంపౌండులో అతడు కారు ఆపాడు. ఇద్దరూ దిగారు. తోటలో గొడుగుకింద ఇద్దరూ ఎదురెదురుగా కూర్చున్నారు.

బేరర్ రాగానే సత్యమూర్తి ఆర్డరిచ్చాడు. ఆమె వైపు ప్రేమతో చూశాడతను.

మేనక ఎంతో అందంగా వుంది. ఆమె కళ్ళు ప్రకాశిస్తున్నట్లు వున్నాయి.

"మొదటిసారి ఆ షాపులో మిమ్మల్ని చూసినప్పటి నుంచీ మీ రూపమే నా హృదయంలో నృత్యం చేస్తోంది. మిమ్మల్ని పెళ్లాడతాను!"

"ఇటుపైన నాతో బహువచనంలో మాట్లాడకండి!"

"అది యిద్దరికీ వర్తించాలి" అన్నాడతను.

ఆమె అతడి కళ్ళలోకి చూసింది.

"సత్యా, నేను పేదపిల్లని. నువ్వు ధనవంతుడిలా కనిపిస్తున్నావు. మీ పెద్దలు ఈ పెళ్ళికి ఒప్పుకుంటారా?" అందామె.

"మా నాన్న పోయారు. అమ్మ మాత్రం వుంది. ఆమె అడ్డు చెప్పదు."

బేరర్ ప్లేట్లు తెచ్చి పెట్టి వెళ్ళిపోయాడు. ఇద్దరూ తింటూ ఒకళ్ళనొకళ్ళు చూసుకుంటూ కూర్చున్నారు.

మెల్లిగా సత్యమూర్తి ఆమె చెయ్యిని పట్టుకున్నాడు. "నీతో యిలా శాశ్వతంగా కూర్చోవాలనిపిస్తోంది" అన్నాడు ఉద్రేకంతో.

బేరర్ కాఫీ తెచ్చాడు. బిల్లు టేబులుమీద ప్లేటులో పెట్టాడు. సత్యమూర్తి ప్లేటులో రెండు నోట్లు పడేశాడు. ప్లేటు తీసుకుని బేరర్ కదిలాడు. కాఫీ తాగాక సత్యమూర్తి, మేనక వుషారుగా కారువైపు నడిచారు.

# 8

మహాబలిపురం పిక్నిక్‌కి వెళ్ళి సత్యమూర్తి, అతడి మిత్రులు నాలుగు కార్లలో తిరిగి వస్తున్నారు.

ముందు కారులో సత్యమూర్తి, మేనక మాత్రం వున్నారు. వెనుకనున్న మూడు కార్లలో అతడి మిత్రులు వున్నారు.

"పెట్రోలు పోయించాలి" అని సత్యమూర్తి కారును ఒక బంకు ముందుకు పోనిచ్చాడు.

తతిమ్మా కార్లు దూరంగా రోడ్డుమీద ఆగివున్నాయి. కార్లలోంచి కొందరు కిందకు దిగారు.

తులసీరామ్ కార్లోంచి దిగి సమీపంలో వున్న టాక్సీ దగ్గరకు వెళ్ళాడు. టాక్సీ డ్రయివర్ కారులో కూర్చుని వున్నాడు.

తులసీరామ్ అతడి చేతిలో పదిరూపాయిల నోటు పెట్టాడు.

"నేను సిగ్నల్ యివ్వగానే కారుతో దూసుకుపో!" అన్నాడు.

"అలాగే సార్" అన్నాడు డ్రయివర్.

టాక్సీపక్కనుంచి తులసీరామ్ పెట్రోల్ బంక్ వైపు చూశాడు. సత్యమూర్తి కారు టాంకులో పెట్రోలు

పోస్తున్నాడు ఒకతను. తులసీరామ్ చుట్ట వెలిగించాడు. కాలుతున్న చుట్టను అమాంతంగా సత్యమూర్తి కారు టాంక్ వైపు రాకెట్ లా పంపాడు.

టాక్సీ డ్రయివర్ కి సిగ్నల్ యిచ్చి తను రోడ్డు మీదున్న కార్ల వైపు వేగంగా నడిచాడు.

తటాలున కారు వెనకనుంచి మంటలు పైకి లేచాయి. పెట్రోలు పోసే అతను భయంకరంగా అర్చాడు. పెట్రోలు సరఫరా ఆపేశాడు. దూరంగా పరుగెత్తాడు. పెట్రోలు బంక్ రక్షించబడింది కాని సత్యమూర్తి కారు టాంక్ లోని పెట్రోలు మండుతోంది. సత్యమూర్తి, మేనక కిందకు దూకారు. ఇద్దరూ దూరంగా పరుగెత్తారు.

సత్యమూర్తి కారును మంటలు చుట్టేశాయి. పది నిమిషాల్లో మంటల ప్రళయ తాండవం ముగిసింది. సీట్లు, రూఫింగ్ టైర్లు దగ్ధమై సత్యమూర్తి కారు వికృత రూపం దాల్చింది.

తులసీరామ్, యితర మిత్రులు సత్యమూర్తి దగ్గరకు పరుగెత్తుకొచ్చారు.

“కారు పోతే పోయింది, మీరు క్షేమంగా వున్నారు” అన్నాడు తులసీరామ్.

సత్యమూర్తి ఆలోచిస్తూ వాళ్ళవైపు చూశాడు.

“ఎవరో ఏదో పెట్రోల్ టాంక్ వైపు విసిరారు!” అన్నాడు సత్యమూర్తి.

“అక్కడున్న ఒక టాక్సీ దూసుకుపోయింది” అన్నాడు తులసీరామ్.

“ఆ టాక్సీలో వున్నతనే టాంక్ వైపు ఏ సిగరెట్టో విసిరివుండాలి” అన్నాడొక మిత్రుడు.

“పోలీసు రిపోర్టివ్వాలి” అన్నాడు సత్యమూర్తి.

తులసీరామ్ పోలీసులకు ఫోన్ చేశాడు. కాస్సేపట్లో పోలీసు జీప్ వచ్చి ఆగింది.

ఇన్ స్పెక్టర్ నాయర్, నలుగురు కాన్ స్టేబుల్సు కిందకు దిగారు.

"నా పేరు సత్యమూర్తి. ఆ కారు నాది" అన్నాడు సత్యమూర్తి.

కాలిపోయిన కారును పరీక్షించి ఇన్ స్పెక్టర్ నాయర్ నలువైపులా వెతికాడు.

కారుకి కొంచెం దూరంలో నేలమీద పడున్న చుట్ట కనిపించింది! చుట్ట ఆరిపోలేదు. ఇంకా కాల్తోంది!

బంక్ మనిషి చుట్టవైపు చూశాడు.

"ఆ చుట్టని ఎవరో కారు టాంక్ వైపు విసిరారు" అన్నాడు బంక్ మనిషి.

ఇన్ స్పెక్టర్ అందరివైపూ చూశాడు.

"చుట్ట విసిరిన వ్యక్తిని ఎవరేనా చూశారా?" గంభీరంగా ప్రశ్నించాడు ఇన్ స్పెక్టర్.

ఎవ్వరూ చూడలేదు! అందరూ మౌనంగా వున్నారు.

ఇన్ స్పెక్టర్ నాయర్ చూపు సత్యమూర్తివైపు వెళ్ళింది.

"సత్యమూర్తిగారూ, ఈ చుట్ట సగంపైన యింకా కాలకుండా వుంది. చుట్టపీకయితే ఎవరో కాల్చి నిర్లక్ష్యంగా విసిరారు అనుకోవచ్చు. ఇది అలా కాదు. చుట్టను వెలిగించి వెంటనే కారు టాంక్ వైపు యెవరో విసిరారు. మిమ్మల్ని చంపడానికి ఎవరో ప్రయత్నించారు" అన్నాడు ఇన్ స్పెక్టర్.

సత్యమూర్తి వులిక్కిపడ్డాడు. గాభరాగా మేనక అతడి చెయ్యి పట్టుకుంది.

"నన్ను చంపితే వాళ్ళకు ఏ విధంగా లాభిస్తుంది?" అడిగాడు సత్యమూర్తి.

"అది కనుక్కోవలసిన విషయం" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

అక్కడనుంచి దూసుకుపోయిన టాక్సీని గురించి తులసీరామ్ ఇన్‌స్పెక్టర్‌కి చెప్పాడు.

"ఫైన్! చుట్ట విసిరినవాడు ఆ టాక్సీలో వెళ్ళిపోయి వుండాలి. టాక్సీ నంబరు ఎవరేనా చూశారా?"

అందరూ మౌనంగా వున్నారు. ఎవ్వరూ చూడలేదు.

"సత్యమూర్తిగారూ, మీరు ఇటుపైన జాగ్రత్తగా వుండడం మంచిది. ఎక్కడికీ ఒంటరిగా వెళ్ళకండి" అని ఇన్‌స్పెక్టర్ సలహా యిచ్చాడు.

తులసీరామ్ ఆప్యాయంగా సత్యమూర్తి చెయ్యి పట్టుకున్నాడు.

"ఇటుపైన నీతో నేను కూడా వుంటాను. నీకు ఏ ప్రమాదం రాకుండా చూస్తాను" అన్నాడు తులసీరామ్.

ఇన్‌స్పెక్టర్ అతడివైపు పరీక్షగా చూశాడు.

"ఎవరితను?" అన్నాడు నాయర్.

"నా ప్రియమిత్రుడు. నా కంపెనీలోనే పని చేస్తున్నాడు" అన్నాడు సత్యమూర్తి.

ఇన్‌స్పెక్టర్‌కి రిటన్ రిపోర్టు అందించి సత్యమూర్తి, మేనక, తులసీరామ్ కారులో ప్రయాణం సాగించారు. తులసీరామ్ కారును పోనిస్తున్నాడు. అతడి పక్కన ఇద్దరు మిత్రులు వున్నారు. వెనుక సీటుమీద సత్యమూర్తి మేనక మాత్రం వున్నారు.

"ఇన్‌స్పెక్టర్ ఏదో వూహిస్తున్నాడు. నన్ను చంపడానికి ఎవ్వరూ ప్రయత్నించరు" అన్నాడు సత్యమూర్తి.

"అయినా మనం జాగ్రత్తగా వుండడం మంచిది" అన్నాడు తులసీరామ్.

## 9

సుజాత తండ్రికి కాఫీ గ్లాసు అందించి ఎదురుగా నిలబడింది. నాగరాజు ఆమెవైపు నవ్వుతూ చూశాడు.

"అమ్మాయి ఏదేనా అడగాలా?"

"అవును, నాన్నా" అందామె.

బావతో తన పెళ్ళి విషయం గురించి ఆమె అడుగుతుందేమో అని అతడనుకున్నాడు.

"నీ పెళ్ళి త్వరలో జరుగుతుందమ్మా!" అన్నాడతను.

"ఆ విషయమే మాట్లాడాలి."

"ఏమిటో చెప్పు!"

"నాకోసం మీరు ఏ సంబంధాలూ చూడొద్దు. నేను పెళ్ళాడబోయే యువకుడిని నేనే కనుక్కున్నాను."

"ఎవరతను?"

"మీ కంపెనీలోనే పనిచేస్తున్నాడు."

"మా కంపెనీలలో కొన్ని వందలమంది పనిచేస్తున్నారు. పేరు చెప్పు!"

"అతనే, తులసీరామ్."

నాగరాజు తృళ్ళిపడ్డాడు.

"అతని వలలో ఎలా పడ్డావు?"

"ఇద్దరం ప్రేమించుకున్నాం. అతడినే పెళ్ళాడతాను."

నాగరాజు ఆమెవైపు సూటిగా చూశాడు.

"అతడిని గురించి మనకు ఏమీ తెలియదు. సత్యా తీసుకొచ్చి ఉద్యోగం యిచ్చాడు. ఆ ఉద్యోగంలో ఎంతకాలం వుంటాడో!"

ఆమె తీయగా నవ్వింది.

"నన్ను వదిలి అతను ఎక్కడికీ పోడు నాన్నా!" అందామె.

"నీ వయసులో తెల్లనివన్నీ పాలలాగే అగుపిస్తాయి. జీవితంలో కొన్ని దెబ్బలు తింటేగాని నిజం తెలియదు" అన్నాడతను.

ఆమె మాట్లాడలేదు. కొంతసేపు తండ్రివైపు సూటిగా చూసింది.

"అతడిని యిక్కడకు రమ్మని చెప్తాను. మీరు మాట్లాడండి."

"ఎప్పుడొస్తాడు?"

"మీకు వీలు ఉన్నప్పుడు" అందామె.

"రేపు రాత్రి భోజనానికి రమ్మను, ఏడింటికి. మాట్లాడి చూస్తాను."

మర్నాడు ఏడింటికి తులసీరామ్ ఆమె యింటికి చేరుకున్నాడు. సుజాత నవ్వుతూ అతడిని ఆహ్వానించింది.

విశాలమైన హాల్లో చక్కటి సోఫాలున్నాయి— అతడు కూర్చున్నాడు. సుజాత మెరుస్తూన్న కళ్ళతో అతడివైపు చూసింది.

"నాన్న వస్తాడు, కూర్చో!" అందామె.

"నేను నీకోసం వచ్చాను, మీ నాన్నకోసం కాదు." నాగరాజు అప్పుడే హాల్లోకొచ్చాడు.

సోఫాలో కూర్చుని అతడివైపు నాగరాజు పరీక్షగా చూశాడు. యువకుడు బాగున్నాడు. అతడు పంజాబీ అని సత్యమూర్తి చెప్పడం నాగరాజుకు గుర్తుకొచ్చింది. పంజాబీలు రూపంలో బాగానే వుంటారు.

"అమ్మాయి, నువ్వు లోపలకు వెళ్ళు!" అన్నాడతను.

సుజాత లోపలకు వెళ్ళింది. తల్లితో మాట్లాడుతూ కూర్చుంది.

తన ఆఫీసులో అతడు పనిచేస్తున్నాడు. ఇప్పుడతను యింటి అల్లుడు కానున్నాడు.

"తులసీరామ్, అమ్మాయి అంతా చెప్పింది. నా ఒక్కగా నొక్క కూతురు సుజాత. మీరిద్దరూ నిజంగా ప్రేమించుకుంటే నేను సంతోషంగా సమ్మతించి మిమ్మల్ని దీవిస్తాను."

"థాంక్స్, సార్" అన్నాడతను క్లుప్తంగా.

"నీ తలిదండ్రులకు యీ విషయం గురించి రాశావా?"

"నాన్న పోయారు. అమ్మకు రాశాను."

"ఆమె ఒప్పుకుందా?"

తులసీరామ్ నవ్వాడు.

"అమ్మ ప్రేమించి పెళ్ళాడింది."

"మీ అమ్మగారు ఎక్కడున్నారు?"

"ఆమె ఢిల్లీలో ఉద్యోగం చేస్తోంది. ఆమెది గొప్ప హృదయం. నాకోసం తన ఆనందాన్ని త్యాగం చేసింది."

"అటువంటి త్యాగమూర్తులు కొందరు వుంటారు" అన్నాడు నాగరాజు.

నాగరాజు సిగరెట్ పాకెట్ తెర్చి అతడికి యివ్వబోయాడు.

"మీరు కాల్చండి. నా బ్రాండు వేరు. థాంక్స్."

"మీ అమ్మ పేరు?"

"లిమా!" అన్నాడు తులసీరామ్.

లిమా! లిమా! అనుకున్నాడు నాగరాజు లోలోల. ఆ పేరు తను విన్నాడు. ఎక్కడ? ఎప్పుడు?

సుజాత కూల్ డ్రింక్ తెచ్చి తులసీరామ్ పక్కనున్న

టీపాయిమీద పెట్టింది. మెల్లిగా ఆమె లోపలకు వెళ్ళిపోయింది.

లిమా పేరు తనకు ఎలా తెలుసో గుర్తించగానే ఆతడి గుండె దడదడ కొట్టుకుంది. లిమా! ఆనంద్ ప్రియురాలు! ఢిల్లీలో ఆమెను కల్సుకుని ఎన్నో అబద్ధాలు చెప్పాడతను. అదంతా యీ యువకుడికి తెలియక పోవచ్చు! కాని పెళ్ళికి ఆమె మద్రాసు వస్తుంది. తన్ని గుర్తుపడుంది! ఆమె తనని మన్నిస్తుందా?

లిమా అనే పేరు అనేకమందికి వుండొచ్చు. తులసీరామ్ తల్లి లిమా మరెవరో కావచ్చు!

"తులసీరామ్! నేనొకసారి ఢిల్లీ వెళ్ళి యీ పెళ్ళి విషయం మీ అమ్మగారితో మాట్లాడతాను" అన్నాడు నాగరాజు.

"వెళ్ళడం అనవసరం. అయినా కావాలంటే వెళ్ళండి" అన్నాడతను.

నాగరాజు ఒక నిర్ణయానికి వచ్చాడు. లిమా ఆమె కావచ్చు, కాకపోవచ్చు!

లిమా ఆనంద్ ప్రియురాలే అయితే ఆమెకు అంతా ముందుగా చెప్పి తనని క్షమించమని వేడుకోవాలి!

"అమ్మాయి!" పిల్చాడతను.

సుజాత హాల్లోకొచ్చింది. నవ్వుతూ అతను సోఫా లోంచి లేచాడు. వాళ్ళిద్దరివైపు నవ్వుతూ చూశాడు.

"మీరు మాట్లాడుకుంటూ వుండండి. నేను స్నానం చేసి వస్తాను" అని నాగరాజు వెళ్ళిపోయాడు.

## 10

ఢిల్లీ చేరుకున్న నాగరాజు పొద్దుట లిమా ఫ్లాట్‌కు వెళ్ళాడు. ఆమె లేదు. సాయంత్రం ఆరు దాటాక ఆమె

వసుంధరని పక్కవాళ్ళు చెప్పారు. అతడు తన హోటల్ కి వెళ్ళిపోయాడు.

అతడు లిమా ఫ్లాట్ కు చీకటిపడ్డాక వెళ్ళాడు. ఇంట్లోని ఫ్లోరసెంట్ లైట్లు వెలుగుతున్నాయి.

అతడు తలుపుమీద తట్టాడు. హాల్లో కూర్చున్న లిమా "కమిన్ !" అంది.

అతడు లోపలకు వెళ్ళాడు.

"కూర్చోండి" అందామె,

ఆమెకెదురుగా సోఫాలో కూర్చున్నాడతను.

ఆమె వైపు చూశాడు. లిమా ఆమే! సందేహంలేదు. ఆమె తనని గుర్తుపడుతుందా? నాగరాజు అనే వ్యక్తిని ఆమె మర్చిపోయి వుండవచ్చు!

ఆమె అతడివైపు సూటిగా చూసింది.

"నాగరాజుగారూ, యిరవై ఏళ్ళ తర్వాత మిమ్మల్ని నాముందు మళ్ళీ చూస్తున్నాను!" అందామె.

అతడు తృళ్ళిపడ్డాడు.

"నేను మీకు జ్ఞాపకమున్నానా?"

"అబ్బాయి మీ ఫోటోను నాకు పంపాడు. ఆనంద్ మీ చెల్లెలి భర్తని రాశాడు. ఆనాడు మీరన్ని అబద్దాలు యెందుకు చెప్పారో నాకు అర్థమైంది. ఆనంద్ ఆ అడ్రసులో వున్నాడంటే నేను అతడికి ఉత్తరాలు రాస్తాను. అక్కడ ఆనంద్ అనే వ్యక్తి లేడని చెప్పారు. నన్నూ, ఆనంద్ నీ మీరు దూరంచేశారు. మీరు ఆనంద్ ని మోసగాడుగా చిత్రించారు. మీ మాటలు నమ్మాను. మోసపోయానని ఏడ్చాను. మీ మూలంగా ఆనంద్ మీద నాకు కసి కూడా ఏర్పడింది...."

ఆమె చెప్పుకుపోతోంది. నాగరాజు లేచాడు. ఆమె

కాళ్ళముందు నేలమీద కూర్చున్నాడు.

"మీకంతా తెలియదు. నేను చెప్పేది వినండి!"

"చెప్పండి" అందామె.

"ఆనంద్‌కు మీరంటే ఎంతో ప్రేమ. మీకోసం తమిళనాడు ఎక్స్‌ప్రెస్‌లో ఢిల్లీకి వస్తూంటే రైలు యాక్సిడెంట్ అయింది. కాళ్ళూ, ఎడంచెయ్యీ ఒక కన్నూ పోయాయి. అతడు పరుపుమీద పడివుండేవాడు. ఆ క్షణంలో కూడా అతడి మనసు మీమీదే వుండేది. ఎన్ని ఉత్తరాలో రాసి పోస్టు చేయమని నాకిచ్చాడు. మీ బాంకికి డబ్బు ప్రతినెలా పంపమన్నాడు. చివరికి నన్ను ఢిల్లీ పంపాడు. ఇక్కడికొచ్చి మీతో నేను అబద్ధాలు చెప్పాను.

అతడు ఆగి ఆమెవైపు చూశాడు. ఆమె ముఖం విచారంగా వుంది.

"చనిపోయే ముందు అతడు మీ గురించి తన భార్యతో చెప్పాడు. మీరు యెక్కడున్నారో కనుక్కొని తన ఆస్తిలో సగం మీకీయమన్నాడు. ఆమె అలాగే చేస్తానంది. ఆమె నన్ను ఢిల్లీ పంపింది. నేను వచ్చి వెతికాను. మీరు ఆ ఫ్లాట్‌లో లేరు. విచారంతో వెళ్ళిపోయాను."

ఆమె కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి.

"నా మేనల్లుడు సత్యమూర్తి పెద్దవాడయ్యాడు. నా చెల్లెలు అతడిని ఢిల్లీ పంపింది. కాని లాభంలేకపోయింది. తన భర్త ఆఖరి కోర్కె తీర్చలేక పోయాయని నా చెల్లెలు రోజూ ఏడుస్తూ వుంటుంది."

లిమా వెక్కి వెక్కి ఏడుస్తోంది.

"ఆనంద్ మిమ్మల్ని మరువలేదు. మిమ్మల్ని హృద

యంలో వుంచుకని, నిస్సహాయ స్థితిలో అతను మర ణించాడు. మీరు మద్రాసు రండి. మిమ్మల్ని చూసి నా చెల్లెలు ఆనందిస్తుంది. తులసీరామ్ మీ కొడుకని తెలిసి అందరూ సంతోషిస్తారు. మొదటిసారి సత్యమూర్తినీ, తులసీరామ్‌నీ చూసి నా చెల్లెలు పద్మ ఏమందో మీరు వినాలి" అన్నాడతను.

"ఏమందామె?" అడిగిందామె.

"రామలక్ష్మణుల్లా వున్నారు అందామె."

లిమా సోఫాలో కూర్చుని పిచ్చిగా ఏడుస్తోంది. నాగరాజు కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి.

హాల్లోని టెలిఫోన్ మ్రోగింది. ఆమె వెళ్ళి రిసీవర్ అందుకుంది.

"హలో!" అందామె.

"అమ్మా, నేను, తులసీరామ్. ఇంతవరకూ నీకు ఉత్తరాలు మాత్రం రాశాను. ఇప్పుడు నాగరాజుగారి యింటినుంచి నీకు డైరెక్టు డయిలింగ్ చేసి మాట్లాడు తున్నాను" అన్నాడతను.

ఆమె పిచ్చిగా ఏడ్చింది.

"అమ్మా, ఏడుస్తున్నావా?" అడిగాడతను.

"రామ్, ఏడుస్తున్నాను! నీ తండ్రి ఆనంద్ కోసం ఏడుస్తున్నాను. నాగరాజు యిక్కడున్నారు. అంతా తెలిసింది. అజ్ఞానంలో ఆనంద్ మీద నేను ద్వేషం, కసి పెంచుకున్నాను. అదే నీకు నూరిపోశాను. కాని యిప్పు డంతా మారిపోయింది, రామ్!"

ఆమె ఏడుస్తోంది.

"అమ్మా!" అన్నాడతను.

"ఆనంద్ మనల్ని మోసం చేయలేదు. విధి ఆతడిని మనకు దూరం చేసింది."

"అమ్మా, నువ్వు చెప్పింది వింటే ఏడవాలనిపిస్తోంది" అన్నాడతను.

"రామ్, సత్యమూర్తి, ఆతడి తల్లి పద్మ అందరూ మంచివాళ్ళే."

"అయితే నీ జీవితం ఎందుకలా అయిందమ్మా?"

"నాగరాజు చెప్పిన అబద్ధాలు మూలంగా!"

"అయితే సుజాతను నేను మర్చిపోతాను!" అన్నాడతను.

"రామ్, వద్దు. పెద్దల పాపాలను పిల్లలమీద మనం రుద్దకూడదు. నాగరాజును నేను మన్నించాను. నీలో నేను రేకెత్తించిన ద్వేషాన్ని తొలగించి నీ హృదయాన్ని ప్రేమతో నింపుకో!"

"అమ్మా, అలాగే చేస్తాను."

"నాగరాజుతో కలిసి నేను మద్రాసు వస్తున్నాను. ఆనంద్ ఫోటో ఎదురుగా మనం అందరం కలుసుకుందాం" అందామె.

"నీ రాకకోసం ఎదురు చూస్తూ వుంటానమ్మా."

ఆమె రిసీవర్ పెట్టేసింది. నాగరాజువైపు ఆమె కన్నీళ్ళతో చూసింది.

"నాగరాజుగారూ, ఆనంద్ ఆత్మశాంతి కోసం గతాన్ని మర్చిపోదాం. రేపు మీరూ, నేనూ మద్రాస్ కు వెళ్దాం" అందామె.

"అమ్మా లిమా, నువ్వొక దేవతవి!" అన్నాడు నాగరాజు.

# 11

పద్మ ఆప్యాయంగా లిమాను కౌగలించుకుంది.

"చెల్లీ, నువ్వు యిక్కడకు వచ్చినందుకు చాలా సంతోషిస్తున్నాను. ఆయన ఆఖరి కోర్కె యివాళ నెరవేరింది. ఇటుపైన నువ్వూ, తులసీరామ్ ఈ ఇంట్లోనే వుండాలి. ఇది మీ యిల్లు" అంది పద్మ.

సత్యమూర్తి ఆప్యాయంగా తులసీరామ్‌ను తన హృదయంలోనికి హత్తుకున్నాడు.

"మైడియర్ బ్రదర్, నాన్నగారు ఎన్ని కంపెనీలో స్థాపించి వెళ్ళిపోయారు. మనిద్దరం వాటిని జయప్రదంగా నడపాలి" అన్నాడు సత్యమూర్తి.

తులసీరామ్ కన్నీళ్ళతో సత్యమూర్తివైపు చూశాడు.

"అన్నయ్యా, నేను కసితో మద్రాస్ వచ్చాను. నేను ఎన్నో తప్పులు, నేరాలు చేశాను. ఏ విధి మన్ని దూరం చేసిందో అదే విధి నీకు ప్రమాదం రాకుండా కాపాడి నందుకు నేను ఆనందిస్తున్నాను."

"మైడియర్ బ్రదర్, గతాన్ని మర్చిపో! నాన్నగారి ఆదర్శాలను పాటిస్తూ యిటుపైన మనం నడుచుకుందాం" అన్నాడు సత్యమూర్తి.

అందరూ హాల్లో గోడమీదున్న ఆనంద్ ఫోటోవైపు మౌనంగా చూసి, చేతులు జోడించి నమస్కరించారు.

—:అయిపోయింది:—

# సినిమా గ్లామర్

వాణిశ్రీ

ఆడవాళ్ళ గేట్లో నిలబడి సినిమాకు వచ్చే ఆడవాళ్ళని నిశితంగా చూస్తూ గుటకలు మింగుతున్నాడు హాలు మేనేజర్ కాశీపతి.

బుకింగ్ అయిపోయే వరకూ అక్కడే కాలక్షేపం చేసి ఎరవేస్తుంటాడు. అతని ఎరకు చిక్కుకునే చేపలు ఎక్కువగా కంపెనీ సరుకే అయినా అప్పుడప్పుడూ కుటుంబ స్త్రీలు గూడా మోజుపడడం వున్నది.

కాశీపతి దూరంనుంచే ఆమెను చూసి పొంగిపోయాడు. రెప్పలు కొట్టడం మానేసి అలా చూస్తుండిపోయాడు.

ఆమె పేరు తులసి. ఆ వూరికి కొత్తగా వచ్చింది. ఎక్కడ్నుంచి వచ్చిందో తెలీదు. ఆమె వెంట సుబ్బారావు వున్నాడు. అతను అన్నపూర్ణా హోటల్లో సర్వర్ గా చేరాడు. 'మా ఇద్దరికీ పెళ్ళయి ఆర్నెల్లయిందని' తులసి చెప్పుకుంటుంది. కాని ఇంట్లోంచి లేచిపోయి వచ్చారని చాలామంది సందేహిస్తున్నారు. అందుకు కారణాలు

కొన్ని వున్నాయి.

పెళ్ళయిన పిల్లయితే భర్తకి ఉద్యోగం దొరికాక వస్తుంది. కాని వీళ్ళ విషయంలో అందుకు భిన్నంగా జరిగింది. ఇద్దరూ కలిసే వచ్చారు. చిన్న పూరిల్లు అద్దెకు తీసుకున్నారు. తర్వాత సుబ్బారావు వారంరోజులపాటు ఉద్యోగం కోసం తిరిగాడు. ఆఖరికి హోటల్లో సర్వర్ గా చేరాడు.

కాశీపతి అనుమానం గూడా లేచిపోయి వచ్చిందనే. అతనికి తులసిమీద ఇంట్రెస్టు కలగడానికి కొన్ని కారణాలున్నాయి. వాళ్ళుంటున్న పూరిల్లు సినిమా హాలుకి దగ్గరగా వుండడంవల్ల, అతను హాలుకి వస్తూ పోతూ వున్నప్పుడల్లా తులసి మెరుపుతీగెలా అతన్ని ఆకర్షించింది. ఆ లొకాల్టీలో వున్న ఆడవాళ్ళు యెక్కువగా చెడిపోయిన వాళ్ళేనని అతని విశ్వాసం.

అదీకాక కాశీపతికి తన పర్సనాల్టీమీద బోలెడు నమ్మకం. తను సిన్సియర్ గా ట్రై చేస్తే ఏ ఆడపిల్లనైనా బోల్తా కొట్టించగలనన్న విశ్వాసం అతనికుంది. అతను ట్రై చేసినా చిక్కని కేసు గురించి తను సిన్సియర్ గా ట్రై చెయ్యలేదని అనుకుని సంతృప్తిపడుతుంటాడు.

తులసి టిక్కెట్ కోసం క్యూలో నిలబడింది. కాశీపతికి గుండె విలవిల లాడింది. తను తల్చుకుంటే ఆమెను బాల్కనీలో ఫ్రీగా కూర్చోబెడతాడనే సంగతి గ్రహించినట్లు లేదు. లేకపోతే టిక్కెట్టు కోసం జనం మధ్యలో తోసుకోవడం ఏం ఖర్మ?

తులసి టిక్కెట్టు తీసుకుని గేటు దగ్గరకు రాసాగింది. ఆమె అందం కాశీపతిని వెర్రివాడిని చేస్తోంది. పిచ్చివాడిలా ఒకటే చూపు.

తులసికి ఇరవై ఏళ్ళు లోపు వుంటాయి. యెత్తుగా ఉంటుంది. ఎత్తుకి తగ్గ లావు. కోల ముఖం. తెల్లగా ప్రకాశవంతమైన ఆమె కళ్ళు ప్రత్యేక ఆకర్షణ. ఆమె కర్లింగ్ హెయిర్ మరొక ప్రత్యేకత. ఆమె వంటిమీద బంగారం లేకపోయినా శరీరమంతా బంగారుపూత పూసినట్లుంటుంది ఛాయ.

"ఏంటి గురూ? కళ్ళు మర్చిపోయి చూస్తున్నావ్?" సినిమా రిప్రజెంటేటివ్ భాస్కర్ పలకరించాడు.

అప్పటికి తులసి గేటు దగ్గర టిక్కెట్ ఇచ్చి హాల్లోకి వెళ్ళిపోయింది.

"చూశావా దాన్ని?" అన్నాడు కాశీపతి.

"ఊఁ...."

"ఎట్లా వుంది?"

"నీ ఫేవరెట్ స్టార్ హేమమాలినిలా" వుంది.

"ఛా....! హేమమాలిని గూడా దీనిముందు దిగదుడుపే" అన్నాడు.

"అఫ్‌కోర్స్! హేమమాలిన్ని నేనెప్పుడూ పర్సనల్‌గా చూళ్ళేదు. నువ్వు చూశావు కాబట్టి ఒప్పుకుంటాను."

"ఇంతకీ ఆ సుబ్బిగాడు అదృష్టవంతుడు" అన్నాడు కాశీపతి నిట్టూరస్తూ.

"సుబ్బిగాదెవడు?"

"దాని మొగుడు."

"ఆ పిల్లకి అప్పుడే పెళ్ళయిపోయిందా?" ఆశ్చర్యపోయాడు భాస్కర్.

"పెళ్ళయిందో లేదోగాని సంసారం మాత్రం చేస్తోంది" నవ్వాడు కాశీపతి.

"లేపుకొచ్చాడా ఏం?"

"ఏమో? నిజం యెవరికీ తెలీదు" అంటూ తనకు తెలిసిన సంగతులన్నీ చెప్పాడు కాశీపతి.

అంతా విని "ట్రైచేసి చూడరాదూ?" అన్నాడు భాస్కర్.

"వదిరి చావడంలేదు గురూ!" అని వాపోయాడు కాశీపతి.

"వదిరేదేమిటి గురూ! గెట్లో వస్త్రాడితో కబురు చెయ్యి. వచ్చి వాలుతుంది. తెలిగ్గా" అన్నాడు భాస్కర్.

"అంత ఈజీగా వస్తుందంటావా?"

"ఎందుకు రాదూ!"

"ఎందుకో వుంది? డబ్బుకి లొంగే రకం కాకపోతే?" భాస్కర్ నవ్వాడు. "పిచ్చివాడా! మనకి సినిమా గ్లామర్ వుంది. అదే వాళ్ళని లాక్కొచ్చి మనముందు పడేస్తుంది. ఈ రోజుల్లో సినిమా మేనేజర్ అంటే గొప్ప. వెయ్యి రూపాయలు ఇచ్చినా రాని ఆడది సినిమావాడ నేసరికి మోజుపడి వస్తుంది. నాకు ఇటువంటివి ఎన్నో కేసులు తెలుసు" అన్నాడు భాస్కర్.

కాశీపతి కూడా భాస్కర్‌తో ఏకీభవించాడు. తన పర్సనాల్టీ కొంత, ఈ సినిమా గ్లామర్ కొంత ఆడవాళ్ళ వేటలో వుపయోగపడుతున్నాయని అతనికి తెలుసు.

కాశీపతి మనసులో మనసులేదు. తను ఇన్నాళ్ళూ కాలం వృధా చేసినందుకు విచారించాడు. భాస్కర్ చెప్పినట్లు ఏ వస్త్రాడితో కబురు చేసినా సరిపోయేది అనుకున్నాడు.

బుక్కింగ్ క్లోజ్ చేసి కలెక్షన్ క్యాష్ చెస్టులో

పడేశాడు. టిక్కెట్ పీస్‌లు టాలీ అయ్యాయో లేదో చూడమని అసిస్టెంట్‌కి అప్పగించాడు. మామూలుగా అయితే ఇంటర్వెల్ తర్వాత భోజనం చేసేవాడు. ఆ రోజు ముందే భోజనం ముగించాడు. రిప్రజెంటెటివ్ రూమ్ హాలుకు కొంచెం దూరంలో వుంది. ఆ రూమ్ తాళంచెవి అడిగి తీసుకున్నాడు.

"గుడ్ లక్ గురూ!" అన్నాడు భాస్కర్.

కాశీపతి నవ్వి "థాంక్స్" అన్నాడు.

వాల్ పోస్టర్లు అంటించే భీమరాజుని తనవెంట తీసికెళ్ళాడు. మేనేజర్ ఎందుకు తనని వెంట రమ్మన్నాడో వాడికి అర్థం కాలేదు. భోజనానికి ముందు బీరుసీసా తెమ్మని పంపించడం మామూలు. కాని ఈ రోజు భోజనం అయిపోయిందే? మరెందుకు? అని ఆలోచించి వాడికి సమాధానం దొరక్క వూరుకున్నాడు.

రూమ్ తాళంతీసి ఫ్యాన్ వేసుకుని మంచంమీద కూర్చున్నాడు కాశీపతి. భీమరాజు గుమ్మంలోనే నిల్చున్నాడు.

"ఒరేయ్ రాజూ!"

"సార్!"

"నీకు సుబ్బారావు తెలుసుగదా?"

"ఏ సుబ్బారావు సార్?"

"అదేరా అన్నపూర్ణా హోటల్లో సప్లయిర్‌గా చేరాడు చూడు. సన్నగా పొడుగ్గా వుంటాడ్రా!"

భీమరాజు ఆలోచనలో పడ్డాడు.

"మన హాలుకి దగ్గర గుడిసెల్లో వుంటార్రా వాళ్ళు. ఈ మధ్యనే వచ్చారు" అని వివరంగా చెప్పాడు కాశీపతి.

"వాళ్ళా! ఆ సుబ్బారావా? తెలుసు సార్. గుర్తొచ్చాడు" అన్నాడు భీమరాజు.

"వాడి పెళ్ళాం తెలుసా?"

"చూశాను సార్! ఎప్పుడూ మాట్లాళ్ళేదు."

"ఇప్పుడు మాట్లాడు."

"ఎందుకు సార్!" కొంచెం ఆశ్చర్యపోయాడు. మేనేజర్ మనసులో ఏముందో వాడికి లీలగా తోస్తోంది.

"అది సినిమాకి వచ్చిందిరా! బెంచీలో కూర్చుంది. ఇంటర్వెల్లో అది బైటకు వస్తుంది. వీలుచూసి పలకరించు. దాని పేరు తులసి. 'మీ పేరు తులసిగదా అను' అవునంటుంది. మాటల్లో పెట్టి అసలు సంగతి చెప్పు. మా మేనేజర్ మీరంటే ఇష్టపడుతున్నాడు. ఫలానాచోట వున్నాడు. ఒకసారి రమ్మన్నాడు. సినిమా అయేలోపల వెళ్ళిపోవచ్చు అని చెప్పు. నువ్వు రోడ్డుమీద కాచుకో. బైటకు వచ్చాక వెంటపెట్టుకుని ఇక్కడకు తీసుకురా."

కాశీపతి వాడిచేతికి ఐదు కాగితం ఇచ్చాడు. భీమరాజు దాన్ని పేంట్ జేబులో వేసుకున్నాడు.

"వస్తుందా సార్!" అనుమానంగా అడిగాడు.

"వస్తుంది" అన్నాడు కాశీపతి.

భీమరాజు ఈల వేసుకుంటూ బైల్దేరాడు.

## 2

"ఏమండీ...." అన్నాడు భీమరాజు.

తులసి వింతగా చూసింది.

"మీ పేరు తులసిగదూ!" అన్నాడు.

"అవును. నీకెట్లా తెలుసు?" ఆశ్చర్యంగా చూసింది. తులసి.

భీమరాజు నవ్వాడు.

"మీ ఆయన పేరు సుబ్బారావు."
"అరె. భలే తెలుసుకున్నావే?"
"అన్నపూర్ణా హోటల్లో సప్లయర్."
"నా గురించి, అంతా తెలుసన్నమాట."
"హూఁ...." అన్నాడు భీమరాజు గర్వంగా.

"అసలు నువ్వెవరు?" తులసి గొంతు కఠినంగా ఉండడం చూసి భీమరాజుకి కలవరం కలిగింది.

"నేనీ హోల్లో పనిచేస్తున్నాను."
"ఏం కావాలి నీకు?"
"నాకేం అక్కర్లేదు."
"మరి?"
"మా మేనేజర్ తెలుసా మీకు?"
"మీ మేనేజరా?"
"హూఁ...."
"ఏం పేరు?"
"కాశీపతి."
తులసి కొన్ని క్షణాలు ఆలోచించి "తెలీదు" అంది.
"మీరు ఆయనకి బాగా తెల్సు."
"అట్లాగా!"
"మీరంటే ఎంతో ఇష్టమని చెప్పారు."
"అట్లాగని నీకు చెప్పాడా?"
"అవును. నన్ను ఆయనే పంపాడు."
"ఎందుకు?"
భీమరాజు నవ్వాడు.
"నవ్వుతావెందుకు?"
"మగాడు ఆడదాన్ని రమ్మని యెందుకు పిలుస్తాడు?

అందుకే. దగ్గర్లోనే రూమ్ వుంది. అందులో వున్నాడు. మీ కోసం యెదురు చూస్తున్నాడు. సినిమా అయిపోయే లోపలే పంపించేస్తాడు" అన్నాడు భీమరాజు.

"ఒరేయ్!"

ఉలిక్కిపడ్డాడు భీమరాజు.

తులసి ముఖం యెరుపెక్కింది. కళ్ళు పెద్దవిచేసి చూస్తూంటే వాడి గుండె దడెక్కింది.

"నీకు పుల్లమ్మ కంపెనీ తెలుసా?"

"తెలుసు."

"అక్కడికెళ్ళి ఒక లంజను పిల్చుకెళ్ళరా వెధవా! డాఫర్ లంజాకొడకా! ఈసారి నా కంటికి కనిపించావంటే చెప్పుతో కొడతాను" గట్టిగా అంది తులసి.

అనడమే కాదు. జుట్టు పట్టుకుని వంగదీసి నాలుగు గుద్దింది.

ఇంటర్వెల్లో వరండాల్లో సమోసాలు తింటున్న వాళ్ళు, చాక్లెట్లు చప్పరిస్తున్నవాళ్లు, టీ నీళ్ళు తాగుతున్నవాళ్ళూ యెక్కడి వాళ్ళక్కడ నిలబడిపోయి ఆ సీన్ చూశారు.

"ఈసారి చెప్పుతో కొడతాను, నిన్నూ వాడిని గూడా!" అంది తులసి.

భీమరాజు తులసి పట్టు వదిలించుకుని స్పీడుగా పారిపోయాడు.

ఏం జరిగిందో అడిగే లోపల తులసి హాల్లోకి వెళ్ళిపోయింది. జరిగిపోయిన రసవత్తర ఘట్టానికి కారణం యేమిటో యెవరికీ తెలీలేదు. ఈ లోపల బెల్ కొట్టారు. ఎక్కడ వాళ్ళక్కడ తేరుకుని హాల్లోకి వెళ్ళిపోయారు.

# 3

ఆఫీస్ రూమ్‌లో కూర్చున్న మేనేజర్ని చూసి రిప్రజెంటేటివ్ ఆశ్చర్యపోయినట్లు నిలబడిపోయాడు.

కాశీపతి ముఖం అవమానంతో కుతకుత వుడికిపోతున్నది. అప్ట్రాల్ ఒక ఆడది, అందులోనూ ఒక సర్వర్ గాడి పెళ్ళాం తనని చెప్పుతో కొడతానని నలుగురిలో పరువు తీసింది. తను పంపినవాడిని వాయగొట్టింది. ఎంత ధైర్యం దానికి? దానిని ఏం చేస్తే తన కసి తీరుతుంది?

"కూర్చో గురూ!" అన్నాడు కాశీపతి కొంచెం సేపటికి తేరుకుని.

భాస్కర్ కూర్చున్నాడు.

"మూడో పార్టు గూడా అయినట్లు లేదు. అప్పుడే వచ్చేశావేమిటి? అది వచ్చిందా?"

కాశీపతి తల అడ్డంగా వూపాడు.

"కథ అడ్డం తిరిగింది."

అతను జరిగినదంతా వివరంగా చెప్పాడు భాస్కర్‌కి.

"అయితే అది హై లెవల్లో వుందన్నమాట" అన్నాడు భాస్కర్.

"నువ్వు చెప్పినట్లు సినిమా గ్లామర్ పనిచెయ్యలేదు దానిముందు" నీరసంగా అన్నాడు కాశీపతి.

"ఆ మాట నేనొప్పుకోను" అన్నాడు భాస్కర్.

"నీకింకా ఆ గ్లామర్ మీద నమ్మకం వుందా? అయితే ఈ కేసు ఎందుకు ఫెయిలయినట్లు?" అన్నాడు కాశీపతి, భాస్కర్ ధోరణి అర్థంకాక.

"ఈ కేసు హై క్లాస్."

"అంటే."

"అంటే యేముంది? రాయబారాలు, సందేశాలవల్ల లాభం లేదు. పర్సనల్ గా డీల్ చెయ్యాలి బ్రదర్" అని పకపక నవ్వాడు భాస్కర్.

కాశీపతి తెల్లబోయి చూశాడు.

"నీకు ఆడదాని సైకాలజీ తెలీదు బ్రదర్. మనం యెవరికి కబురు చేస్తాం? కాల్ గర్ కి. తనని ముక్కూ మొఖం తెలీనివాడు రమ్మని పిలిచాడంటే తనని కాల్ గర్లుగా దిగజార్చాడని అది అర్థం చేసుకుంది. అది చాలా ఇంటలిజెంట్. ఎడ్యుకేటెడ్ కూడా అయివుంటుంది. అందుకే మనవాడిని దులిపేసింది. పర్సనల్ గా ట్రై చేస్తే లొంగకపోదు. ఈసారి రాయబారం పంపక. స్వయంగా ట్రై చేసుకో. సక్సెస్ గ్యారంటీ."

కాశీపతి మనసు వూరట చెందింది. ఆశ చిగురించింది తులసిమీద.

'అమ్మ దొంగ! ఇంత ఘటికురాలివా? నిన్ను పడ వెయ్యకపోతే నా పేరు కాశీపతే కాదు' అనుకున్నాడు.

"థాంక్స్ గురూ!" అన్నాడు కాశీపతి భాస్కర్ వంక కృతజ్ఞతతో చూస్తూ.

## 4

తులసి వుంటున్న లొకాల్టీని కాపులగుంట అంటారు ఆ వూళ్ళో. ఒకప్పుడది గుంటగా వుండేది. చెడిబ్రతికిన వాడొకడు ఆ యేరియాని మున్సిపాల్టీనుంచి ఆక్రమణచేసి పది పాకలువేసి అద్దెలకిచ్చాడు.

ఆ చుట్టుపక్కల మరికొన్ని పాకలు వెలిశాయి. మున్సిపాలిటీవాళ్ళు చచ్చినట్లు లైట్లు వేశారు, కుళాయిలు పెట్టించారు. అదంతా నా గొప్పే అంటాడు ఆ చెడి బ్రతుకుతున్నవాడు. అందుకే అతన్ని కౌన్సిలర్ గా

యెన్నుకున్నారు ఆ వాడలో వాళ్ళు. అతని పేరు ఏడు కొండలు.

కాశీపతి ఏడుకొండల్ని కలిశాడు.

"నమస్కారం మేనేజరుగారూ! యేమిటిలా దయ చేశారు. యెవ్వారం చూస్తే దారితప్పి వచ్చినట్లుందే" అన్నాడు పకపక నవ్వుతూ.

"అదేం కాదు. దారి చూసుకునే వచ్చాను."

"ఏవిటి సంగతి?"

"మరేం లేదు. మా హాలుదగ్గర మీ ఇళ్ళున్నాయిగా."

"వున్నాయి. కొంపతీసి పీకించెయ్యమన్నా రేవిటి? పిల్లలు గలవాణ్ని."

"అబ్బ చెప్పనియ్యండి స్వామీ! ఆ ఇళ్ళలో నాకొకటి కావాలి."

"మీ కేవిటి? ఆ లొకాల్టీలో ఇల్లేమిటి?" ఆశ్చర్యంగా అన్నాడు యేడుకొండలు.

"ఫ్యామిలీ వుంటానికి కాదు లెండి. ఒక్కోసారి రెండో ఆట అయ్యేవరకూ వుండాల్సొస్తున్నది. గవర్న మెంట్ మారిందిగదా! సేల్ టాక్సాళ్ళనీ, ఇన్ స్పెక్టర్లనీ, ఆళ్ళూ ఇళ్ళూ వస్తుంటారని మా ప్రొప్రయిటర్ నన్ను జాగ్రత్తగా వుండమన్నాడు. తప్పదుగదా మరి?

ఆ టైమ్లో ఇంటిదాకా పోవాలంటే కష్టంగా వుంది. యెక్కడో కొత్తపేటలో. కొన్నాళ్ళిక్కడే ఇల్లు తీసుకుంటే మంచిదని. దగ్గరగా వుంటుంది. మనం సెకండ్ షో ఇంటర్వెల్ అయ్యాక వచ్చి పడుకోవచ్చు. యెవరైనా చెకింగ్ కివస్తే వర్రాళ్ళొచ్చి గబుక్కున లేపుతారు."

తనకి అక్కడ ఇల్లెందుకు కావాలో వివరంగా

చెప్పాడు కాశీపతి.

"మీరడిగితే నేను కాదంటానా? ఇల్లు రెడీగా వుంది. ఆకుపచ్చ తలుపులున్నది. ఇదుగో తాళంచెవి తీసుకోండి. మీ తాళం వేసుకున్నాక మాది పంపించండి" అన్నాడు యేడుకొండలు.

తాళంచెవి అందుకుని "అద్దె ఎంత?" అన్నాడు.

"అద్దెది యేవుందిలెండి. యెంతో కొంత ఇవ్వండి. మీ సినిమా ఫ్రీగా చూస్తుంటారుగా మా పిల్లలు" అని నవ్వాడు యేడుకొండలు.

"అది వేరు. ఇది వేరు. అద్దె చెప్పండి."

"అందరూ ముఫై ఇస్తున్నారు. మీరు ఏభై ఇవ్వండి."

"అదేవిటి?"

"మీరు సినిమా మేనేజర్‌గా అందుకని."

కాశీపతి నవ్వాడు.

అతని కళ్ళముందు తులసి కదులాడుతోంది. తను ఆ లొకాలిటీలో ఇల్లు తీసుకుంటున్నది కేవలం తులసికోసం.

మర్నాడే ఆ ఇంట్లో చేరాడు కాశీపతి. సినిమా మేనేజర్ తమ ఇళ్ళమధ్య చేరడం అక్కడివాళ్ళకి చాలా ఆశ్చర్యంగా వుంది. హాలుకి దగ్గరగా వుంటుందని తీసుకున్నానని అడిగిన వాళ్ళకి చెప్పాడు.

కొందరు ఆడవాళ్ళు అతన్ని బుట్టలో వేసుకోవాలని ప్రయత్నాల్లో పడ్డారు. కాని అతని దృష్టి తులసిమీద వుందని గ్రహించి నిరాశపడ్డారు. తులసి ఇంటి బైటకు వస్తే కాశీపతి కళ్ళు రెప్పలు వెయ్యకుండా చూసేవాడు. సుబ్బారావుతో మాటలు కలపడానికి ప్రయత్నించేవాడు.

సుబ్బారావు కలుపుగోలు మనిషి కాదు. ఇంటర్ వరకు చదువుకుని హోటల్లో సర్వర్‌గా వుండాల్సి

చ్చిందని బాధపడుతూ, ఇన్ ఫీరియారిటీ కాంప్లెక్స్‌లో కృంగిపోతుండేవాడు.

"మీకు వీలుగా వుంటే మా హాల్లో బుకింగ్ చెయ్యండి. వేణ్నీళ్ళకి చన్నీళ్ళు తోడుగా వుంటుంది" అన్నాడొకసారి సుబ్బారావుతో.

"ఎక్కడ కుదురుతుందండీ? షిఫ్టుల ప్రకారం పని చెయ్యాలిగదా! ఒక రోజు పగలు, మరొక రోజు రాత్రి వస్తుంటుంది డ్యూటీ" అన్నాడు సుబ్బారావు.

సుబ్బారావుని తన కంట్రోల్లోకి తెచ్చుకోవాలనుకున్న కాశీపతి ఐడియా ఫలించలేదు.

కాని రాను రాను తులసి ప్రవర్తనలో మార్పు కనిపించింది. లోగడలా కాశీపతిని చిన్న చూపు చూడటం లేదు. ప్రసన్నంగా చూడడం సాగించింది. అతను నవ్వితే సిగ్గుపడడం, పమిట సర్దుకోవడం, యెవరైనా గమనిస్తున్నారేమోనని అటూ ఇటూ చూడడం చేస్తోంది.

కాశీపతి తన కష్టం ఫలించేరోజు దగ్గరపడుతున్నట్లు గ్రహించాడు.

ఒక రోజు మధ్యాహ్నం.

తులసి ఎండిన బట్టలు తీసి మడతలు వేస్తోంది.

కాశీపతి ట్రిమ్‌గా తయారై హాలుకి బయల్దేరాడు. మ్యాట్నీ టైమ్ కాబోతున్నది. ఆ వేళ కొత్త సినిమా మొదలు.

"సుబ్బారావుగారు లేరా?" అన్నాడు కాశీపతి ఇంటిముందు ఆగి.

తలసి అతన్ని గమనించి కంగారుపడింది. పమిట సర్దుకుంది. అతని కళ్ళలోకి సూటిగా చూసి కళ్ళు దించు

కుంది.

"లేరండి. డ్యూటీకి వెళ్ళారు" అంది.

"ఎప్పుడొస్తారు?"

"రాత్రి ఎనిమిదికి."

"అప్పటి వరకూ మీరు ఒంటరిగా యెలా వుంటారు? బోర్ కొట్టదూ?"

ఆమె సమాధానం చెప్పలేదు. మొగమాట పడుతూ నవ్వింది. ఆమె కళ్ళు ఇటూ ఇటూ కదులుతున్నాయి యెవరైనా చూస్తున్నారేమోనని. కాని ఆ సమయంలో యెవరూ బైట లేరు. యెండకి ఇళ్ళల్లో వున్నారు.

"మీతో ఒక విషయం మాట్లాడాలనుకుంటున్నాను" అన్నాడు.

ఆమె ప్రశ్నార్థకంగా చూసింది.

అతను చొరవగా ఇంట్లోకి వెళ్ళాడు.

"ఎండ దంచేస్తున్నది. లోపలకి రండి" అన్నాడు.

ఆమె లోపలకు వచ్చింది. తాటాకుల ఇంట్లో చల్లగా వుంది.

"కాసిని మంచినీళ్ళు ఇస్తారా?"

ఆమె మంచినీళ్ళు ఇచ్చింది. అతను కావాలని గ్లాసు ఇస్తున్నప్పుడు ఆమె వేళ్ళు ముట్టుకున్నాడు. ఆమె కళ్లెత్తి చూసి సిగ్గుపడింది. అతను గ్లాసు ఖాళీచేసి ఆమెకు ఇచ్చాడు.

"ఆ రోజు మా కుర్రాడిని యెందుకు కొట్టారు?" సూటిగా ప్రశ్నించాడు.

"నాకు కోపం వచ్చింది. అలా కబురు చెయ్యడంలో మీ వుద్దేశ్యం ఏమిటి? నేను నీతిమాలినదానినుకున్నారా?" కోపంగా అంది.

"అలా కోప్పడకండి. పొరపాటు జరిగింది. ఒప్పుకుం టున్నాను. ఇష్టం లేకపోతే రానని చెప్పొచ్చుగదా! కొట్టడం యెందుకు?"

"చెప్పానుగా కోపం వచ్చిందని. అలా కబురు చెయ్యడానికి మీకెంత ధైర్యం. యెందుకు చేశారు అలా?"

"మీ గురించి కొందరు అలా చెప్పారు. అందుకని కబురు చేశాను."

"ఎవరా కొందరు?"

"పేర్లెందుకు లెండి" అన్నాడు నిట్టూరుస్తూ.

ఆమె ముఖంలో కోపం పోయింది.

"మీరు చాలా అందంగా వుంటారు. నా ఫేవరెట్ హేమమాలిని. మీరు అలాగే వుంటారు."

ఆమె సిగ్గుపడింది.

"పొగడకండి" అంది.

"కొత్త సినిమా వచ్చింది. రండి మ్యాట్నీకి. అనవసరంగా టిక్కెట్ కొంటారెందుకు? సరాసరి వెళ్ళి బాల్కనీలో కూర్చోండి."

ఆమె ఇబ్బందిగా చూసింది.

"మాట్లాడరేమిటి? వస్తారా?"

"ఇప్పుడు కాదు లెండి."

"ఫరవాలేదు లెండి."

కాశీపతి ధైర్యంచేసి ఆమె చేతిని మృదువుగా తన చేతిలోకి తీసుకున్నాడు. ఆమె ఇబ్బందిగా చూస్తూ తన చేతిని విడిపించుకుంది. అతను మరింత ముందుకు పోయి ఆమె నడుం చుట్టూ చేతిని వేసి దగ్గరగా లాక్కున్నాడు.

అంతే!

అతని గూబ 'గుయ్' మంది.

ఒక్క తోపుతో వాకిట్లోకి వచ్చి పడ్డాడు.

"ఎవర్రా నువ్వు? దొంగ వెధవా? మర్యాదస్థుడ వనుకున్నాను. మగాళ్ళు లేనప్పుడు కొంపలోకి జొరపడి మీద చెయ్యి వేస్తావా? చెప్పుతో కొడతాను వెధవా?"

తులసి కాళికలా మహోగ్రంగా విరుచుకుపడింది.

కాశీపతి ఖిన్నుడై పోయాడు.

ఆ వాడలో ఆడ, మగా విస్తుపోయి చూస్తుంటే అతని తల అవమానంతో వాలిపోయింది. సిగ్గుతో ముఖం యెత్తలేక యెలాగో అక్కడ్నుంచి బైటపడి హోల్లోకి వెళ్ళిపోయాడు. ఆ షాక్ నుంచి కోలుకోవడానికి చాలా సేపు పట్టింది అతనికి.

# 5

కాశీపతి పుట్టాక అటువంటి షాక్ యెప్పుడూ తిన లేదు. అదీ పదిమందిలో, చెప్పుతో కొట్టడం తప్ప అంత పనీ చేసింది ఒక ఆడది. అదీ ఒక బక్కవాడి పెళ్ళాం. అంత అవమానం భరించడం తనవల్ల కాదనిపించింది అతనికి.

రిప్రజెంటెటివ్ తో చెప్పుకుని దాదాపు కన్నీళ్ళు పెట్టు కున్నాడు. ఆ లొకాల్టీలో మగ, ఆడ రేపు వూరంతా ప్రచారం చెయ్యరా? ఇక తన పరువు బజార్న పడ్డట్టే అని వాపోయాడు. ప్రొప్రయిటర్ కి తెలిస్తే తనని చీవాట్లు పెడతాడని భయం వ్యక్తం చేశాడు.

ఒకవైపు ఇంకా బుకింగ్ జరుగుతుండగానే కుర్రాడ్ని పంపించి విస్కీ బాటిల్ తెప్పించి తాగడం మొదలుపెట్టాడు. రిప్రజెంటెటివ్ ని బలవంతంచేశాడు తాగమని.

"సారీ గురూ! డ్యూటీలో తాగను. యెవరైనా ఇన్

స్పెక్టర్ వస్తే ఉద్యోగం వూడుతుంది" అన్నాడు.

క్రిప్టోజెంటెటివ్ గేట్లు చూసుకుంటూ బైట వుండి పోయాడు. కాశీపతి ఆఫీస్ రూమ్‌లో కూర్చుని ఒంటరిగానే మందు కొడుతూ వున్నాడు.

ఇంటర్వెల్ అయింది.

ఒక్కడే హాఫ్ బాటిల్ ఖాళీ చేశాడు కాశీపతి. భోజనం చేసి మత్తుగా కూర్చున్నాడు. అంత తాగినా అతనికి తులసి జ్ఞాపకం రావడం మానలేదు. తిట్టుకుంటూ కూర్చున్నాడు.

మొదటి ఆట వదిలే టైమ్ అయింది.

అప్పుడు వచ్చాడు సుబ్బారావు కేకలు రంకెలు పెడుతూ. అతని వెంట పదిమందివరకూ వున్నారు ఆ లోకాలిటీలో జనం.

సుబ్బారావు బూతులు తిడుతూ ఆఫీసులోకి వచ్చాడు. సినిమా హాల్లో స్టాఫ్ అతన్ని పట్టుకుని ఆపారు.

కాశీపతికి అతన్ని చూడగానే కోపం ముంచుకొచ్చింది. సుబ్బారావుని యెడా పెడా వాయించాడు.

"ఈసారి వచ్చావంటే చంపుతాను కొడకా! కాశీపతి అంటే లోకువైందా?" అని తిట్టాడు.

సుబ్బారావు వెంట వచ్చిన వాళ్ళు కాశీపతిని పట్టుకోబోయారు.

"వంటిమీద చెయ్యివేస్తే చంపుతానని" మండి పడ్డాడు కాశీపతి.

వాళ్ళు వెనక్కి తగ్గారు. స్థానబలిమి. ఏంచెయ్యలేక తలా ఒక మాట అనిపోయారు.

సుబ్బారావు బూతులు తిట్టి నీ సంగతి తేలుస్తా అని వెళ్లాడు.

ఆ వెళ్ళినవాడు ఇంటికి వెళ్ళలేదు. పోలీస్ స్టేషన్ కి వెళ్ళి కాశీపతిమీద రిపోర్టు ఇచ్చాడు, తను ఇంట్లో లేని సమయంలో వచ్చి తన భార్యను బలాత్కారం చేశాడని.

# 6

మర్నాడు పోలీసులు ఇద్దరు కాశీపతి ఇంటికి వచ్చి సెల్యూట్ కొట్టారు.

"ఏమిటిలా వచ్చారు?" అన్నాడు కాశీపతి నవ్వుతూ.

"మా యస్.ఐ.గారు రమ్మన్నారు సార్!"

"ఎందుకు? ఏమిటి?" అని ప్రశ్నించలేదు కాశీపతి.

"నేను వస్తున్నాను పదండి" అన్నాడు.

పోలీసులు వెళ్ళిపోయారు.

"ఎందుకు పోలీసులు వచ్చారు?" ప్రశ్నించింది కాశీపతి భార్య లలిత.

"మనతో ఏదో పని వుండి వుంటుంది" అన్నాడు.

"మనతో పనుంటే యస్.ఐ. మన ఇంటికే వచ్చి వుండేవాడు కదా!" అంది లలిత వ్యంగ్య ధోరణిలో.

"అంటే నీ ఉద్దేశ్యం ఏమిటి?" కోపంగా చూశాడు.

"దాని మొగుణ్ని హాలు దగ్గర కొట్టారంటగా."

"దేని మొగుణ్ని?"

"దానికోసం ఇల్లు గూడా అద్దెకు తీసుకుని వున్నారుగా? ఏదో తెలీదా?"

"నీకెవరు చెప్పారు?"

"ఇటువంటివి దాగుతాయా దాచాలనుకుంటే మాత్రం?"

ఆమె వ్యంగ్యం అతనికి సూటిగా తగులుతోంది.

"సర్లే నోరు మూసుకో" అని విసురుగా వెళ్ళిపోయాడు.

యస్. ఐ. ప్రభాకర్ అతన్ని ఆహ్వానించి కూర్చో బెట్టాడు.

"ఏమిటి రాత్రి ఏదో గొడవ జరిగిందట హోలు దగ్గర?" యేమీ యెరగనట్లు అడిగాడు యస్.ఐ.

"ఏం లేదు సార్! రెండు నెల్లనుంచీ తులసి నా దగ్గరకు వచ్చి పోతూనే వుంది. మీకు తెలుసో లేదో, దానింటి దగ్గరే ఇల్లు కూడా తీసుకున్నాను. కాకుల గుంటలో ఇల్లు పక్కనే వుంటే కొంచెం నయంకదా!"

"ఐ సీ...." అన్నాడు యస్.ఐ.

"నిన్న మధ్యాహ్నం నేను దాని ఇంటికి వెళ్ళాను. యేమిటో అలా బుద్ధి పుట్టింది నాకు. పగలు పోవడం తప్పు అనుకోండి. అందుకే గొడవవచ్చి పడింది. ఎవడో అది చూసి నలుగుర్నీ పోగేశాడు. ఇక అది కంగారుపడి నన్ను తిట్టి బైటకు నెట్టేసింది. అందరికీ తెలిసిన సంగతి మొగుడికి తెలుస్తుందని భయపడి వాడికి నామీద చెప్పింది బలవంతం చేశానని. అదీ కథ. ఆ పిచ్చివాడు దాని మాటలన్నీ నమ్మి యేకంగా హోలు దగ్గరికి వచ్చాడు. నాలుగు తగిలించి పంపించాను" అన్నాడు కాశీపతి.

"నలుగుర్లో తంతే యెలా గురూగారూ! అప్పుడే వాడ్ని కట్టిపడేసి హాల్లో గొడవ పెడుతున్నాడని నాకొక ఫోన్ కొట్టివుంటే వెధవని స్టేషన్ కి పట్టుకొచ్చి చర్మం వలిచేవాడిని కదా! పొరపాటు చేశారు" అన్నాడు యస్.ఐ. విచారం వ్యక్తం చేస్తూ.

"పొరపాటే చేశాను. నేనూ తొందరపడ్డాలెండి. ఆ తులసి చేసిన పనికి షాక్ తిన్నాను. లేకపోతే ఏమిటి చెప్పండి. రెండు నెలల్నుంచీ నా పక్కలో పడు కుంటున్న మనిషి బలవంతం చేశానని నలుగుర్లో తిట్టడం.

ఛా....ఛా....అంతా సినిమాలో జరిగినట్లుయిందనుకోండి. మతి పోయింది దాని దెబ్బకి...." నవ్వాడు కాశీపతి.

యస్. ఐ. కూడా నవ్వాడు.

"ఆ అవమానం భరించలేక మందుకొట్టి పడుకున్నాను. ఇంతలో పెద్ద పోటుగాడిలా ఆ కొడుకు కేకలేసుకుంటూ వచ్చాడు. చెప్పొద్దూ నాకు నషాలానికి అంటింది కోపం. వెనకా ముందూ చూడకుండా నాలుగు తగిలించాను. వాడు మీ కొచ్చి చెప్పుకునుంటాడు" నవ్వుతూ యస్.ఐ. ముఖంలోకి చూశాడు కాశీపతి.

యస్.ఐ. నవ్వలేదు.

"చెప్పడం యేమిటి? రిపోర్టు రాసిచ్చిపోయాడు. కుర్రాడు చదువుకున్న వాడిలాగే వున్నాడు. రూల్సు తెలుసులాగుంది. మీరు గనక కేసు పెట్టకపోతే నేనే ప్రైవేట్ కేసువేస్తానని బెదిరించి పోయాడు. భలే ఇరుకులో పెట్టారుకదండీ" అన్నాడు సీరియస్‌గా.

"ఏదో చూడండి" అన్నాడు కాశీపతి.

"తప్పుతుందా మరి? మీకోసం ఏదోకదారి చూస్తామనుకోండి" అని నవ్వాడు యస్. ఐ.

"నేనిక వెళ్ళిరానా? హాలు దగ్గర కొంచెం పనుంది"

"అలాగే? సాయంకాలం హాలు దగ్గర వుంటారా? వస్తాను."

"ఓ యస్. రండి ఫ్యామిలీతో. నిన్ననే కొత్త ఫిక్చర్ వచ్చింది."

"సినిమాకి తర్వాత వస్తాం లెండి. డ్యూటీమీదే రావాలి."

"డ్యూటీమీదా?"

"అవును సార్!"

"మీరు రావడం యెందుకు? చెప్పండి యేమిటో?"

"ఏం లేదు. ఈ నెలాఖరుకి మా యస్పీగారు రిటైరై పోతున్నాడు. పాపం, సర్వీస్‌లో యేం సంపాదించుకో లేదు. ఇద్దరు కూతుళ్ళున్నారు పెళ్ళికి. మేమంతా కలిసి పర్స్ ప్రెజెంట్ చెయ్యాలనుకుంటున్నాం. మీరొక చెయ్యి వెయ్యాలి."

"అలాగే, రాసుకోండి."

"ఎంత రాసుకోమంటారు?"

"మీకు తెలీదా నా కెపాసిటీ?"

"వెయ్యి నూటపదహార్లు రాస్తున్నాను."

"అమ్మో?"

"భలేవారే. అలా అంటారేమిటి? సినిమా హాలు మేనేజర్ మీరు."

"ఐదొందలు రాసుకోండి."

"లాభం లేదు లెండి, గిట్టదు...."

"సర్లెండి...." అంటూ నీరసంగా వెళ్ళిపోయాడు కాశీపతి లోలోపల తిట్టుకుంటూ.

'వచ్చిన సినిమాలన్నా ఫ్యామిలీలతో సహా వచ్చి చూసి పోతారు. యెక్కడున్నా కాస్త ఇరుక్కుంటే చాలు నొక్కుతారు డబ్బుకి. విశ్వాసంలేదు. ఈ పోలీసు జాతే అంత!'

## 7

కావలగుంట యేరియాలో అర్ధరాత్రి తులసి ఇంట్లో నుంచి 'కెవ్వు'న కేక వినిపించింది. ఆ చుట్టుపక్కల ఇళ్ళల్లో వాళ్ళు ఆ కేక విని నిద్రలోనే ఉలిక్కిపడ్డారు. అంత భయంకరంగా వుందా కేక. నిద్రలేచి పరుగులు తీశారు.

అంతా చీకటిగా వుంది. ఆకాశంలో నక్షత్రాల కాంతి తప్ప వెలుగులేదు. మామూలుగా తెల్లవార్లూ వెలుగుతూ వుండే స్ట్రీట్ లైట్లు వెలగడంలేదు.

ఆ కేక ఎవరు పెట్టారో? ఏ ఇంట్లోనుంచి వచ్చిందో కొంచెంసేపటి వరకు యెవరికీ అర్థంకాలేదు. ఏం జరిగిందో అసలే తెలియలేదు.

స్పిన్నింగ్ మిల్లులో వాచ్‌మన్‌గా పనిచేసే తాతారావు బ్యాట్రీలైటు వేశాక వెలుగొచ్చింది. ఒకళ్ళ ముఖాలు మరొకళ్ళు చూసుకున్నారు.

అందరి యిళ్ళలోంచి జనం వచ్చారు. ఒక్క తులసి ఇంట్లోనుంచి తప్ప. ఆ ఇల్లు తలుపు మూసివుంది. తలుపు తడితే రాలేదు. లోపల గడివేసినట్లుంది.

తలుపులు బాదినా యెవ్వరూ తియ్యలేదు.

కాబట్టి కేకలు వినిపించింది ఆ ఇంట్లోనుంచే అని తెలుసుకున్నారు. ఏదో జరిగింది అని అర్థమైంది. బ్యాట్రీ లైటు వేసుకుని తాతారావు ఆ ఇంటి వెనక్కి వెళ్ళాడు. వెనుక తలుపులు బార్లా తీసి వున్నాయి.

"లోపల కెళ్ళరా తాతారావ్? చూసిరా యేం జరి జరిగిందో?" అన్నారు యెవరో.

తాతారావు స్వతహాగా ధైర్యవంతుడే. కాని ఇప్పటి పరిస్థితి వేరు. అంతకుముందే ఆ ఇంట్లోనుంచి కేకలు విని పించాయి. ముందు తలుపు మూసివుంది. వెనుక తలుపులు బార్లా తీసివున్నాయి. అంటే యేదో జరిగివుంటుంది. అతని గుండె దడదడలాడింది.

"నేనొక్కణ్నే వెళ్ళను. వెంట యెవరైనా రండి" అన్నాడు తాతారావు.

నలుగురు మగాళ్ళు అతని వెంట నడిచారు. లైటు

వేసుకుంటూ ముందు తాతారావు లోపలకు ప్రవేశించాడు.

ఆ దృశ్యం చూసి తాతారావు అదిరిపడ్డాడు. తల గిరగిరా తిరిగినట్లయింది. కాళ్ళు చేతులు వణికాయి.

"ఇద్దర్నీ చంపేశారెవరో" అంటూ ఒకడు ముందుకు వెళ్ళి తలుపులు తీశాడు.

"ఇద్దర్నీ పొడిచేశారు" అని కేకలు పెట్టాడు.

జనం బిలబిలమని లోపలకు వచ్చారు.

సుబ్బారావు రక్తం మడుగులో పడున్నాడు. అతని గుండెల్లో కత్తి దిగి పిడి కనిపిస్తోంది. అతని శవం మంచం మీద వుంది.

తులసి చాపమీద పడివుంది. ఆమె తలమీద నెత్తురు, ముఖం ఎర్రగా అయిపోయింది రక్తంతో తడిసి.

సుబ్బారావులో చలనంలేదు. కాని తులసి వూపిరి పీలుస్తోంది. యెవరో ముక్కు దగ్గర వేలుపెట్టి చూశారు. చెయ్యి పట్టుకుని నాడి చూశారు.

"బ్రతికే వుందిరా! రిక్షా పట్టుకురండి. ఆసుపత్రికి తీసుకెళ్దాం" అన్నాడు తాతారావు.

నలుగురు తులసిని మోసుకెళ్ళి రిక్షాలో ఎక్కించారు. తులసిని పట్టుకుని కూర్చోవడానికి ఒక ఆడమనిషిని రిక్షాలో తోడు వుంచారు.

"ఇద్దరెళ్ళి పోలీస్ స్టేషన్ లో చెప్పిరండిరా ఈ సంగతి" అన్నాడొక ముసలాయన.

"ఎవరు పొడిశారో మాయదారి ముండాకొడుకులు. వాళ్ళ దినం చెయ్య రాక్షసులు...." అంటూ ఆడవాళ్ళు తిట్టసాగారు.

బండిమీద పళ్ళు అమ్ముకునే కాశయ్య తన పెట్రోమాక్స్ లైటు వెలిగించి ఆ ఇంటిముందు పెట్టాడు. ఆ

వెలుగులో ధైర్యంగా కూర్చున్నారు ఆ వీధిలోవాళ్ళంతా. యెవరికీ నిద్ర రావడంలేదు. గత కొన్ని రోజులుగా జరుగుతున్న గొడవలన్నీ నెమరు వేసుకుంటూ మాట్లాడు కోసాగారు.

కాపుల గుంటలో చాలామందికి సుబ్బారావు హత్య, తులసి చావుబతుకుల్లో వుండడం గురించి తెలిసిపోయింది. ఒకొక్కొక్కళ్ళే వచ్చి చూసిపోతున్నారు.

# 8

తులసి వెక్కి వెక్కి ఏడుస్తున్నది.

తెలివి వచ్చినప్పట్నుంచి ఆమె ఏడుస్తూనే వుంది.

"తెల్లవారిన తర్వాత ఇన్‌స్పెక్టర్ రామస్వామి, యస్.ఐ. ప్రభాకర్ హాస్పటల్‌కి వచ్చారు. రాత్రి ఆమె కేస్ టేకప్ చేసిన డ్యూటీ డాక్టర్ అక్కడే వున్నాడు.

"గుడ్ మార్నింగ్ డాక్టర్! ఆమెకు యెలా వుంది?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"షీ ఈజ్ ఆల్‌రైట్. ఆమె తలకు గాయం తగి లింది. గోడకు కొట్టుకుని వుండొచ్చు. అంతకంటే ఇంజ రీస్ ఏమీ లేవు. కాకపోతే మెంటల్ షాక్ తిని పడి పోయింది. ఇప్పుడు తెలివిలోనే వుంది. మీరు మాట్లాడ వచ్చు" అన్నాడు డాక్టర్.

ఇన్‌స్పెక్టర్ వార్డులోకి వచ్చేసరికి ఆమె చుట్టూ జనం మూగివున్నారు. యస్.ఐ. అందర్నీ పంపించి వేశాడు.

"ఏమ్మా, నీ పేరేమిటి?"

ఆమె వెంటనే సమాధానం చెప్పలేకపోయింది. ఇన్‌స్పెక్టర్ రెండుమూడుసార్లు అడిగిన తర్వాత ఏడుపు ఆపుకుంటూ తన పేరు చెప్పింది.

"భయపడకుండా చెప్పు? రాత్రి ఏం జరిగింది?"

"మా ఆయన మూలుగు విని నాకు మెలకువ వచ్చింది. నేను కళ్ళు తెరిచి చూసేసరికి నెత్తురు మడుగులో వున్నాడు. కోడిగుడ్డు లైటు వెలుగులో చూశాను అదంతా. మంచం దగ్గర నిల్చున్నవాడు నేను లేవడం చూసి నా వైపు వచ్చాడు. నాకు భయంవేసి కేకలు పెట్టాను. కర్రతో నా తలమీద కొట్టాడు. నేను పడి పోయాను. తర్వాతి నాకేం తెలీదు. తెలివి వచ్చేసరికి ఇక్కడున్నాను" తులసి చెప్పింది ఏడుస్తూనే.

"చూడమ్మా! కోడిగుడ్డు లైటు వెలుగుతూనే వుంది కదా అప్పుడు?"

"అవునండి!"

"అతని ముఖం నీకు కన్పించి వుంటుంది కదూ?"

"కన్పించిందండీ!"

"నువ్వు గుర్తుపట్టగలవా అతన్ని."

"కళ్ళకి నల్లటి గుడ్డ కట్టుకున్నాడండి. తలకి గూడా నల్లటి గుడ్డ వుంది. యెవరో గుర్తుపట్టలేకపోయాను."

"ఆకారాన్నిబట్టి యెవరో పోల్చగలవా? యెవరు చంపివుంటారు అతన్ని? మీమీద పగ యెవరికుంది? నీ అనుమానం చెప్పు?"

తులసి పెద్దగా ఏడ్చింది.

ఇన్‌స్పెక్టర్ అనునయించాడు.

"ఇంకెవరు చేస్తారు? ఆ సినిమా మేనేజర్ కాశీపతి చేసివుంటాడు. నేను అతనికి లొంగలేదని పగపట్టాడు. మా ఇంట్లోకి వచ్చి నన్ను బలవంతం చేశాడు. అడగ టానికి వెళ్ళిన ఆయన్ని హాల్లో పట్టుకుని కొట్టాడు" అంటూ తులసి పాత కథంతా చెప్పింది.

"సార్! కాశీపతి చెప్పిన కథ వేరేగా వుంది" యస్.ఐ. అన్నాడు.

"ఫస్టు యూ గో ఇమీడియట్లీ. అరెస్టు హిమ్" సీరియస్‌గా అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"యస్. సర్" సెల్యూట్ కొట్టి నిష్క్రమించాడు యస్.ఐ.

"చూడమ్మా! మీరీ వూరొచ్చి యెన్నాళ్ళయింది?"

"ఆర్నెల్లు."

"ఏ వూరు మీది?"

"తెనాలి."

"మీకు పెళ్ళయి యెన్నాళ్ళయింది?"

"సంవత్సరం దాటింది."

"అతనికి కావాల్సినవాళ్ళు యెవరైనా వున్నారా?"

"ఆయన అన్న వున్నాడు. కాని మమ్మల్ని రానివ్వడు. నన్ను చేసుకున్నాడని కోపంతో ఇంట్లోనుంచి వెళ్ళ గొట్టాడు."

"ఏం చేస్తాడు అన్న?"

"హోటల్ వుంది."

"నీ వాళ్ళెక్కడ వున్నారు?"

"నాకెవరూ లేరు. మా అమ్మ నాటకాలు వేసేది. చచ్చిపోయింది. నేనూ కొన్నాళ్ళు నాటకాలు వేశాను. ఆ వృత్తి నచ్చలేదు. ఆయన్ని పెళ్ళిచేసుకుని నాటకాలు మానేశాను."

"అయితే, ఆయన అన్నకి తెలియపరచవద్దా?"

"మీ ఇష్టం!"

"ఎంతయినా అన్నదమ్ములు. చివరిసారి చూడాలని

పిస్తుంది. అడ్రెస్ చెప్పు. తెలియజేస్తాము."

అమె చెప్పింది.

# 9

కాశీపతిని అరెస్టు చేసి బెయిల్ మీద విడుదల చేశారు.

సుబ్బారావు డెడ్ బాడీని తెనాలినుంచి వచ్చిన అతని అన్నకు అప్పగించారు. హోటల్ సిబ్బంది, కాకుల గుంట లాకాల్టీలో కొందరు కలిసి శవాన్ని దహనం చేశారు.

సుబ్బారావు అన్న వెళ్తూ తులసి చేతిలో రెండొందలు పెట్టి, అవసరమైతే వుత్తరం రాయమన్నాడు. తులసిని హోటల్ ప్రొప్రయిటర్ మురుగన్ భార్య ఇంటికి తీసి కెళ్ళింది.

ఇన్‌స్పెక్టర్ పోస్టుమార్టమ్ రిపోర్టు, డెడ్‌బాడీ ఫోటోలు, ఫింగర్ ప్రింట్స్ ముందేసుకుని కూర్చున్నాడు.

కాశీపతి చేతి వేలిముద్రలు యెక్కడా దొరకలేదు. కత్తి పిడిమీదగూడా ప్రింట్స్ లేవు. గ్లోవ్స్ తొడుక్కొని వుండొచ్చు. నెంబర్ టెన్ బూటు తొడుక్కున్న వాడు తిరిగినట్లుగా ముద్రలు పడ్డాయి. కాశీపతి బూటు తొమ్మిదో నెంబరు. యెక్కడా క్లూ దొరకలేదు. తులసి గూడా అతన్ని అనుమానిస్తున్నదే తప్ప, అతనే అని ఖచ్చితంగా చెప్పలేక పోతున్నది.

ఇన్‌స్పెక్టర్ కేసు గురించి డి.యస్పీతో మాట్లాడి సినిమా హాలుకి వెళ్ళాడు. ఇన్‌స్పెక్టర్‌కి విష్ చేసి ఆఫీసు రూమ్‌లోకి తీసికెళ్ళాడు కాశీపతి.

"చెప్పండి సార్!" అన్నాడు కాశీపతి. మనిషి నిబ్బరంగా వున్నాడు. భయపడుతున్నట్లు లేదు.

"సుబ్బారావు, తులసి గురించి మీకు తెలిసిన వివరాలు

చెప్పండి. వాళ్ళు ఈ వూరికి కొత్త. మీకు తప్ప విరోధులు యెవరూ లేనట్లు తెలిసింది. మీకు తెలిసిన గొడవలు వాళ్ళ గురించి ఏవైనా వుంటే చెప్పండి."

"సారీ సార్! నాకేం తెలీదు. తులసిని నా లైన్‌లోకి తెచ్చుకోవాలని ట్రై చేసినమాట నిజమే. తులసికి నాకూ సంబంధం వుంది. నలుగురికీ తెలిసినందుకే నన్ను షేమ్ చేసింది. అందుకు తులసిమీద నాకేం కోపంలేదు."

"సుబ్బారావు అడ్డు తొలగించుకోవడానికి అతన్ని మర్డర్ చేయవచ్చుగా."

"తులసిని పర్మినెంట్‌గా కీప్ చేయాలని నాకేం లేదు. అటువంటప్పుడు అతను నాకు అడ్డు యేమిటి?"

"అయితే, ఈ హత్య యెవరు చేసివుంటారు?"

"ఆ విషయం నాకు తెలీదు."

"మీకేం తెలియదంటారు?"

"ప్రామిస్."

ఇన్‌స్పెక్టర్ జేబులోనుంచి నల్లటి పెన్ తీసి టేబుల్ మీద పెట్టాడు.

"ఈ పెన్ మీదేనా?"

నల్ల పెన్ చూసి కాశీపతి నివ్వెరపోయాడు. ఆశ్చర్యంగా చూశాడు ఇన్‌స్పెక్టర్ వంక.

"యెక్కడిది ఇది? మీకెలా వచ్చింది?"

"ముందు చెప్పండి. ఆ పెన్ మీదేనా?" ఇన్‌స్పెక్టర్ కంఠం కఠినంగా పలికింది.

"నాదే. దానిమీద నా పేరు వుంది."

"పేరు లేకపోతే నాది కాదని బుకాయించేవాడివి అవునా! మిస్టర్ కాశీపతీ! అది హత్య జరిగినచోట దొరికింది. తెలిసిందా!"

కాశీపతి నోట మాట రాలేదు కొంచెం సేపు.

"సార్! అది చాలా రోజుల క్రితం పోయింది."

"వెల్. ఆ విషయం కోర్టులో చెప్పండి."

ఇన్‌స్పెక్టర్ ఆఫీసు రూమ్‌నుంచి వెళ్ళిపోయాడు.

కొంచెం సేపటికి రిప్రజెంటివ్ భాస్కర్ రూమ్‌లోకి ప్రవేశించాడు.

కాశీపతి విచారంగా కూర్చుని వున్నాడు.

"ఈ పూట కలెక్షన్ పూర్‌గా వుంది. హెచ్.ఓ. ఎఫ్. వచ్చేస్తుంది. ఫోన్ చేసి యన్‌టీఆర్ ది కాని, కృష్ణది కాని స్టంట్ పిక్చర్ తెప్పించు. నెలాఖరుగదా మాస్ అయినా వస్తారు" అన్నాడు భాస్కర్.

కాశీపతి రిసీవర్ ఎత్తి నెంబర్ చెప్పి కాల్ బుక్ చేశాడు. అరగంట తర్వాత రింగైంది. ట్రంకాల్ మాట్లాడాడు. మధ్యలో మౌత్ పీస్‌కి చెయ్యి అడ్డంపెట్టి, "స్టంట్ పిక్చర్స్ ఏవీ లేవంటున్నాడు మా మేనేజర్. యేం చెయ్యమంటావు" అని అడిగాడు కాశీపతి.

"అవి లేకపోతే లాభంలేదు. చార్టు బ్రేక్ చేస్తున్నానని చెప్పు. వేరే కంపెనీకి వెళ్ళు" అన్నాడు భాస్కర్.

కాశీపతి రిసీవర్ క్రెడిల్ చేశాడు. టెలిఫోన్ ఇండెక్స్ తీసి మరొక కంపెనీ నెంబర్ నోట్ చేసుకుని ట్రంకాల్ బుక్ చేసి కూర్చున్నాడు.

"రేపు లాస్టు డే గా!"

"వూఁ—" అన్నాడు కాశీపతి.

"నాకూ బోర్‌గా వుంది మీ వూళ్లో. వచ్చి ఆర్నెల్లు

దాటింది" అన్నాడు భాస్కర్.

కాశీపతి మనసు యెక్కడో వుంది.

# 10

రెండు నెలలు గడిచాయి.

తులసి మురుగన్ ఇంట్లోనే వుంటోంది.

ఒకరోజు ఇన్‌స్పెక్టర్ రామస్వామిని కలుసుకుంది తులసి.

"నేను తెనాలి వెళ్ళిపోదామనుకుంటున్నానండీ. ఇక్కడ వాళ్ళింట్లో యెంతకాలం వుండను? కూర్చొని తినాలంటే నాకు బాధగా వుంది" అంది తులసి.

"కేసు నడుస్తోంది. నీ సాక్ష్యం కావాల్సివస్తుందమ్మా! పిల్చినప్పుడు రావాలి. నీ అడ్రస్ ఎలా తెలుస్తుంది?"

"నేను మురుగన్ భార్య వల్లిగారికి ఉత్తరాలు రాస్తుంటాను. యెప్పుడు రమ్మంటారో ముందుగా ఆమెకు మీరు తెలియజేస్తే నాకు రాస్తుంది. లేదా ఆమె దగ్గర నా అడ్రస్ మారినప్పుడల్లా దొరుకుతుంది."

"నీ ఇష్టం. కాని నీ సాక్ష్యం చాలా ముఖ్యం సుమా! లేకపోతే కేసు గెలవకపోవచ్చు."

"కేసు గురించి నేను పెద్దగా ఆలోచించడంలేదు. ఆయన పోయాక కేసు గెలిస్తే మాత్రం ఏం లాభం?" బాధగా అంది తులసి. కళ్ళు తుడుచుకుంది.

ఆమె ముఖాన బొట్టు లేదు. తెల్లచీర కట్టుకుని దైన్యంగా కనిపిస్తోంది. చేతులకు రెండు రోల్డుగోల్డు గాజులు మాత్రం వున్నాయి.

ఆమె ఇన్‌స్పెక్టర్ దగ్గర సెలవు తీసుకుని వచ్చేసింది.

అక్కడ్నుంచి తెనాలికి డైరెక్టు బస్ లేదు. గుంటూరు బస్సు యెక్కింది.

మురుగన్, వళ్ళి బస్‌వరకూ వచ్చి తులసికి వీడ్కోలు చెప్పారు.

ఇన్నాళ్ళూ తనను ఆదరించినందుకు కృతజ్ఞతలు చెప్పుకుని, కళ్ళనీళ్ళు పెట్టుకుంది తులసి.

ఇక్కడే వుండమంటే నువ్వు వినటంలేదు" అంది వళ్ళి.

"ఇష్టం లేకపోయినా నా వృత్తి నాకుందిగా. ఫరవా లేదు. కాలం గడిచిపోతుంది. పేలవంగా నవ్వింది తులసి.

సాయంకాలం ఐదు దాటింది.

బస్ బయల్దేరింది.

గుంటూరు చేరేసరికి తొమ్మిది దాటింది.

తులసి తెనాలి బస్ యెక్కలేదు.

నాన్ స్టాప్ బస్ యెక్కింది విజయవాడ వెళ్ళ డానికి.

పదింటికి విజయవాడ చేరింది.

బస్ స్టాండ్‌లో దిగింది.

నల్లగా పొట్టిగా వున్న వ్యక్తి ఆమె దగ్గరగా వచ్చాడు.

"మీకోసం ఆటో రెడీగా వుంది" అన్నాడు.

"ఇల్లు దగ్గరేనా?"

"కాదు. మైలు వుంటుంది."

"పద" అంది ఆమె.

అతను సూట్‌కేస్ అందుకున్నాడు.

పావుగంటలో ఆటో ఒక డాబాముందు ఆగింది.

ఆమె దిగి చుట్టూ చూసింది.

అది ప్రహరీ గోడతో ప్రత్యేకంగా వున్న డాబా! నువ్వు వచ్చేదాకా నా మనసు మనసులో లేదు"

అన్నాడు లోపల్నుంచి వచ్చిన వ్యక్తి.

"భయం ఎందుకు?"

"ఏమో నాకే తెలీదు" నన్నాడు.

"భయపడితే ఏదీ సాధించలేం" అంది ఆమె.

"నిజమే."

"మన ప్రయాణం యెప్పుడు?"

"రేపు రాత్రి యేడుగంటలకి. టికెట్స్ రిజర్వ్ చేశాను."

"సర్లే" అందామె.

స్నానం చేసిరా. బ్యారేజి రెడీగా వుంది" అన్నాడు.

ఆమె బాత్ రూమ్‌లోకి వెళ్ళింది.

## 11

తులసి అప్పుడే స్నానం చేసి ఫ్రెష్‌గా కనిపిస్తోంది.

బచ్చలిపండు జార్జెట్ చీర, అదే రంగు బ్లౌజు వేసుకుంది. చేతిగాజులు అదే రంగు. యెడమచేతికి గోల్డు కవరింగ్ చైన్‌తో వున్న వాచీ వుంది. మెడలో సన్నటి బంగారు గొలుసుంది. రెండు జడలలో ఎర్ర గులాబీలున్నాయి. నుదుట మామిడి చిగురు రంగు తిలకం మెరుస్తోంది. ముఖం పౌడర్‌తో మేకప్ చేసింది.

ఆమె చాలా సంతోషంగా వుంది. ముఖం ముద్ద మందారంలా కళకళలాడి పోతున్నది.

అతను సిమెంట్ కలర్ షర్టు, ప్యాంట్ వేసుకున్నాడు. హుందాగా కనిపిస్తున్నాడు.

ఇంటిముందు నీలం రంగు కారు ఆగివుంది.

అతను ఆమె దగ్గరగా వచ్చి "రెడీయా!" అన్నాడు.

"వూఁ...." అంది.

ఇద్దరూ వాకిట్లోకి వచ్చారు.

డ్రైవర్ డోరు తీశాడు.

కార్లోకి అడుగు పెట్టబోతున్నారు.

ఇంతలో సడన్ గా పోలీస్ వ్యాన్ వచ్చి నీలంకారు ముందు అడ్డంగా ఆగింది. బిలబిలమంటూ పోలీసులు దిగి వారిని చుట్టుముట్టారు.

"మిస్టర్ భాస్కర్! యూ ఆర్ అండర్ అరెస్టు" అన్నాడు ఇన్ స్పెక్టర్.

హెడ్ కానిస్టేబుల్ అతని చేతులకు కఫ్స్ తగిలించాడు.

భాస్కర్ వణికిపోతున్నాడు.

తులసి ముఖం ప్రేత కళ పడింది.

## 12

"సార్! నేను విన్నది కరెక్టేనా?" అంటూ హడావుడిగా రొప్పుతూ స్టేషన్ లోకి వచ్చాడు కాశీపతి.

"ఏమిటా హడావుడి?" నవ్వుతూ ప్రశ్నించాడు ఇన్ స్పెక్టర్ రామస్వామి.

"అదే సార్ మా రిప్రజెంటేటివ్ భాస్కర్ని, తులసిని అరెస్టు చేశారటగా."

"నిజమే మిస్టర్ కాశీపతి. సుబ్బారావుని హత్య చేసింది తనేనని భాస్కర్ ఒప్పుకున్నాడు. తులసి వాడికి సహకరించింది. నీ పెన్ దొంగిలించి అక్కడ పడేసింది కూడా వాడే."

"అమ్మ నా కొడుకు, నా కొంప ముంచాడు గదా సార్! ఆ తులసి వెంబడి నేను పడుతుంటే అణాకాణీ వెధవ వాడి వెంట అది పడటం ఏమిటి సార్ విచిత్రం? నాకేం అర్థంకావడంలేదు" అన్నాడు కాశీపతి.

"సినిమా గ్లామర్ నాయనా! వాడు దాన్ని సినిమా

హీరోయిన్ చేస్తానని ఆశ పెట్టాడు. అందుకు మొగుడు ఒప్పుకోలేదు. లాభం లేదని, వాడిని అడ్డు తొలగించారు. ఆ నేరం నీమీదకు నెట్టాలని ప్రయత్నించారు."

"నా మతి పోతోంది సార్! ఇదంతా మీకెలా కని పెట్టారు సార్?"

"పోలీస్ ఇన్‌స్పెక్టర్ని కాబట్టి" పకపకా నవ్వాడు రామస్వామి.

"చెప్పండి సార్! వాడిమీదకు మీ అనుమానం ఎలా వెళ్ళింది?"

"హత్య చేసింది మీరు కాదని నాకు మొదటే తెలుసు. యెందుకంటే నీ పెన్ తప్ప యే ఆధారం దొరకలేదు. కాని నీమీద కేసు పెట్టాం తప్పక.

తులసి మురుగన్ ఇంట్లో వున్నప్పుడు దానికొచ్చే లెటర్స్‌ని సెన్సార్ చేశాం. ఎవరో పేరు రాయకుండా ఉత్తరాలు రాస్తున్నాడు. ఆఖరికి దాన్ని వచ్చేయమని రాశాడు. ఫలానా రోజు, ఫలానా బస్సుకి రమ్మని.

మేము సి.ఐ.డి.ని పంపించాం తులసి వెంట. అక్కడున్నాడు మన కథానాయకుడు. వాడి దగ్గర దీని ఫోటో ఆల్బం, వగైరాలన్నీ దొరికాయి. నాలుగు తగిలిస్తే అసలు కథంతా బైట పెట్టాడు."

"థాంక్స్ ఇన్‌స్పెక్టర్! నన్ను కాపాడారు. నాకు ఉరిశిక్ష పడబోతున్నదని వూళ్ళో పెద్ద పుకారు. నా భార్య రోజూ యేడుస్తూ నా ప్రాణం తీస్తోంది సార్! మీ మేలు మరువలేను సార్!" ఇన్‌స్పెక్టర్ చేతులు పట్టుకుని వదల్లేదు కాశీపతి.

—:అయిపోయింది:—

సీరియల్

# విషసర్పాలు
# సికిందర్

(గత సంచిక తరువాయి)

అత్యవసర సమావేశంలో డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్, కమీషనరాఫ్ సిటీ పోలీస్, అసిస్టెంట్ కమీషనర్లు కొందరు, స్పెషల్ బ్రాంచి ఇన్స్పెక్టర్లు కొందరు, హత్యల ఇన్ఛార్జి తీసుకున్న డిటెక్టివ్ యిన్స్పెక్టర్లు కొందరు (కృష్ణన్‌తోసహా), పోస్టుమాష్టర్ జనరల్‌తో పాటు అడ్వకేట్ జనరల్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ కూడా వున్నారు.

సమావేశంలో అసలా కరపత్రాలెలా ప్రజలకి సరఫరా అయ్యాయన్న డి.జి.పి. ప్రశ్నకు కమీషనర్ సమాధానం చెబుతూ, ముందే వేసుకున్న ప్రణాళికతో వాటిని రాత్రి సమయంలోనే ఇళ్ళ తలుపులలోంచి వేయడం జరిగిందనీ, మళ్ళీ ఉదయం కొందరు కుర్రాళ్ళకి డబ్బులిచ్చి అన్ని పబ్లిక్ స్థలాల్లోనూ పంచిపెట్టించారని వివరించాడు.

ఆ కుర్రాళ్ళని గంటన్నరపాటు నిర్బంధించి ఎంత ప్రయత్నించినప్పటికీ ఆ ఆగంతకుల వివరాలు, ఆనవాలు

చెప్పలేదనీ — చెప్పలేకపోయారనీ అన్నాడు.

కరపత్రాలు ఎక్కడచ్చయ్యాయన్న ప్రశ్న వచ్చింది.

వాటిలో కొన్ని ఆఫ్‌సెట్‌లోనూ, కొన్ని ఫోటో టైప్ సెట్టింగ్‌లోనూ ప్రింటయ్యాయని కమీషనర్ అన్నాడు. అలాటి ప్రెస్సుల్ని ఉదయమే విచారించడం జరిగిందనీ, ఫలితం లేకపోయిందనీ అన్నాడు.

డి.జి.పి. మాట్లాడుతూ అన్నాడు, "దీన్ని మనం ఆపాలి. లేకపోతే స్మశాన వాటిక అవుతుంది మన నగరం. అప్పుడు మన అవసరం ఇక్కడ వుండదు, ఇళ్ళకు వెళ్ళిపోవచ్చు డిపార్టుమెంటును ఎత్తేసి.

జంటిల్‌మెన్, ఈ స్నేక్ సొసైటీ వాళ్ళ ప్రకటనే మతి చలించినవాడి ప్రేలాపనలా వుంది. దీని సైడ్ ఎఫెక్ట్స్ వాళ్ళు గ్రహించారో లేదో, వాళ్ళిలా రంగంలో దిగారంటే మాత్రం ఎన్నో అనర్థాలూ, అఘాయిత్యాలూ జరిగిపోతాయి. అసలు వాళ్ళ సదుద్దేశ్యానికే అర్థం లేకుండా పోతుంది. యెవరికి తెలుసు — వాళ్ళకి చేరే ఉత్తరాలన్నీ సిసలైన కేసులేనని? మీ పక్కవాడు మీమీద ఏదో కక్ష పెట్టుకుని నూడో నేమ్‌తో ఆ సొసైటీకి వ్రాస్తే మీరన్యాయంగా ప్రాణాలు విడవాల్సిందేనా?"

గదిలో ఒక్కసారి కలకలం బయలుదేరింది.

"అందుకే—" డి. జి. పి. కొనసాగించాడు, "ఈ సొసైటీ వ్యవహారాన్ని మనం త్వరగా తేల్చేయ్యాలి. వీళ్ళ ఆట కట్టించాలి. మొదట్నించీ వీళ్ళు మనకు సవాలుగానే పరిణమించారు. ఈ నాలుగైదు రోజులుగా జరుగుతున్న అమానుషాలు ఇంతకుముందెన్నడూ ఎరగం. హత్యలైతేనేమి, చావులైతేనేమి ఇంతవరకు నగరంలో

మొత్తం ముప్ఫైమూడు జరిగాయి. మానభంగాలు నాలుగు జరిగాయి. ఇవిలా జరగడానికి వీల్లేదు! ఆ గ్యాంగ్‌ని మనం వీలయినంత త్వరగా పట్టుకుని ధ్వంసం చేయాలి!"

"సర్, మన తక్షణ కర్తవ్యం ఆ సొసైటీకి ప్రజల నుంచి ఏ ఉత్తరం చేరకుండా చూడడం!" అన్నాడు కమిషనర్.

"అవును, సిటీలో అన్ని పోస్టాఫీసుల్లోనూ స్నేక్ సొసైటీ పేరుమీద వచ్చే ఉత్తరాలకోసం ఎలర్టుగా ఉండమని హెచ్చరించాలి. అలాటి ఉత్తరాల్ని సార్టింగ్ చేసి ప్రక్కన పడేయాలి...." అని పోస్టు మాస్టర్ జనరల్ వైపు చూశాడు. డి.జి.పి.

"అలాగే, నేనలా ఆర్డర్స్ పాస్ చేస్తాను. అయితే ప్రతీ పోస్టాఫీసుకీ అప్పుడు రక్షణ అవసరం. దాడులు జరిగే అవకాశముండొచ్చు...." అన్నాడు పోస్టుమాస్టర్ జనరల్.

"ఆల్ రైట్, అన్ని పోస్టాఫీసులవద్దా ఆర్మ్‌డ్ రిజర్వ్ గార్డు చేస్తుంది...."

"అలాటి లెటర్స్ అన్నింటినీ డి.ఎల్.ఓ.కి పంపించమంటారా?"

"నో, వాటిని మాకు పంపండి. కానీ ఇది మనమనుకున్నంత సులభమా? నాకో అనుమానం కలుగుతోంది."

"ఏమిటి?" కమీషనర్ అడిగాడు.

"వాళ్ళు చిరునామా ఇచ్చి ఆ ఇంటిని ఖాళీగా వుంచడం యే ఉద్దేశ్యంతో చేశారు? వాళ్ళకు కచ్చితంగా తెలిసి వుండాలి. కరపత్రాలు సర్క్యులేట్ అయిన ఆ మరుక్షణంలో ఆ యింటిమీద మనం రెయిడ్ చేస్తామనీ, గార్డ్ చేస్తామనీ, అప్పుడా ఉత్తరాలు వాళ్ళ

కంటే అవకాశముండదనీ...."

"అడ్వకేట్ జనరల్ తల విదిలించాడు. "బహుశ వాళ్ళ ఉద్దేశ్యం ఇదయ్యుండాలి — పోస్టుమాస్టర్ జనరల్ గారన్నట్లు దాడులు జరపడం. అప్పుడు తమ ఉత్తరాల్ని గుర్తుపట్టేందుకు యేదో ఒక అడ్రసు కావాలిగా?"

"అలాంటప్పుడు ఇల్లు తీసుకోవడ మెందుకు?" అన్నాడు డి.జి.పి. "నిజం అడ్రసు ఇవ్వడ మెందుకు? యేదో ఫిక్టీషస్ అడ్రసిస్తే సరిపోతుందిగా?"

"సరిపోతుంది — అంత వివరంగా అడ్రసివ్వకుండా కేవలం స్నేక్ సొసైటీ హైద్రాబాద్ అన్నా సరిపోతుంది వాళ్ళకు - తమ ఉత్తరాల్ని గురించి దోచుకునేందుకు. కానీ వాళ్ళంతా అమెచూరిష్‌గా తీసుకోవడం లేదీ వ్యవహారాన్ని. ప్రజలకి తమ నిజాయితీ నిరూపించుకునే ఉద్దేశ్యంతో అద్దె యిల్లు తీసుకుని—నిజం అడ్రసివ్వడంలో ఆశ్చర్యంలేదు. అంతేకాదు, ఆ ఉత్తరాలకోసం పోస్టాఫీసులమీద దాడులు జరపడం కూడా ప్రమాదకరమని వాళ్ళకు తెలిసివుండాలని నాకిప్పుడనిపిస్తోంది.."

"మరింకేం చేస్తారు?"

అడ్వకేట్ జనరల్ చెప్పాడు. "పోస్టల్ ఉద్యోగులతోడ్పాటుతో ఏదైనా జరుగవచ్చనిపిస్తోంది...."

"అంటే?"

"మెయిల్ సార్టర్స్ వాళ్ళతో చేతులు కలిపారంటే అంతా సులభం!"

"ఓహ్...." పోస్టల్స్ అధికారి ఉలిక్కిపడ్డాడు.

వెంటనే కమీషనర్ అందుకున్నాడు, "అలా జరుగుతుందనుకోను, కానీ జాగ్రత్తకోసం ఒక యేర్పాటు

చేయవచ్చు... ప్రతీ పోస్టాఫీసులోనూ మన స్పెషల్ బ్రాంచి మనిషిని ప్లాంట్ చేసేందుకు పి.యమ్.జి. గారు అనుమతి నే బాగుంటుంది."

"అయాం రెడీ!"

"థాంక్యూ."

"ఇప్పుడు—" అడ్వకేట్ జనరల్ నోరు విప్పాడు, "అసలీ రిస్కులన్నింటికంటే, ఉత్తరాలు పోస్టాఫీసుకి చేరే ప్రశ్నే లేకుండా చేసే మార్గమొకటివుంది...."

"ఏమిటది?" డి.జి.పి. అడిగాడు కుతూహలంగా.

"ఎవరూ ఉత్తరాలు రాయకుండా నిరోధించాలి."

"అదెలా?"

"స్నేక్ సొసైటీకి అలా ఉత్తరాలు రాసేవాళ్ళు ఆ తరువాత తలెత్తే పరిణామాలకి పూర్తి బాధ్యత తామే వహించాల్సి వుంటోంది.... సర్, అలా ఉత్తరాలు వ్రాయడం హత్యకు ఆదేశించడమే. ఇది చట్టరీత్యా నేరం. శిక్షార్హులౌతారు. దీని ఉల్లంఘన ద్వారా హత్య జరిగిపోతే, అప్పుడా హతుని పూర్వ సంబంధాలన్నీ పరిశీలించబడతాయి."

"వెల్, తర్వాత?"

"అప్పుడా లేఖకురాలు యాంత్రికంగా పట్టుబడి పోతుంది. ప్రాసిక్యూషన్ జరుగుతుంది."

"వెల్, బాగుంది. కానీ పూర్వ సంబంధాల్ని యెలా పరిశీలిస్తారు?"

"సింపుల్. ఈ స్నేక్ సొసైటీ న్యూసెన్స్ వల్ల యెవరైతే తమ ప్రాణాలకి హానివుందని తోస్తుందో, వాళ్ళకు ఆ హానిని కల్గించే లేఖకురాలెవరో తెలిసే వుంటుంది గాబట్టి, ఆమె పూర్తి పేరు వివరాలూ తెలియ

పరుస్తూ ఒక సీల్డు కవరుని దగ్గర్లోని పోలీస్ స్టేషన్‌లో అందిస్తే చాలు. అప్పుడతనికేదైనా సంభవిస్తే ఆమె ఇట్టే దొరికిపోతుంది...."

కాన్ఫరెన్సులో మళ్ళీ గుసగుసలు బయిలుదేరాయి. అందరూ తమ ఆమోదాన్ని తెలిపారు."

"వెరీ వెల్, బాగుంది" అన్నాడు డి.జి.పి.

"ఉత్తరాలు వ్రాసే వాళ్ళకిలాంటి భయం కల్గిస్తే, వాళ్ళ జోలికి పోరు." అన్నాడు అడ్వకేట్ జనరల్

"కానీ ఈ పాటికి రాసేశారేమో?"

"వ్రాసివుంటే మన స్వాధీనమవుతాయి. కనీసం రేపటినుంచి ఆపవచ్చు."

"ఆల్ రైట్—వెంటనే ఇది బ్రాడ్ కాస్టు చేయించాలి, ఈవెనింగర్స్‌కి ప్రెస్ నోట్ రిలీజ్ చేయాలి—ఈ హెచ్చరిక! సొసైటీకి ఉత్తరాలు రాసేవారు తమ అంతాన్ని తామే కోరి తెచ్చుకుంటారు!"

"ఆ తర్వాత—" అడ్వకేట్ జనరల్ అన్నాడు, "ముఖ్యంగా ఈ సుహాసిని ఫోటో మరోసారి అన్ని పత్రికల్లో ప్రచురించాలి. వాల్ పోస్టర్స్ పెద్దు మొద లైనవి విరివిగా ప్రచురిస్తే హంతకురాలెవరో బాగా తెలుస్తుంది ప్రజలకి—వాళ్ళు జాగ్రత్త పడడానికీ—వీలయితే ఆమెను పట్టివ్వడానికీ."

"దటీజ్ రైట్, ఆ పనికూడా చేస్తాం."

"ఇక మరొకటుంది—సైడ్ ఎఫెక్టు. ఈ సొసైటీ మొత్తం స్కీమూ బ్యాక్ ఫైరయ్యే అవకాశముంది, జంటిల్ మెన్. యెలాగంటే, హతులు కాబోయే వాళ్ళకి బదులు ఉత్తరాలు రాయబోయేవాళ్ళే ప్రాణాలు పోగొట్టుకోవచ్చు. తాము వంచించిన మనిషి సొసైటీకి

తనమీద ఉత్తరం వ్రాస్తుందన్న భయంతో ముందే జాగ్రత్తపడవచ్చు అంచనుడు. ఆమెను నిర్దాక్షిణ్యంగా చంపివేయవచ్చు."

"గాడ్! అవును—"

"లేదా ఉత్తరం వ్రాస్తానని అంచనుడ్ని అంచనురాలే బెదిరించవచ్చు. బ్లాక్ మెయిల్ చేయవచ్చు. ఈ బ్లాక్ మెయిల్ వాళ్ళ ప్రేమ సాఫల్యతకైతే ఫరవాలేదు. మరేదో దురుద్దేశ్యంతో—ధనాశతో జరిగితే మాత్రం అరాచకాలు మొదలవుతాయి, జంటిల్ మెన్."

"ఆపండి, అలాటివి మనం పసిగట్టి నివారించలేం. కనీసం ఈ సొసైటీవల్ల వచ్చే అపాయాన్ని నిరోధించగల్గాలి. వాళ్ళకి ఉత్తరాలు అందకూడదు, ఇదొక్కటే మార్గం. దీనిమీదే మనం గట్టిగా కృషి చేయాలి. ఇంకో వైపు శత్రువుల్ని ట్రేస్ చేయాలి...."

సమావేశం ముగిసింది.

సరిగ్గా ఆ సమయంలోనే నగరంలోని అనేక ప్రాంతాలలో స్ట్రీట్ పోస్టు బాక్సులు క్లియరెన్స్ టైముకంటే ముందే తెరుచుకోసాగాయి....

తెరుస్తున్న వాళ్ళు మాత్రం పోస్టల్ డిపార్టుమెంటుకి చెందినవాళ్ళు కారు. కానీ అలాటి యూనిఫారాల్లోనే వున్నారు.

అప్పటికి కరపత్రాలు విడుదలై కొన్ని గంటలే అయింది కాబట్టి, మొదటిసారి యెక్కువ సంఖ్యలో ఉత్తరాలు సంగ్రహించలేకపోయారు, ఆ పోస్టల్ డిపార్టుమెంట్ కాని డిపార్టుమెంట్ వాళ్ళు.

• • •

శాలానగర్ యిండస్ట్రియల్ ఎస్టేట్‌లో లాబ్

కెమికల్స్ తయారుచేసే ప్లాంట్ గల సేఠ్ చిమన్ భాయ్ తన ఏర్ కండిషన్డ్ ఆఫీసులో ఫైళ్ళని చూస్తూ గడుపుతున్నప్పుడు, హఠాత్తుగా ఫోన్ మోగి అతడి ఏకాగ్రతకి భంగం కల్గించింది.

అతను విసుగ్గా రిసీవరెత్తి రెస్పాన్స్ ఇచ్చాడు.

ఒక కరుకైన గొంతు పలికిందవతలనుంచి. "మిష్టర్ చిమన్ భాయ్, నేను మోహినిని మాట్లాడుతున్నాను."

"అతను ముఖం చిట్లించాడు, "మోహిని? యే మోహిని?...."

"నన్ను మర్చిపోయావా?"

"ఎవర్నువ్వు?"

"ఓహ్, నీకెక్కడ గుర్తుంటుంది, చిమన్ భాయ్. ఎందర్నని గుర్తుపెట్టుకుంటావ్. నాలాటి వాళ్లు ఎందరో నీ జీవితంలో. కానీ నీలాటివాడు నువ్వొక్కడివే నా జీవితంలో. ఆనాడు ఉద్యోగంకోసం గత్యంతరంలేక నీ పాపిష్టి చేతుల్లో మలినమైనప్పట్నించీ ఆలోచిస్తున్నాను, నీమీద పగతీర్చుకునే మార్గంకోసం...."

అతనప్పుడు ఉలిక్కిపడ్డాడు. అతనికేదో గుర్తొచ్చింది.

"ఓహ్....అయితే నువ్వా! యేమిటి....యేమిటి బెదిరిస్తున్నావ్?"

"నాకు అయిదు లక్షలు కావాలి."

"ఏమిటీ!"

"అయిదు లక్షలు కావాలి, చిమన్ భాయ్."

"దేనికి?"

"నీ ప్రాణాలు నిలబెట్టుకోడానికి."

"వాటికేమయింది?"

"మూర్ఖుడా, స్నేక్ సొసైటీ గురించి వినలేదా?"

"ఓహ్...." అతను అదిరిపడ్డాడు, ముఖం ఎర్రబడి పోయింది. "హలో....హలో! ఏమిటి....ఏమిటి నువ్వనేది!"

"స్నేక్ సొసైటీకి ఉత్తరం రాద్దామనుకుంటున్నాను" అందవతలి గొంతు నింపాదిగా, "నువ్వు డబ్బివ్వకపోతేనే."

అతను బిగుసుకుపోయాడు. ఉద్రేకంగా ఆలోచించాడు. అప్పుడు తేలికపడి తేరుకున్నాడు. ఫకాలున నవ్వి చెప్పాడు. "చూడు బేబీ, నీ ఆటలు కట్టిపెట్టు. యూ ఆర్ ఫూలిష్. ఆ సొసైటీ, వాళ్ళ ప్రకటనలూ అంతా నాన్సెన్స్. నేను డబ్బివ్వను. ఉత్తరం వ్రాసుకో ఫో! నీలాటివాళ్ళు చాలామంది వున్నారు నాకు. నన్నెలా రక్షించుకోవాలో నాకు బాగా తెలుసు!"

అతనింకోసారి నవ్వి, ఫోన్ పెట్టేశాడు. పొరబడ్డాడని అతనికి తెలియదు.

* • •

"హలో....సుబ్రమణ్యన్ భాయ్, వడక్కం!"

"వడక్కం!"

"సుబ్రమణ్యన్ భాయ్, నా చెల్లెలు అనిత తరఫున మాట్లాడుతున్నాను."

"ఏం మాట్లాడుతున్నావూ....?"

"నాకిప్పుడే తెలిసింది, నువ్వామెని అల్లరిపెట్టావట గా?"

"ఏమిటి?—హలో—ఎవర్నువ్వు?"

"నా పేరనవసరం, అనిత అన్నని. నువ్వామెని అల్లరిపెట్టింది నిజమా కాదా చెప్పు."

"నీ చెల్లెలు అనితను....అల్లరి పెట్టానా...."

"అవును, సుబ్రమణ్యాన్ భాయ్, నువ్వు కార్లో వస్తూ కాలేజి దగ్గర ఆమెకు లిఫ్ట్ ఇచ్చి వెకిలి పనులు చేశావ్, పదిహేను రోజుల క్రితం. నువ్వేదో పెద్దమనిషనుకుని పొరబడిందట ఆమె....అప్పుడు కేకలు వేయబోతే నువ్వు దింపేసి పారిపోయావు...."

"ఓహ్....నువ్వు..నువ్వు నన్నెలా కనుక్కున్నావ్?"

"అది అనవసరం. నువ్వు తప్పు ఒప్పుకుంటున్నావు కాబట్టి ఇప్పుడు శిక్ష గురించి మాట్లాడుకుందాం. చెప్పు, ఏ శిక్ష కావాలి నీకు—డబ్బిస్తావా? చస్తావా?

"ఏమిటి....ఏమిటీ....!!"

"ఉదయం కరపత్రాలు చూశావా?"

"చూశాను....చూశాను...."

"చెప్పు, యేం చేయమంటావ్?"

"అయ్యో, ఉత్తరం వ్రాయవద్దు!"

"ఎంతిస్తావ్ డబ్బు?"

"ఎంత కావాలి...."

"మూడు లక్షలు, సుబ్రమణ్యాన్ భాయ్, త్రీ లాక్స్."

"అంత ఇచ్చుకోలేను....అంత ఇచ్చుకోలేను...మూడు వేలు."

"అయితే నీకు మూడుతుంది."

"అయ్యో....ఆ పని చేయకు! నా మాట విను.... ఆరు వేలు."

"సరే, ఉత్తరం వ్రాయమంటాను."

"లక్ష తీసుకో, బేటా!"

"నీ ప్రాణం విలువ నేను కడతాను, సుబ్రమణ్యాన్ భాయ్."

"రామరామ! శివశివా!....మూడు లక్షలు క్షవరమా!

పాడు బుద్ధి మనది.... పోదుపుడు కలలతో గాని ఇది.... అలాగే తీసుకో!"

"సిద్ధం చెయ్, రాత్రి ఇంటికొస్తాను."

"వచ్చేయ్! వచ్చేయ్! ఉత్తరం వ్రాయొద్దమ్మోయ్!"

"వడక్కం, సుబ్రమణ్యన్ భాయ్!"

"వడక్కం.... వడక్కం...."

ఠపీమని ఫోన్ పడేసి పడిపోయాడు సుబ్రమణ్యన్ భాయ్, నగరంలో నామోషీ ఎరుగని నగల వ్యాపారి.

• • •

ఆఫీసుకు తిరిగివచ్చి జాన్, ఫోన్‌లో కృష్ణతో మాట్లాడి, తీవ్రంగా ఆలోచనలో పడ్డాడు. ఇప్పుడతనికి సరయిన మూడ్ వచ్చింది. నిరుత్సాహం మాయమైంది. ఆ కత్తులకి కట్టివున్న లేబుల్స్‌మీద దస్తూరీ సుహాసిని దేనని ధృవపడినట్లు చెప్పాడు కృష్ణన్. ఆమె ఇంట్లో ఆమె నోట్స్‌ని పరిశీలించాక ఇది వెల్లడించాడట ఎక్స్‌పర్టు.

జాన్, ప్రకాష్‌నగర్‌లో స్నేక్ సొసైటీ అద్దెకి తీసుకున్న మేడ గురించి అడిగాడు. అక్కడ మఫ్టీల్నించి పనికొచ్చే సమాచారమేదీ అందలేదన్నాడు కృష్ణన్. ఆ ఇంటికి ఇప్పటివరకు యెవరూ రాలేదు. ఆ ఇంటికి తాళం అద్దెకి తీసుకున్న పెద్దమనిషే వేసుకు వెళ్ళాడు. ఆ ఇంటి యజమానిద్వారా ఆ పెద్దమనిషి ఆనవాలు స్పష్టంగా తెలియలేదు.

అప్పుడు జాన్, ఆ పెద్దమనిషి ఆ ఇంటి యజమానిని యెలా కాంటాక్టు చేశాడని అడిగాడు. ఒక యెస్టేట్ ఏజెంట్ ద్వారా అని చెప్పాడు కృష్ణన్. ఆ యేజెంట్

గురించి అడిగినప్పుడు, వెంటనే కలుసుకుని చెప్తానన్నాడు కృష్ణన్.

ఫోన్ పెట్టేసి జాన్ ఆలోచనలో పడ్డాడు.

* * *

తలుపు తెరిచి జింబో, నవ్వుతూ చూశాడు లాల్ ని.

"గుడ్ ప్రోగ్రెస్, సర్. మా సోషల్ వర్క్ ఎటువంటి అంతరాయం లేకుండా జరిగిపోతోంది...."

లోపలికొచ్చి, చేతిలో ట్రేని టేబుల్ పైన వుంచి, చేతులు కట్టుకుని నిలబడ్డాడు. లాల్ అతన్ని సూటిగా చూశాడు. అతనలాగే నవ్వుతున్నాడు.

"ఇంకేమేం జరిగాయి?" అడిగాడు లాల్, అలాగే పడుకుని చూస్తూ.

"నిన్న రాత్రి జరిగిన అయిదు వధింపులు పేపర్లో చూశారుగా, సర్?"

"చూశాను. బాగానే వధించారు."

"వధించింది సర్, సుహాసినీ దేవి. మీరా కరపత్రం చూశారనుకుంటాను?"

"చూశాను. భాష చండాలంగా వుంది."

నవ్వాడు జింబో. "గుడ్ రెస్పాన్స్, సర్. అప్పుడే మాకు మూడువందల ఇరవై నాలుగు ఉత్తరాలందాయి."

లాల్ కళ్ళు చిన్నగా యెగిరిపడ్డాయి. "యెలా అందాయి?"

"మా పద్ధతులు మావి, సర్" మళ్ళీ నవ్వాడు జింబో, "ఆ ఉత్తరాలతో పెద్ద లిస్టు తయారు చేస్తున్నాం, సర్. ఈ రాత్రినుంచే మొదలవుతుంది ఆపరేషన్ ఎరాడికేషన్."

"ఆపరేషన్ ఎరాడికేషన్?"

"అప్రాచ్యులు ఏరివేత?"

"ఓహ్..." లాల్ ఆందోళనగా అన్నాడు.

"ఫలహారం తీసుకోండి, సర్. చల్లారిపోతోంది...."

లాల్ ట్రేలోకి చూసి, అప్పుడే ఏదో నిర్ణయించు కున్నట్లు చటుక్కున జింబో వైపు తిరిగాడు. ముఖంలో ఆతృతని అణచుకున్నాడు. "ఈ గొలుసు విప్పు, జింబో" అన్నాడు అతి మామూలుగా.

"ఎందుకు, సర్?"

"బాత్ రూం" అన్నాడు లాల్, లేచి కూర్చుంటూ.

"ఓహ్.. ఓకే....ఒక్క క్షణం, సర్...." జింబో తలుపు దగ్గరికి కదిలాడు. అక్కడాగి బయటికి తొంగి చూస్తూ పిలిచాడు, "సంతోష్! సంతోష్! ఇలా వచ్చే య్యమ్మా."

దబదబమని యెవరో పరుగెత్తుకొస్తున్న చప్పుడు.

"ఏమిటి, జింబో?"

"బాత్ రూం తీసికెళ్ళాలి గెస్టుని ..." జింబో జేబు లోంచి ఒక తాళంచెవి తీసిస్తూ అన్నాడు, "ఆ తాళం తియ్....నీ జేబులో గొట్టం ఏదీ, ఇలా ఇవ్వు."

"సంతోష్ రివాల్వర్ తీసిచ్చి, తాళంచెవి తీసు కున్నాడు.

వాళ్ళిద్దరు లోపలికి కదిలారు.

లాల్ గాఢంగా వూపిరి తీసుకుని వదిలాడు.

సంతోష్ కింద కూర్చుని తాళం తీస్తోంటే, జింబో, లాల్ కి రివాల్వర్ గురిపెట్టి నిల్చున్నాడు. అప్పుడతని ముఖంలో అదివరకటి స్నేహభావం లేదు.

కాట్ నుంచి గొలుసుని వేరుచేశాక దాన్ని లాల్

కాలుతో చుట్టాడు సంతోష్.

"ఓ.కే. సర్. ఇక పదండి" అన్నాడు జింబో, ప్రక్కకొస్తూ.

లాల్ లేచి కింద నిలబడ్డాడు. రెండడుగులు వేసి తూలి మళ్ళీ నిలదొక్కుకున్నాడు. ఇంకో రెండడుగులు జాగ్రత్తగా వేశాడు, కంటి చివరలనుంచి వాళ్ళని గమనించడానికి ప్రయత్నిస్తూ. వాళ్ళిద్దరూ పూర్తిగా వెనుక వున్నారు. అప్పుడు జింబో చేతిలో రివాల్వర్ లాల్ మెడకి ఆనింది చల్లగా. లాల్ భుజాలు ఎగిరిపడ్డాయి.

"జింబో.... నాకు నడక కష్టంగా వుంది.... నేను తూలితే త్వరపడి పేల్చేసేవు!"

జింబో ఇంకా నొక్కాడు రివాల్వర్ని "అలా జరుగదు, సర్."

లాల్ మళ్ళీ తూలాడు అడుగులేస్తూ.

"జాగ్రత్త, సర్ .... జాగ్రత్తగా చూసి తలుపు దాటండి, కింద గడప తగులుంది." జింబో చెపుతూ అడుగులేస్తున్నాడు. పక్కన సంతోష్ తాపీగా నడుస్తున్నాడు.

అప్పుడు మళ్ళీ తూలాడు లాల్, గడప దాటుతూ. సంతోష్ తటాలున వెళ్ళి పట్టుకోబోయాడు. లాల్ వంగి అతన్ని వెనక్కి తోసేస్తూ బయటికి దూకేశాడు. జింబో గట్టి కేకతో ట్రిగ్గర్ లాగేశాడు. లాల్ ధడాలున తలుపులు లాగి మూసేస్తుంటే మళ్ళీ మళ్ళీ లాగేశాడు.... క్లిక్! క్లిక్! క్లిక్!....అంతే.

"ఓహ్, అది లోడ్ చేయడం మర్చిపోయాను, జింబో!" కిందపడ్డ సంతోష్ గొంతు చించుకుని అరిచాడు.

తలుపులు పూర్తిగా మూసుకుని, బయట గొళ్ళెం పడిపోయిందప్పుడే.

• • •

"బ్యాక్ యూ గో!" అన్నాడతను, రివాల్వర్ గురిపెడుతూ.

"లాల్ చేతులెత్తేసి, రెప్పవేయకుండా చూడసాగాడతన్ని.

"బ్యాక్ టు ది రూం, ఐ సే!" గర్జించాడా మనిషి మళ్ళీ పళ్ళు బిగిస్తూ.

విపరీతంగా శబ్దం చేస్తోందా గది తలుపు.

ఒకటే అరుపులు విన్పిస్తున్నాయి లోపలినుంచి.

లాల్ ఓమారు ముందుకూ వెనక్కీ చూశాడు. ఆ పొడవాటి నడవలో ఇంకెవరూ లేరు. యెదుట నిలబడి వున్న మనిషిని మొదటిసారిగా ఇప్పుడే చూస్తున్నాడు. భారీగా, యెత్తుగా, కుడి చెంపమీద కురుపుతో వున్నాడు. వెడల్పాటి కర్కశమైన ముఖం. చేతిలో రివాల్వర్ అతడి కర్కశత్వాన్ని మరింతగా పెంచింది.

అతను నాలుగడుగుల దూరంలోనే వున్నాడు.

ఏ కొంచెం మొరటుగా కదిలినా కాల్చేసేలా వున్నాడు.

లాల్ గదిలోంచి బయటపడి గొళ్ళెం పెడుతూండగానే అతను అవతలి గదిలోంచి ప్రత్యక్షమయ్యాడు.

లాల్ ముఖం నిస్సహాయత ఆవరించుకుంది.

అతడలాగే చేతులెత్తిపెట్టి, కిమ్మనకుండా వెనక్కి తిరిగాడు. అప్పుడు వెనకనుంచి అడుగులు దగ్గరవుతూ ఒక్కసారి రివాల్వర్ మజిల్ మెడకి తగిలింది చల్లగా. లాల్ వూపిరి పీల్చాడు. తలమీద దెబ్బ పడలేదు!

"కమాన్, బ్యాక్ టు ది రూం!" మరో గర్జన.

"లాల్ మౌనంగా నడిచాడు గది దగ్గరికి.

"ఓపెన్ ది డోర్!"

లాల్ గొళ్ళెం తీసేశాడు. ఆ వెంటనే తలుపుల్ని తటాలున తెరచుకుని వాళ్ళిద్దరు బయటికొచ్చేశారు. వగరుస్తూ.

వెనకనుంచి లాల్ లోపలకు తోయబడ్డాడు. తక్షణం తలుపులు మూసుకున్నాయి.

"బాస్టర్డ్స్! మీకు మెదడుందా? చంపేస్తాను మిమ్మల్నిద్దర్నీ—" నిప్పులు కురిపించాడా మనిషి వాళ్ళిద్దర్నీ చూస్తూ, "ఏం జరిగింది ఫూల్స్? ఏం చేశారిద్దరూ కలిసి?"

జింబో తేరుకున్నాడు. సంతోష్ని కోపంగా చూసి ఒక్క కేక వేశాడు, "నే నేం చేయాలి? ఈ పండు కోతి గుళ్ళులేని గొట్టం ఇచ్చాడు నా చేతికి!"

సంతోష్ మండిపడి అతనిమీద కురిశాడు, "నేను కావాలని ఇచ్చానా, నల్లకోతీ! అసలు నీ గొట్టం ఏమైంది?"

"షటప్, యూ ఫూల్స్! మాటలు తిన్నగా వాగండి! మీ తలల్లో పేడ వుంటే గొట్టంలో గుళ్ళెలా వుంటాయి? థాంక్ గాడ్, ఆ డిటెక్టివ్ బయటపడితే మన ఆపరేషన్ గల్లంతయ్యేది! మీవీ నాదీ తోళ్ళు వొలిచి యాసిడ్లో పడేసేవాడు బాస్! జాగ్రత్తగా వుండండి, బ్లడీ ఫూల్స్, జాగ్రత్తగా వుండండి!" అరిచి, పెద్ద పెద్ద అంగలేసుకుంటూ కొంత దూరం వెళ్ళి మళ్ళీ తిరిగాడతను, "యూ డమ్మీస్, లాక్ ది డోర్! అండ్ కమ్ విత్ మీ!"

వాళ్ళిద్దరు తేరుకుని గదికి తాళం వేసేశారు. గబగబా

అనుసరించారు శంభూనాథ్‌ని.

"నన్ను నల్లకోతి అంటావా?"

"మరి నేను పండుకోతినా?"

"అవును, నేనలాగే పిలుస్తాను!"

"నువ్వూ అలాగే పిలిపించుకో!"

"నోర్మూయ్యండి, కోతుల్లారా! కాల్చిపారేస్తాను లేకపోతే!"

వాళ్ళు నోర్మూసుకుని నడిచారు.

కాలికి గొలుసుతో గదిలో స్వేచ్ఛగా వదిలివేయబడ్డ లాల్, కాట్ మీద కూర్చుని అక్కడున్న తాళాన్నీ, తన కాలికి గొలుసునీ పదేపదే చూసుకుని, చిన్నగా భుజాలెగరేసి, గొలుసుని కాట్ కోడుకి చుట్టి తాళం వేసేసి, తాళం చెవిని పరుపుకింద పెట్టుకుని, గమ్మున పడుకున్నాడు.

• • •

ఆ సాయంకాలం సంచలనం రేపాయి పత్రికలు—

సుహాసిని ఫోటోలతో, ఆమె వేటకి గురికాబోయే వాళ్ళకి హెచ్చరికలతో, వాళ్ళ రక్షణకు పోలీసులు తీసుకుంటున్న జాగ్రత్తలతో, స్నేక్ సొసైటీకి పోస్టయిన ఉత్తరాల్ని స్వాధీనం చేసుకున్న వివరాలతో నిండిపోయాయి—

ఉత్తరాలు వ్రాసిన అనేకమంది, పత్రికల్లో పోలీసుల సూచనలు చూసి బెదిరిపోయారు. తమ వివరాలు తాము చంపించబోతున్న వ్యక్తులే పోలీసులకి అందించగలరనేసరికి వాళ్ళలో భయం పుట్టుకొచ్చింది. కానీ తర్వాత ఆ ఉత్తరాలు పోలీసుల స్వాధీనమయ్యాయనేసరికి తేలికపడ్డారు — అవి సొసైటీకి చేరలేదు, బ్రతికాం అను

కున్నారు.

వాళ్ళిప్పుడు పూర్తిగా పారబడ్డారు.

వాళ్ళతో పాటు పోలీసులు కూడా.

పోలీసులతో పాటు వేటకు గురికాబోయే వాళ్ళు కూడా.

తాము పోలీసులకి వివరాలందిస్తామనే భయంతో సొసైటీకి ఇక యెవరూ ఉత్తరాలు వ్రాయరనుకుంటున్నారు వాళ్ళు. ఇది నిజమే. అయితే సొసైటీకి ఇప్పటికే మూడువందలపైచిలుకు ఉత్తరాలందిపోయాయని తెలియదు వాళ్ళకు. వాటన్నిటినీ పోలీసులు స్వాధీనపర్చుకున్నారనే భ్రమతోనే వున్నారువాళ్ళంతా.

పోలీసులు కూడా తమకు దొరికిన ఆ ముప్పైరెండు ఉత్తరాలే మొత్తం పోస్టయిన ఉత్తరాలనుకుంటున్నారు.

ఇలా వుండగా సాయంత్రం ఆరుగంటలకి ఫోన్ వచ్చింది జాన్‌కి, కృష్ణన్ నుంచి. అతను కోరిన ఎస్టేట్ ఏజెంట్ వివరాలందించాడు.

జాన్ అడ్రసు తీసుకుని వెళ్ళాడు ఏజెంట్ కోసం. అబిడ్స్‌లోని రెండతస్తుల బిల్డింగ్‌లో పైన వుందతని ఆఫీసు. ఆ ఏజెంట్ తనదగ్గరకొచ్చిన 'పెద్దమనిషి'ని వర్ణించి, అతను వారంక్రితమే తనవద్దకొచ్చి ఒక మంచి బంగళాను చూసిపెట్టమని కోరినట్టు చెప్పాడు. ఫీజు కూడా అప్పుడే చెల్లించాడు. ఆ మనిషికి ఇల్లు దొరికితే తనని కాంటాక్టు చేయడానికి ఫోన్ నెంబర్ కూడా ఇచ్చి వెళ్ళాడు. ఆ నెంబర్ చెప్పాడు ఏజెంట్.

జాన్ దాన్ని వెంటనే కృష్ణకి పాస్ చేశాడు.

అప్పటికి చీకటి పడిపోయింది ...

ఆ సమయంలో పోస్టల్ డిపార్టుమెంట్ కాని

డిపార్టుమెంట్ వాళ్ళు మరో రెండు పూర్తిచేశారు.

సాయంకాలం లాస్టు క్లియరెన్స్ తర్వాత, పత్రికలు వెలువడడానికి ముందూ, పోస్టయిన మరికొన్ని ఉత్తరాలు వాళ్ళ హస్తగతమయ్యాయి.

అవన్నీ పోలీసుల స్వాధీనమయ్యాయనుకుంటున్నారు లేఖకరాళ్ళు

• • •

ఆ కారు వేగంగా పరుగెడుతోంది నగరవీధుల్లో...

అది వైట్ అంబాసిడర్.

సమయం అర్థరాత్రి దాటింది, డ్రైవ్ చేస్తున్న ఆమెలో యెలాంటి తొందరపాటు, భయాందోళనలు లేవు. వెనుక చూపుల్లేవు. ఆమె తాపీగా డ్రైవ్ చేస్తోంది. ఆమె దృక్కులు తిన్నగా రోడ్డుమీద వున్నాయి. ఆ కళ్ళలో దృఢనిశ్చయం, పరిణామాలపట్ల నిర్లిప్తతా స్పష్టంగా ద్యోతకమవుతున్నాయి....ఆమె ముఖం ఏ భావాలూ ప్రతిఫలించని శిలలా వుంది. తనదైన ఒకేఒక్క లక్ష్యంతో గమ్యానికి ఆమె సాగిపోతోంది.. ఆమెకే అడ్డంకులూ లేవు.

కారుని ఖైరతాబాదులోని ఓ విశాలమైన వీధిలోకి తిప్పి ఆపింది. నిదానంగా దిగి, హేండ్ బ్యాగ్ తీసుకుని చకచక నడవసాగింది. అప్పుడామె తెల్లని దుస్తులు, వదులు జడ, బోసిగా వున్న మెడ, చేతులు, బొట్టులేని నుదురు, నడకతీరూ, హావభావాల్నీ చూస్తే — అంత రాత్రి యెవరైనా ఇట్టే జడుసుకుంటారు.

ఆమె ఒక మేడ ముందుకెళ్ళి తక్కున ఆగిపోయింది. గూర్ఖా గేటు అవతలనుంచి తొంగిచూశాడు. సాబ్ హై? ఆమె ప్రశ్న. అతను వున్నట్లు తలూపాడు. ఆమె బ్యాగు

లోంచి కర్చీఫ్ తీసి అతని ముక్కుకు పెట్టింది. అతను తల తిరిగి కిందపడ్డాడు. ఆమె గేటు తీసుకుని లోపలికి నడిచింది.

గబగబా వెళ్ళి, పార్టికోలోంచి వరండా ఎక్కి బెల్ నొక్కింది.

ఇల్లంతా చీకటిగా, చడీ చప్పుడు లేకుండా వుంది.

లోపలెక్కడో మోగింది బెల్.

సమాధానం రాలేదు.

ఆమె మళ్ళీ నొక్కింది.

అప్పుడు అడుగులు విన్పించాయి. తలుపు తెరచుకుంది.

అతను కలవరంగా చూశాడామెని. "యెవరు ... యెవరు? యెవరు కావాలి?"

ఆమె చొరవగా లోపలికెళ్ళిపోయింది.

"సేట్ చిమన్ భాయ్, నన్ను గుర్తుపట్టలేదా?" అడిగిందామె, అతని ముఖంలోకి తీక్షణంగా చూస్తూ.

అతను భయపడి ముఖం తిప్పుకున్నాడు.

"ఎవరు? నువ్వు....నువ్వెవరు?"

"నా ఫోటో పత్రికల్లో వచ్చింది."

అతను వెనక్కి జరిగిపోయాడు నోరు తెరుస్తూ, "సుహాసినీ!?"

"అవును. ఇక ఎందుకొచ్చానో వూహించగలవు. మోహినీ యామినీ నీ మీద ఉత్తరాలు వ్రాశారు."

"గాడ్!" అతను గుండెలు పట్టుకున్నాడు, "మీ కప్పుడే ఎలా అందాయి?"

"మాకు అందుతాయి, ఎప్పటికప్పుడు."

ఆమె గాజుపెంకుల్లాంటి కళ్ళు భయం గొలిపేలా మెరుస్తున్నాయి.

అతనికి చెమటలు పడుతున్నాయి, వెర్రివాడిలా చూస్తున్నాడు.

ఆమె ముందుకు కదిలింది ఇంకా కఠినంగా చూస్తూ, "ఆమెని పరిహసించావట, మోహినిని? నిన్ను నీవు రక్షించుకోగలనన్నావట?..బహుశ నేనివ్వాళే వస్తానని వూహించి వుండవు....బందోబస్తు చేసుకోలేదు. మంచి పని చేశావు, నా పని సులువైంది. ఇదిగో కత్తి.... దింపుకో గుండెలో...."

ఆమె బ్యాగులోంచి కత్తి తీస్తుంటే, "నో!" అని అరిచాడతను.

ఆమె విసురుగా కదిలి అతని గుండెలో దించేసింది.

"నీలాంటి కుక్కకి ఇదే గతి!"

ఆమె లాగి మళ్ళీ దింపింది....అదే రంధ్రంలో, కత్తిని.

* * *

చటుక్కున కళ్ళు తెరిచి చూశాడు లాల్.

నిజంగానే నిద్రపోయాడు! ఎంతసేపయింది? వాచీ చూసుకుని ఉలిక్కిపడ్డాడు. వెంటనే లేచి గదిలో చుట్టూ చూశాడు. ఎప్పటిలాగే వుంది. మార్పు ఏమీ లేదు. కాలికి బంధం చూసుకున్నాడు. పరుపుకింద తాళం చెవి గుర్తొచ్చింది. వెంటనే దాన్ని తీసి ఆత్రుతగా చూసుకున్నాడు. దాన్నలాగే చూస్తూ దృష్టిని కేంద్రీకరించి ఆలోచనలో పడ్డాడు....

అప్పుడేదో ఆలోచించుకున్నట్లు తలూపి, దాన్ని తిరిగి యథా స్థానంలో పెట్టేసి పడుకున్నాడు. నెమ్మదిగా తల తిప్పి టేబుల్ మీద గాజు జగ్గుని చూశాడు. అందులో సగంవరకు నీళ్ళు కన్పిస్తున్నాయి. దాన్ని అందుకోబోతూ కావాలని కిందికి తోసేశాడు

ఫెళ్ళున పెద్ద చప్పుడు.

బయట వేగంగా అడుగుల చప్పుడు.

అప్పుడు తాళం తీస్తున్న అలికిడి.

తలుపు తెరచి సంతోష్ రివాల్వర్ గురిపెట్టాడు. గదిలో ఓమారు చూసి, లాల్ కాలికి బంధం ధైర్యమివ్వగా లోనికి అడుగుపెట్టాడు. లాల్ చెప్పకనే అతని దృష్టి నేలమీదపడి జరిగింది గ్రహించాడు.

లాల్ ఆందోళనగా చూస్తున్నాడు, కింద ముక్కలైన జగ్గుని.

"మంచినీళ్ళకోసం అందుకోబోతే...."

"మీకు మంచినీళ్ళు కావాలా?"

"దాహం బాగా వేస్తోంది."

"ఓ.కే., వన్ మినిట్!" అతను వెనక్కి తిరిగి బయటికి నడిచాడు. లాల్ గబగబా తాళంచెవి తీసి, గొలుసు తాళం విప్పేశాడు. కిందికి దిగి గొలుసుని కాలికి చుట్టేసుకుని తాళాన్ని చేతిలో తీసుకున్నాడు. ఒక్క గంతులో తలుపు దగ్గరెకెళ్ళి బయటికి చూశాడు. సంతోష్ ఇంకో జగ్గుతో వస్తూ కనిపించాడప్పుడే....లాల్ తలుపు పక్కకు జరిగిపోయి, గోడకతుక్కుని నిలబడ్డాడు, తాళాన్ని గట్టిగా పట్టుకుంటూ.

అప్పుడు అడుగులు దగ్గరయ్యాయి....సంతోష్ నిస్సంకోచంగా లోపలికొచ్చేశాడు. కుడిచేతిలో రివాల్వర్, ఎడమ చేతిలో నీళ్ళ జగ్గుతో. అతను రెండడుగులు లోపలికి వేసి, ఒక్కసారి అదిరిపడి వెనక్కి తిరగబోయాడు.

వెనకనుంచి తలమీద గట్టి దెబ్బపడింది—

జగ్గుని వదిలేస్తూ గిర్రున తిరిగాడు రివాల్వర్‌తో.

మరో దెబ్బ పడింది తలమీద.

బాధతో కళ్ళు మూతపడి గట్టిగా మూల్గాడు, రివాల్వర్ ఎగిరిపోయింది. అతనిమీదికి లంఘించి మరో దెబ్బ వేశాడు లాల్, తాళంతో. ఇద్దరూ కిందపడ్డారు, గాజు పెంకులకి కొంచెం దూరంలో.

అప్పుడు లాల్ మరో దెబ్బ వేశాడు, శక్తినంతా కూడదీసుకుని.

* * *

ఆ కారు చార్మినార్ వైపు ఓల్డ్ సిటీ ఇరుకు వీధుల గుండా సాగిపోయింది. ఆమె చాలా ప్రశాంతంగా డ్రైవ్ చేస్తోంది. ఒకసారి టైము చూసుకుని, వేగం ఇంకా పెంచింది. కొన్ని వీధులు తిరిగి, ఓ పురాతన కట్టడంముందు కారాపి దిగింది.

"ఆ వీధిలో ఎవరూ తిరగడంలేదు, అంత రాత్రివేళ ఆమె నిర్భయంగా అడుగులేయసాగింది. ఆమె అడుగులు ఒక లయప్రకారం పడుతున్నాయి సిమెంటు రోడ్డుమీద. ఆ ఇంటి మెట్లెక్కి ఆమె గొళ్ళెంతో తలుపుమీద కొట్టింది. జవాబులేదు. అప్పుడు మళ్ళీ కొట్టింది. ఎవరిదో దగ్గు, ఆ తర్వాత ఒక మగ గొంతు వినిపించాయి.

అతను తలుపు తీసి కళ్ళు నులుముకుంటూ చూశాడు.

"అక్తర్ హుస్సేన్?" అడిగిందామె తీక్షణంగా చూస్తూ.

తలూపాడతను, అవునన్నట్లు.

ఆమె చొరవగా లోపలికి వెళ్ళింది. ఆ ముందు గదిలో ఎవరూ లేరు.

అతను కలవరపడి చూశాడు, "కౌన్ .... కౌన్ హై ఆప్?"

"సుహాసిని, స్నేక్ సొసైటీ."

అతను తృళ్ళిపడ్డాడు. "సుహాసినీ! తుమ్ సుహాసినీ?"

"అవును—" తలూపిందామె, "నీమీద ఉత్తరం వచ్చింది. నువ్వు నీ విధవరాలు వదినని వేధిస్తున్నావట?"

అప్పుడామె చేతిలో కత్తిని చూశాడతను. వంకర తిరిగి వాడిగా ఆ లైటు వెలుగులో తళుక్కున మెరుస్తోంది. "ఏమిటి....ఏమిటి....నువ్వేం చేస్తున్నావ్?" అతను చేతులడ్డం పెట్టాడు, "నేను వేధించలేదు! నేనేం చేయలేదు! పొరబడ్డావు!"

"జులేఖా బేగం వ్రాసింది."

ఆమె ముందుకు కదిలింది కత్తితో.

అతను పారిపోతూ కెవ్వున "బచావో! బచావో!" అని అరిచాడు.

ఆమె పట్టుకుని గుండెలో దింపేసింది కత్తిని.

వెనుక గదిలో అలికిడవుతోంటే చటుక్కున ఆ గది తలుపు గొళ్ళెం పెట్టేసి, లాగి మళ్ళీ దింపింది కత్తిని అదే రంధ్రంలో.

అతను కింద విరుచుకుపడ్డాడు, రక్తం ప్రవహిస్తోంటే.

ఆమె బయట దూకింది, ఇంట్లోంచి అరుపులు విన్పిస్తోంటే.

* * *

అతనిమీదనుంచి లేచి లాల్, గబుక్కున తలుపులు మూసి గడియపెట్టేశాడు.

కాట్ దగ్గరికి వెళ్ళి దానిమీద బెడ్‌షీట్‌ని లాగేశాడు. దాన్ని పేలికలుగా చింపి అతని కాళ్ళు చేతులు కట్టేశాడు. నోట్లో కుక్కాడు. రివాల్వర్ తీసుకున్నాడు.

అప్పుడు తలుపు తీసి బయటికి చూశాడు. యెవరూ

లేరు. ఒక లైటు వెలుగుతోంది. బయటకొచ్చి తలుపులు మూసి తాళం వేసేశాడు. రివాల్వర్ పట్టుకుని బూట్లు శబ్దం చేయకుండా చిన్నగా ముందు గదులవైపు నడిచాడు. మొదటి గదిలో ఎవరూ లేరు. రెండు మంచాలున్నాయి. ఆ తర్వాత గదిలో కూడా ఎవరూ లేరు. అదే చివరి గది. తలుపులోంచి అవతల పరిసరాలు కనిపిస్తున్నాయి, చీకట్లో అస్పష్టంగా. అతనింకో రెండడుగులు వేసి తలుపు ప్రక్కన చేరాడు. బయటికి చూశాడు....అప్పుడే ఓ ఆకారం ముంగిట్లో తచ్చాడుతూ వుండడం చూశాడు. అది సిగరెట్ తాగుతోంది.

లాల్ కాలు వెనక్కి చాపి, లాగి తన్నాడు తలుపు రెక్కని.

అది ఫటేలున మూసుకుని, మళ్ళీ తెరచుకుంది చటుక్కున.

ఆ శబ్దానికి ఆ ఆకారం ఇటు మళ్ళి చూసింది. లాల్ మళ్ళీ అలాగే తన్నాడు. తలుపు మళ్ళీ ఫటేలున మూసుకుని మళ్ళీ తెరచుకుంది.

ఆ ఆకారం సిగరెట్ పారేసి గబగబా రాసాగింది. అడుగులు దగ్గరవుతూంటే లాల్ ఇంకోసారి తన్నకుండా వుండిపోయాడు గోడకతుక్కుని, రివాల్వర్ని సిద్ధంగా తిప్పిపట్టుకుని.

ఆ ఆకారం లోనికి అడుగుపెడుతూ, "ఏమయింది, సంతోష్? తలుపునెందుకు తంతున్నావ్?" అంది.

వెనకనుంచి లాల్ దానిమీద విరుచుకుపడ్డాడు.

కిందపడదోసి రివాల్వర్తో తలమీద మోదాడు. ఓ గట్టి మూలుగు మూల్గి అచేతనమయిపోయిందా ఆకారం.... ఒక్క ఉదుటున లేచి నిలబడ్డాడు లాల్. అదే క్షణంలో

అతను కొయ్యబారిపోయాడు....

దూరంగా హెడ్ లైట్లు కన్పిస్తున్నాయి, దగ్గరవుతూ వేగంగా.

• • •

"నువ్వు-నువ్వు సుహాసినివా?" అన్నాడతను షాక్ తిని.

తలూపిందామె, కారు డ్రైవ్ చేస్తూ. కారు అమీర్ పేటనుంచి పంజగుట్టవైపు వస్తోంది.... మెయిన్ రోడ్స్ మీదుగా గాకుండా చిన్న చిన్న వీధుల్లోంచి వస్తోంది.

అతను బెదిరిపోతూ సీటు చివరికి జరిగాడు. "నన్ను-నన్నెక్కడికి తీసికెళుతున్నావ్!"

ఆమె చెప్పింది అలాగే డ్రైవ్ చేస్తూ, "నీ ఇంట్లో జనాభా ఎక్కువ వుంది. అక్కడ వీలుపడదు. అందుకని ఒక చిన్న అబద్ధంతో నిన్నిలా తీసికొస్తున్నాను...."

"ఎక్కడికి తీసికెళ్తావు? ఏం చేస్తావు? కారాపు!"

"నువ్వు రాధారాణితో స్వర్గం చూశానని సంబర పడిపోయావు కదూ? ఇప్పుడు నే చూపించే స్వర్గాన్ని చూడు...."

ఆమె వేగం తగ్గిస్తూ, ఎడమచేత్తో కత్తిని అతని గుండెలో దూసింది.

అతను గుండెపట్టుకుని డోర్ మీదకు ఒరిగిపోయాడు. ఆమె కత్తిని మళ్ళీ అదే రంధ్రంలోకి బలంగా దూసి, డోర్ తెరచి అతన్ని కిందకి తోసేసింది.

తిరిగి వేగం పెంచి దూసుకెళ్ళిపోయింది.

• • •

కృష్ణన్‌నుంచి ఫోన్ నెంబరుగల అడ్రసు తీసుకుని, జాన్ విద్యానగర్‌లో ఒక ఇంటిముందు కారాపి దిగాడు.

అప్పుడు ఏడున్నరవుతోంది సమయం, రాత్రి.

అతను సందేహంగా జేబులో రివాల్వర్‌ని తడుముకుంటూ వెళ్ళి తలుపు కొట్టిన కొన్ని క్షణాలకి వచ్చి తీసిందొక స్త్రీ.

ఆమెకు యాభై ఏళ్ళుంటాయి.

జాన్ ఆమెనూ, ఆమె వెనుక ఇంట్లో పరిసరాల్నీ గమనిస్తూ, "బాలరాజ్ ఇల్లు ఇదేననుకుంటాను?" అన్నాడు.

ఆమె తలూపింది, ఒక్కసారి ఆతృత చెందుతూ.

కానీ అతను యింట్లో లేడని చెప్పింది.

రెండు రోజుల్నుంచీ రావడం లేదంది. ఏ కబురూ ఇంతవరకు లేదంది. ఏమయిపోయాడో తెలియక దిగులు చెందుతున్నట్టు చెప్పింది. తనెవరని జాన్‌ని అడిగింది. భర్తతో ఏం పని? తనకు అతను కన్పించాడా?

లేదని చెప్పి జాన్, ఆమె భర్త ప్రకాష్‌నగర్‌లో తన మేడ అద్దెకి తీసుకున్నట్టూ, అందులో ఎప్పుడు దిగుతున్నారో తెలుసుకోడానికి తను వచ్చినట్టూ వివరించాడు.

ఆమె కలవరంగా చూసింది. మేడ అద్దెకి తీసుకున్నాడా? దేనికి? తనతో ఏమీ చెప్పలేదే? ఆమె సందేహాలు తను తీర్చలేనని చెప్పి జాన్, అతన్ని అత్యవసరంగా కలుసుకోవాలని కోరాడు. భర్త జాడ తనకేమీ తెలియదందామె. తను యింటికి రాకపోతే తన కోసం ఎక్కడా వెతకవద్దంటూ భర్త చెప్పినట్లు వివరించిందామె.

అప్పుడు — అతనికోసం యింటికెవరొస్తుంటారని అడిగాడు జాన్.

ఎవరూ రారని చెప్పిందామె. అతనికేదేనా వెహి

కల్ వుందా అనే ప్రశ్నకు లేదని జవాబు. నడిచే వెళ్ళాడు ఇంటినుంచి. ఇంటికి ఫోన్స్ ఎవరైనా చేసుంటారా అనడిగినప్పుడు, ఈ రెండు రోజుల్నుంచీ ఎవరూ చేయడంలేదని విచారంగా అందామె. ఎవరు చేసుంటారని అడిగితే, తనకు శంభూనాథ్ పేరొక్కటే తెలుసునని చెప్పింది.

అతనెవరో తెలియదు. తను చూడలేదు. ఎప్పుడూ ఇంటికి రాలేదు. ఎక్కడుంటాడో, ఏం చేస్తాడో వివరాలు కూడా తెలియవు. భర్త ఏం చేస్తాడో, ఎలా సంపాయిస్తాడో చెప్పడు. కానీ తననీ పిల్లల్నీ ఏ లోటు రాకుండా చూసుకుంటాడు.

బాలరాజ్ గురించి ఇంకా అడుగుతూ అతని ఫోటో కావాలన్నాడు జాన్. ఆమె అనుమానంగా చూసింది. అది గ్రహించి తనను కలుసుకున్న బాలరాజ్ ఇతను ఒక్కడేనా సందేహం తీర్చుకోవాలన్నాడు జాన్. పొరబడి రాంగ్ అడ్రసుకు రాలేదు కదా? ఆమె తేరుకుని ఫోటో లేదంది ఇంట్లో. అతను ఇంటినుంచి వెళ్ళినప్పుడు ఏ దుస్తుల్లో వున్నాడో చెప్పమన్నాడు జాన్. ఆమె చెప్పింది. తెల్ల షర్టు, బూడిద రంగు ప్యాంటు, అదే రంగు రెయిన్ కోటుతో....

జాన్ ఉద్రేకపడ్డాడు. అణచుకున్నాడు. అతనికా రెయిన్ కోటు మనిషి స్ఫురించాడు. సుహాసినికోసం ఆ రాత్రి తమమీద దౌర్జన్యం జరిపిన మనిషి! చంద్రాయణ గుట్ట ప్రాంతంలో మొన్న వళ్ళు కాలి చచ్చిపడున్న మనిషి!

అతనే ఆమె భర్త బాలరాజ్. భర్త చావు ఈమెకింకా తెలియదు. దాన్ని గోప్యంగా వుంచారు పోలీసులు.

అతడిని అతడి గ్యాంగ్ మనుషులే తగులబెట్టివుంటారు. అందుకే ఈ మెను కాంటాక్టు చేయడంలేదు శంభూనాథ్ గానీ, మరెవరూగానీ— బాలరాజ్ కోసం సంబంధాలు తెంచుకున్నారు ఇక్కడ్నించి.

జాన్ సానుభూతిగా చూశాడా మెను. ఆ దుర్వార్త చెప్పాలా వద్దా అని ఆలోచించాడు. అది కృష్ణన్‌కే వది లేస్తే మంచిదనుకుంటూ కదిలాడక్కడ్నించి, ఆమె దగ్గర సెలవుతీసుకుని.

జాన్ తిన్నగా ప్రకాష్‌నగర్ వెళ్ళి, అక్కడ సొసైటీ అద్దెకి తీసుకున్న మేడముందు కారాపాడు. అక్కడ డ్యూటీ మారిన మఫ్టీ పోలీసులు అతనివద్ద కొచ్చారు. వాళ్ళేమీ ప్రోగ్రెస్ లేదన్నారు. ఇంటివైపు కవరూ రాలేదన్నారు. సాయంత్రం క్రైం బ్రాంచి పార్టీ వచ్చి ఇంటిని సోదా జరిపి వెళ్ళిందని చెప్పారు, తాళం తెరిచి. కానీ ఇంట్లో ఏమీలేదు. ఫర్నీచరు కూడా లేదు. పూర్తిగా ఖాళీగా వుంది.

జాన్ అక్కడ్నించి తిన్నగా తమ ఇంటికి పాగి పోయాడు.

అప్పుడు తొమ్మిదవుతోంది సమయం.

ఇంట్లో కెళ్ళగానే కృష్ణన్‌కి ఫోన్ చేసి, అతనిచ్చిన అడ్రసువద్ద తను తెలుసుకున్న విషయాలు చెప్పాడు. ఆ రెయిన్‌కోటు మనిషే బాలరాజ్ అనీ, అతని ఇంటిని కనిపెట్టమనీ కోరాడు. ఇంకా స్నేక్ సొసైటీకి అద్దె కిచ్చిన ఇంటి యజమానినీ, దాన్ని ఇప్పించిన ఎస్టేటు ఏజెంట్‌నీ జాగ్రత్తలో వుండాలని హెచ్చరించి, అవసర మయితే వాళ్ళకి సెక్యూరిటీ కట్టించమని చెప్పాడు.

అప్పుడు ప్రస్తుతం తనేం చేస్తున్నాడో స్పష్టంగా

వివరించి, తర్వాత మళ్ళీ ఫోన్ చేస్తానని చెప్పి పెట్టేసి, గబగబా సేఫ్ దగ్గరికి వెళ్ళాడు.

దాన్ని తెరిచి, అందులో దాచిన ఫిల్మ్ రోల్ ని తీసుకుని వేగంగా ఆఫీసుకెళ్ళిపోయాడు.

ఆఫీసులో అతను వెనుక గదిలో ఏర్పరచుకున్న చిన్న పార్టిషన్ లోని డార్క్ రూంలో దాదాపు గంటసేపు వుండిపోయాడు, ఆ ఫిల్మ్ తో.

పదిన్నరకు మూడు ఫోటోలు పట్టుకుని వెలుపలి కొచ్చాడు.

అవన్నీ నిన్న మూడు హత్యాస్థలాల్లో తీసినవి, ఆగంతకులవి. వాటిలో ఆగంతకుల్ని గుర్తించి వాళ్ళ తలల్ని స్కెచ్ పెన్నుతో చుడుతూ, సిగరెట్ వెల్గించి ఆలోచించసాగాడు.

జాన్ సిగరెట్ వెల్గించి సరిగ్గా ఆలోచించలేదు. దాన్ని పారేసి ఆఫీసు మూసేసి, తిరిగి బయల్దేరాడా ఫోటోలతో.

స్టేడియం రోడ్ లో డ్రింక్ మోర్ బార్ ముందు కారాపి దిగి తలుపు కొట్టాడు. అక్కడున్న కాపలా పోలీసుల్ని విష్ చేశాడు.

కిషోర్ తలుపు తీశాడు.

జాన్ లోపలికెళ్ళగానే ముఖేష్, రఫీ కూడా వచ్చి విచారంగా నిలబడ్డారు.

బరోడానుంచి దారువాలా తమ్ముడింకా రాలేదని చెప్పారు వాళ్ళు.

జాన్ ముఖేష్ తో అన్నాడు. "ముఖేష్, నువ్వో నల్ల మనిషితో మరొకడు ఇక్కడికి వస్తుండడం చూశానన్నావు కదూ మొన్న?"

"అవును, సాబ్."

"అతన్ని గుర్తుపడతావా?"

"గుర్తుపడతాను, సాబ్."

జాన్ ఫోటోలు తీశాడు. వాటిని ముఖేష్‌కిచ్చాడు. ముఖేష్ ఆ మూడింటినీ చూస్తోంటే, "గుర్తుపెట్టిన ముఖాలు చూడు!" అన్నాడు జాన్.

"ఇతనే, సార్!" అన్నాడు ముఖేష్ ఉద్రేకంగా.

జాన్ ఆ ఫోటో తీసుకుని చూశాడు. ఆ మనిషి ఓల్డు సిటీలో తప్పించుకుంటూ పాతుర్దైన ఆగంతకుడు.

"అతన్ని రెండుసార్లు చూశాను, సాబ్. కొద్ది రోజుల క్రితమే మధ్యాహ్నం పూట వచ్చి ఒక కేసు విస్కీ పట్టుకెళ్ళాడు! ఇప్పుడు గుర్తొచ్చింది!"

"ఎక్కడికి?"

"తెలియదు. కానీ బ్రహ్మానగర్ కని చెప్పాడు ఆటోవాడితో. ఆ కేసుని నేనే తీసుకెళ్ళి ఆటోలో పెట్టాను—"

జాన్ అక్కడ్నించి కదిలాడు రెండు నిమిషాల తర్వాత. కారులో వేగంగా బ్రహ్మానగర్ చేరుకున్నాడు, బేగంపేట దాటి.

అప్పటికి బాగా రాత్రయింది.

ఒక వీధిలో అతను కారు దిగి, జేబులోంచి ఆ ఫోటోగ్రాఫ్ తీసి పట్టుకున్నాడు. ఆ వీధిలో చాలావరకు మేడలున్నాయి. వాటిని చూసుకుంటూ వెళ్ళసాగాడు.... అవన్నీ అంధాకారంలో వున్నాయి. అంతా నిశ్శబ్దంగా వుంది. కానీ ఒక మేడలో లైట్లు వెలుగుతూ కన్పించాయి. జాన్ అక్కడ సందేహిస్తూ నిలబడ్డాడు ఫోటో పట్టుకుని. లోపల ఎవరూ కన్పించలేదు. గేటు మూసివుంది.

అతను గేటుమీద చప్పుడు చేశాడు.

ఎవరో లోపలినుంచి వస్తూ కన్పించాడు.

అతను గేటు తీయకుండానే జాన్ని ఎగాదిగా చూడ సాగాడు, "ఎవరు కావాలి?"

జాన్ అతడికో ఫోటో చూపించి, అందులోని మనిషి ఈ ప్రాంతాలో వుంటాడా అని అడిగాడు.

ఆ మనిషి టార్చివేసి ఫోటోని చూశాడు. వెంటనే టార్చి ఆర్పేసి గేటు తీశాడు. "ఇతన్ని చూశాను. ఆ ఎదురు వరుస ఆఖరి ఇంట్లో వుంటాడు" అని బయటికొచ్చి చూపించాడు.

జాన్ అటు తల తిప్పాడు.

వెంటనే అతను తల పట్టుకుని కూలిపోయాడు.

"నువ్విచ్చిన అడ్రసు కరెక్టే, మిస్టర్ జాన్!" అన్నాడు మనిషి టార్చి జేబులో పెట్టుకుంటూ.

• • •

హెడ్లైట్స్ని చూసి లాల్ ఒక్కక్షణం కొయ్యబారాడు.

అవి దగ్గరయిపోతూంటే తలుపు మూసేసి, ఆ ఆకారాన్ని ఎత్తుకుని పరుగుతీశాడు చివరి గది దగ్గరికి. తాళం తీసి, అతన్ని గదిలో కిందపడేసి, తిరిగి మూసేశాడు యెప్పటిలాగే.

అతను తాళం వేస్తున్న క్షణాలోనే ఇంటిముందు వచ్చి ఆగింది మెటడార్ వ్యాను. అతను మధ్య గదిలోకి వస్తూ అది చూసి పక్కకు తప్పుకుని తలుపు చాటుకు నక్కాడు. వ్యాన్ డోరు తెరచుకుందప్పుడు. ఒక ఆకారం కిందికి దిగింది. అదింకా దేన్నో కిందికి దించింది. దాన్నెత్తుకుని రాసాగింది గబగబా....

లాల్ వేగంగా అటూ ఇటూ చూశాడు. ఎడమవైపు మంచాలు కన్పించాయి. వాటికింద చోటువుంది. అతనటు వైపు వురుకుతూ ఇంకోసారి ముందు గదిలోకి చూశాడు. అప్పుడే లోపలికొచ్చిన ఆ మనిషి లైటు వెలుగులో స్పష్టంగా కన్పించాడు. జింబో. అతని చేతిలో ఒక అల్యూమినియం ట్రంకు వుంది.

"సంతోష్! .... సంతోష్! .... పండుకోతీ!.... కమానమ్మా!" పిలుస్తూ రాసాగాడు. లాల్ మంచాలకింద దూరి బోర్లా పడుకుని చూడసాగాడు, రివాల్వర్ గురిపెట్టి పట్టుకొని.

జింబో ఆ గదిలోకొచ్చి, మంచాలమీద చూసి, మళ్ళీ అరిచాడు. "సుభాష్! సంతోష్! కమాన్ కిడ్స్! ఎక్కడున్నారు....వచ్చేయండమ్మా! మన ఆపరేషన్ ఓపెనింగ్ పార్టు ఘనంగా సక్సెసయిందోచ్!"

అరుచుకుంటూ వెనుకకు వెళ్ళిపోయాడు. చిన్న నడవ దాటి తాళం వేసివున్న ఆ చివరిగది ముందాగి, కసురుకుంటూ మళ్ళీ వెనుదిరిగాడు.

"బాస్టర్డ్స్, మళ్ళీ బ్రోతల్స్ కెళ్ళిపోయారన్నమాట, ఇల్లు వదిలేసి! మై గాడ్! శంభూనాథ్ రాకపోవడం మంచిదైంది! లేకపోతే షూట్ చేసి పారేసేవాడు నన్ను ఇలాంటి శిష్యుల్ని పెట్టుకున్నందుకు! ఆ రాస్కెల్స్నిరానీ, బూతులు తిడతాను! రేపుదయమే ఆ గుడిసెల్లోంచి...."

"పెట్టె కిందపడేసి చేతులెత్తు, జింబో."

మధ్య గదిలోకి రెండడుగులు వేసినవాడల్లా కొయ్యబారి నిలబడిపోయాడు — వెనకనుంచి ఈ మాటలూ మెడకేదో చల్లగా తగిలేసరికి.

"జింబో, పెట్టె పడేసి చేతులెత్తెయ్యి!"

మళ్ళీ హెచ్చరించిందా గొంతు.

అతను ట్రంకు వదిలేసి చేతులెత్తాడు వెంటనే.

లాల్ అతని తల వెనుక ఫట్‌మని కొట్టాడు, రివాల్వర్‌ని తిప్పి పట్టుకొని. అతను తల పట్టుకోకముందే ఇంకోసారి కొట్టాడు అదే బలంతో. మొదలు నరకిన మానులా కూలిపోయాడు జింబో. అతను తల పైకెత్తి కళ్ళు మూతపడుతుండగా లాల్‌ని చూశాడు.

"బలే దెబ్బతీశారు సర్, మీరు...." అస్పష్టంగా అన్నాడు.

"అయాం సారీ, జింబో."

రివాల్వర్ జేబులో పెట్టుకుని, స్పృహ తప్పిన జింబోని లాక్కెళ్ళి ఆ గదిలోనే వదిలాడు లాల్.

వాళ్ళు ముగ్గురూ వరుసగా పడున్నారు.

లాల్ ముగ్గురి జేబులు వెతికాడు. జింబో జేబులో రివాల్వర్ మాత్రమే వుంది. దాన్ని తీసుకుని, భారంగా నిట్టూరుస్తూ బయటికొచ్చాడు. గదికి తాళం వేసి, వేగంగా ఇంటిని సోదా చేశాడు. ఏమీ దొరకలేదు పనికొచ్చేది. ఆ ట్రంకులో కూడా ఏమీ లేదు. బయటివరికి వ్యాను చేరుకున్నాడు. అదిప్పుడు ఆకుపచ్చ రంగులోకి మారి పోయింది.

వ్యానులో వెతికి, అందులో ఏమీ లేకపోవడంతో, ఇంటి తలుపులు మూసేసి, తిరిగివచ్చి వ్యానెక్కాడు. స్టార్టుచేసి వేగంగా పోనిచ్చాడు.

మెయిన్ రోడ్డుమీదికి వచ్చాకగాని తెలియలేదు, అది బోవెన్‌పల్లి ప్రాంతమని, ఆ ఇల్లు మైదానంలాటి ఏకాంత ప్రదేశంలో వుందని. అతనలా డ్రైవ్ చేస్తూ మధ్యలో కన్పించిన ఒక పెట్రోలు బంకులోకి తిప్పాడు.

అక్కడ దిగి, లోపలికెళ్ళి, ఫోన్ ఎత్తి చకచకా డయల్ చేయసాగాడు....

• • •

అప్పుడామె గేటు తీసుకుని లోపలికెళ్ళి, ఆ యింటి బెల్లు నొక్కింది.

పరిసరాలన్నీ నిశ్శబ్దంగా వున్నాయి.

లోపలెక్కడో బెల్ మోగి, వెంటనే అలికిడి వినిపించిందామెకు. పక్కకు జరిగి నిలబడిందా చీకట్లో.

కాస్సేపట్లో తలుపు తీసి, ఒకతను చూశాడు. "ఓహ్, నిర్మల!" అన్నాడతను. బయటికొస్తూ. "పద పద, అటు వెళ్ళాం....నువ్వొస్తావనే చూస్తున్నాను....ఇంత రాత్రి వచ్చావేం...."

అతను మెట్లు దిగుతున్నాడు.

ఆమె కదల్లేదు. "నిర్మల పంపింది నన్ను" అంది చిన్నగా.

అతను ఆగి వెనక్కి చూశాడు. "నువ్వా...." అంటూ ఇంకా దగ్గరికి వచ్చి చీకట్లో ఆమె ముఖాన్ని చూడడానికి ప్రయత్నించాడు, "నువ్వా...."

"నిర్మల వ్రాసింది మాకు. ట్యూషన్‌కొచ్చే ఆమెని నువ్వు నీ భార్య ఇంట్లో లేనిది చూసి...." అక్కడితో ఆమె మాటలాగిపోయాయి.

అదిరిపడ్డాడతను. "నువ్వు....నువ్వు....సుహాసినీ!"

"లెక్చరర్ జనార్థనరావు, నువ్వు మర్యాద తప్పి ప్రవర్తిస్తున్నావు."

ఆమె చేతిలో కత్తి మెరిసింది.

దాన్ని చూపిస్తూ దగ్గరికొచ్చిందామె. అది తళుక్కున మెరవడం చూశాడతను, వెనక్కి గంతులేస్తూ. ఆమె

ముందుకు కదిలింది ఇంకా వేగంగా, బుసలుకొడుతూ. ఆమె ముక్కు పుటాలు అదురుతున్నాయి. కళ్ళలో విచిత్రకాంతి మెరిసింది. కెవ్వున కేక వేసి అతను ఆమె చేతిని పట్టేసుకున్నాడు.

అప్పుడామె యెడమ చేత్తో ముఖంమీద కొట్టిందిలాగి. అతడా చేతిని వదలకుండా పట్టుకుని లాగాడు. కత్తి జారి కింద పడిపోయింది. ఇద్దరూ తూలి మెట్లమీంచి జారి కిందపడ్డారు. అతడింకా అరుస్తూ ఆమెని వదలకుండా భుజాలు పట్టుకున్నాడు. అతడిమీద ఆమె పెనుగులాడుతూ రక్కుతోంది, కొరుకుతోంది. కత్తి కోసం చేయి చాపుతోంది. కత్తి అతని చేతికి చిక్కిపోయింది. అతన్నింకా కొట్టి, కొరికి, రక్కి లేచిపోతూండగా కత్తి విసిరాడు తను చేత్తో. ఆమె చేతిలోకి వచ్చి దిగింది కసుక్కున, కుడిచేతిలోకి. అతనొక్క ఉదుటున లేస్తూండగా ఆమె లాగిపెట్టి కడుపులో తన్ని పరుగుతీసింది గేటువైపు. గేటు తీసుకుని బయట ఉరకసాగింది శక్తి కొద్దీ....

అతను వెనుక అరుస్తూ పరుగెత్తుతోంటే అలజడికి ఇళ్ళలో జనం లేచి వచ్చారు. "పట్టుకోండి హంతకిని! పారిపోతోంది. పట్టుకోండి ఆమెని!" అతని అరుపులకి వాళ్ళంతా ఆలస్యం చేయకుండా వెంటపడ్డారు. ఇరవై గజాల దూరంలో వురుకుతున్న ఆమె మీదికి రాళ్ళు విసరసాగారు గట్టిగా కేకలు వేస్తూ. ఆ రాళ్ళ వర్షాన్ని తప్పించుకుంటూ ఆమె యెవరికీ అందకుండా వెళ్ళి కారెక్కేసింది. స్టార్టు చేసేసింది. మరొక్క క్షణం అక్కడ వుండకుండా దూసుకెళ్ళింది — వెనుకనుంచె టపటపమని కారుమీద రాళ్ళు పడుతోంటే.

కారు కనుమరుగైంది. జనం ఆగిపోయారు. జనార్థన రావుని చుట్టుముట్టారు. అతనింకా ఆవేశంతో వూగిపోతూ, రక్తం అంటిన ఆ కత్తిని పట్టుకుని పరుగు తీశాడు.

"ఎక్కడికి?" అరిచారందరూ.

"పోలీస్ స్టేషన్‌కి!" అతడలాగే వురికాడు.

* * *

"హౌ ఈజిట్ పాసిబుల్?" అన్నాడు లాల్ ఆందోళనగా, కృష్ణన్‌ని చూసి.

కృష్ణన్ తల వంచుకున్నాడు, "అలా జరిగింది, మిష్టర్ లాల్. నన్నేం చేయమంటారు? మేం వెళ్ళేసరికి వాళ్ళు తెలివిలోకొచ్చి తెలివిగా తప్పించుకున్నారు. నన్నేం చేయమంటారు?"

"డామిట్!"

"డామిటే మరి."

"ప్లీజ్, బి సీరియస్, కృష్ణన్."

నవ్వాడు కృష్ణన్. "ఎలా వుండమంటారు? మీ పొరపాటూ వాళ్ళ తెలివితేటలు చూస్తే నవ్వొస్తోంది. మీరా మిగతా ఇద్దర్నీ కూడా కట్టి పడవేయలేదు. వాళ్ళిద్దరు తెలివిలోకొచ్చి మిగిలినవాడి కట్లు విప్పేసి, కాట్‌ని లాగి, దానిమీద టేబుల్‌ని ఎక్కించి, టేబిల్ పైన తాము ఎక్కి, పైన కప్పుమీద పెంకులు తీసేసి బయట పడ్డారు—కప్పుమీకి పారిపోయారు."

"ఓహ్, డామిట్! మరి జాన్ ఏమయ్యాడు?"

ఈ ప్రశ్న రాత్రినుంచీ అడుగుతున్నాడు లాల్. కృష్ణన్ సమాధానమొక్కటే. తెలియదు, ఏమయ్యాడో.

(ఇంకా వుంది)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును. •



# క్రేమేలో తమాషాలు

## రవి గాంచని చోటు - ?

"అయ్యా కవిగారూ! రవి చూడని చోటును కవి చూస్తానంటారు. నిజమేనా?"

"నిజమే బాబూ! సోదాహరణముతో ఋజువు — చేయనా?"

"అదే నాకు కావాలి. నా పెన్ను పెద్ద కాల్వలో పడింది. దాన్ని తీపిస్తే నిజమని నమ్ముతాను."

—చాగాపురం నాగేశ్వరరావు, గద్వాల.

## 32 + 4 పండ్లు

ఓ ముసలివాడు బస్సులో ప్రయాణిస్తున్నాడు. ప్రక్కన కూర్చున్న ఒక కుర్రాడు ముసలాడి కాలును త్రొక్కాడు. తనే సర్దుకుని కూర్చున్నాడు ముసలివాడు. మళ్ళీ కాలు తొక్కాడు ఆ కుర్రాడు. అయినా మళ్ళీ సముదాయించు కొన్నాడు ముసలివాడు.

మళ్ళీ కాలు తొక్కగానే, ముసలివాడు చిర్రెత్తిపోతూ "చూడు! ఇంకొక్కసారి నా కాలు త్రొక్కావంటే, నోట్లోని ముప్పై ఆరు పండ్లు రాలిపోయేలా కొడ్తాను గుర్తుంచుకో" అన్నాడు.

"ఏమండీ పెద్దమనిషిగారు! మన నోట్లో వుండేది కేవలం ముప్పై రెండు పండ్లేగా? మరి ముప్పై ఆరు పండ్లు యెలా పగలగొడ్తారు?" అన్నాడు కాలు త్రొక్కినవాడి

స్నేహితుడు.

"నీవూ యిలా మధ్యలో వచ్చి వాగుతావని నాకు ముందే తెలుసు. అందుకే నీ నోట్లోని నాలుగు పండ్లు కూడా లెక్కవేసి మొత్తం ముప్పై ఆరు పండ్లు అన్నాను" అన్నాడు సమయస్ఫూర్తిగా.

—సాకరే సురేంద్రనాథ్, ఆదోని.

## జేబు దొంగలు ?

"ఒరే! రాములూ! నిన్ను అయ్యగారు వెంట పెట్టుకు రమ్మన్నారు" అన్నాడు 203.

"నన్నా! ఆయన కియ్యవలసిన మామూలు నిన్ననే ఇచ్చేసినానే" ఆశ్చర్యంగా అడిగాడు రాములు.

"ఏమో! నాకదేం తెలీదు. ఉన్నపళంగా వెంటేసుకు రమ్మన్నారు, ఆలస్యమయినాదంటే కోపగిస్తారు. నడు, నడు" అంటూ తొందర పెట్టాడు 203.

* * *

"మీ పిక్ పోకటర్స్, మా ప్రాణాలు తీస్తున్నారయ్యా. అరగంట క్రితం నీ ఏరియాలో ఎమ్. ఎల్. ఏ. గారి బావ మరిది పర్సు పోయిందట. పర్సులో 500 రూ॥ వున్నాయట. కాఫీపొడి రంగు, దానిమీద బంగారు రంగుతో వున్న "నెమలి" బొమ్మ వుందిట. వెంటనే దానిని తెచ్చి నా కందించు. లేదా నా సంగతి నీకు తెలుసుగా" అన్నాడు ఇన్‌స్పెక్టర్ ప్రభాకర్ దాదా రాముతో.

"సాబ్! మన హెడ్డుగారు వచ్చేముందే ఆ పర్సు 'రంగ' నాకు తెచ్చియిచ్చాడు. కాని దానిలో 5 రూ॥ వున్నాయి దొరా! మా మనుసులు నన్నెపుడూ మోసం చెయ్యరు దొరా!" అన్నాడు రాములు.

"నీ నాటకాలు కట్టిపెట్టు. నా సర్వీసులో నీలాంటి వారెందర్ని చూశానో, నీ వ్యాపారం సరిగా నడవాలంటే అరగంటలో ఆ పర్సు ఇక్కడ వుండవలసిందే. తెలిసిందా?" అంటూ లాఠీతో టేబుల్‌పై గట్టిగా కొట్టాడు ప్రభాకర్.

• • •

"దొంగనాయాలా! 500 రూ॥ వున్న పర్సులో 5 రూ॥ వున్నాయని నాటకాలు యాడతావురా! పుండాకోర్! ఈ ఈ రాము దాదా అంటే ఏంటనుకున్నావురా! ఎక్కడ పెట్టినావురా డబ్బుని" అంటూ రంగడ్ని కొట్ట ప్రారంభించాడు రాములు.

"నిజం దాదా! అమ్మతోడు! నా తోడు! ఆ భగవంతుని సాచిగా ఆ పర్సులో 5 రూ॥ వున్నాయి" అంటూ పడుతున్న దెబ్బలను కాచుకోసాగాడు రంగ.

తనకి అలుపు వచ్చేవరకు కొట్టి, ఆ బాధని మరిచేటందుకు మందు కొట్టి, రంగడ్ని బూతులు తిట్టుతూ నిద్రలోకి జారాడు రాము దాదా.

• • •

మర్నాడు రూ. 500 ల పర్సును ఎస్. ఐ. ప్రభాకర్, ఎమ్.ఎల్.ఏ. గారి బావమరిదికి అందజేశాడు.

"చూశావా! వీరాస్వామీ! ఒక గంటలో 5 రూ॥లకి 500 సంపాదించాను. దేనికైనా బుర్ర వుండాలోయ్! ఇదిగో ఈ వంద నువ్వుంచుకో, ఇనస్పెక్టర్‌కి ఫోనుచేసి హెల్పు చేసావుగా, ఇదిగో ఈ రహస్యం మన ఇద్దరి మధ్యే వుండాలి" అంటూ నాలుగు వందల కాగితాల్ని ముద్దు పెట్టుకొని, మళ్ళీ పర్సులో పెట్టుకున్నాడు, ఎమ్.ఎల్.ఏ. గారి బావమరిది గోపి. —కె. లక్ష్మి, బొంబాయి-71

